కళాప్రపూర్ణ యన్.టి.రామారావు సమర్పించు

శ్రీ భాస్కర చిత్ర వారి

# మావారి మంచితనం



# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 4 సంచిక: 10

ఏప్రిల్: 1979

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

• చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026




'అభిప్రాయాలు' శీర్షికలో ప్రచురింపబడే ప్రతి లేఖకూ చిన్న పారితోషికం ఐదు రూపాయలు

వనితాభ్యుదయానికి చేయూత యివ్వండి!

నేటి సమాజంలో స్త్రీలు విద్యావంతులై, ఉద్యోగులై అన్ని రంగాలలో తమ ప్రతిభను చూపిస్తున్న స్త్రీలను చూస్తే చాలా మందికి దురభిప్రాయం వున్నది. అంతేగాకుండా యింతమంది స్త్రీలు వుద్యోగం చేయటంవలన, నిరుద్యోగ సమస్య మరింత పెరిగిందన్న అభిప్రాయం కూడా చాలా మందికి వున్నది. మగవాడు తిరక్క చెడ్డాడు; ఆడది తిరిగి చెడింది అన్న ఓ 'బూజు' తత్వాన్ని పిరికి తనాన్ని నూరిపోసి సమాజంలో రాణించకుండా మట్టిలోనే ఈ వనితా రత్నాలను తెరవెనుకే దాచుచున్న దౌర్భాగ్యస్థితి మన దేశానికి పట్టిందంటే ఎంతటి దైన్యస్థితితో ఒక్కసారి మనసారా అవలోకిస్తే అర్థమవుతుంది. ఆడది బయటికి రాకూడదు. చదువులకు అర్హురాలు కాదు. వానికెక్కిన ఏ రంగంలో కూడా ఆడది ప్రవేశించకూడదు; అన్ని హక్కులు పుట్టుకతో సంపాదించుకున్నవాడు ఒక్క మగవాడే అన్న ధీమా, ఎక్కువమంది ఆడపిల్లలుంటే వారిని గుర్తించకపోవడం, ఒక్కగానొక్క మగపిల్ల వాడికే ఆ హక్కులన్నీ ప్రసాదించి, ఆడపిల్లల మానస వికాసానికి ద్రోహం చేస్తున్నంతకాలం ఈ భారతదేశం పురోగమించదు సరికదా అధః పతనానికి గురి అవుతుంది. కూతురుకు విద్యలో ఫస్ట్‌క్లాస్ వచ్చినా ఆమె ఉన్నత విద్యలకు అర్హురాలు కాదు. అదే కొడుకు పదిసార్లు పల్టీకొట్టినా ఫరవా లేదు. వాడి చదువుకోసం ఎంత శ్రమకైనా ఓరుస్తారు. కూతురంటే ఓ పదివేలు కట్నం వప్పచెప్పి బాధ్యత వదిలించుకునే ఓ 'వస్తువు'గా చూస్తారేగాని, ఆడపిల్ల శక్తిసామర్థ్యాలు కనిపెట్టి ఆడపిల్లను సమాజంలో ప్రకాశవంతురాలిగా తీర్చి దిద్దడానికి వెనుకాడే తలిదండ్రులు మన దేశంలో కోకొల్లలుగా కనబడ తారు. స్త్రీకి స్త్రీయే శత్రువు అనటంలో అసత్యం లేదు. 'వరకట్నం' నిషేధించాలి అని ఓ 'మహిళ' వేదిక ఎక్కి ఉపన్యాసం యిచ్చి తన కొడుకుకు ఏ పాతిక వేలో యిస్తేగాని మీ అమ్మాయి నా యింటి కోడలుగా చేసుకోను – అని నిక్కచ్చిగా తేల్చి చెబుతుంది! స్త్రీకి సమానహక్కులు యిచ్చాము, స్త్రీ సంక్షేమాలు నెలకొల్పాం అంటూ యింకా యింకా 'స్త్రీ' ఔన్నత్యాన్ని 'జలగ'ల్లాగ రక్తం పీల్చి హీనస్థితికి దిగజారుస్తున్నారు! ఎక్కడుంది ఈ సమానత్వం? ఏమైంది ఈ ఉపన్యాస చక్రవర్తుల నైతిక ప్రవర్తన? ఎంతమటుకు న్యాయం చేకూర్చకలుగుతున్నారు? 'స్త్రీ'కి యివన్నీ ప్రశ్నలే: భాష వచ్చని, కలం కాగితాలు వున్నాయని వాగ్ధాటి వున్నదని ఈ న్యాయాలను ఉపన్యాస వేదికలకు, పత్రికల పరం చేస్తూ తాము చేసేదేమో చేస్తున్నంతకాలం వనితలకు న్యాయం జరుగదు; జరుగబోదు.

**చేరాల ప్రమద్వర** **గుంటూరు**

వచ్చే సంచికలో
ఒక కథ
సుప్రసిద్ధ రచయిత్రి
డి. కామేశ్వరి రాసిన
"పరిష్కారంలేని సమస్య"

పన్ను మీద పన్ను!

మొన్న వచ్చిన సెంట్రల్ బడ్జెట్ చూశారా? 'ఎప్పుడూ మధ్యతరగతి వారిని హింసించం' అంటూనే వారినే హింసిస్తోంది – ఆ బడ్జెట్! కార్లు గొప్పవారు ఉపయోగిస్తారు కాబట్టి, కార్ల మీద, పెట్రోలు మీదా పన్ను బిగిస్తే, దానివల్ల వారు కష్టపడలేరనుకోడం – ఎంత అర్థం లేనిది! మధ్యతరగతి వాళ్ళు ఉపయోగించే టాక్సీల అద్దెలు పెరగలేదూ? పెట్రోలు పెరగడంవల్ల వాహనాల అద్దెలు పెరుగుతాయి. ఆ విధంగా వాటిల్లో రవాణా అయ్యే సరుకు ధర పెరగదూ? ఇవాళ సబ్బులు, పౌడర్లూ ప్రతివారూ, బీదా బిక్కి అందరూ వాడు తున్నారు – అదే వారి కనీసపు 'లక్జరీ' – అయితే గియితే! వాటి మీద కూడా పన్నులు వేస్తే బాధ పడేది ఎవరు? సబ్బుల ధరలు ఆ మధ్య పెరిగి పోతూ వుంటేనేగా – సామాన్యులకు అందుబాటులో వుండాలని జనతా సబ్బుల్ని ప్రవేశపెట్టింది?— ఇవాళ ప్రతివాళ్ళూ టూత్‌పేస్ట్‌లను వాడుతున్నారే – 'పన్నుమీద పన్ను' అన్నట్టు వాటిమీద పన్నా? ఒక పక్క ధరలు స్థిరంగా వున్నాయని చెబుతూ, మరోపక్క తామే ఇలా పెంచేస్తూ వుంటే – ఎవర్ని ఎవరు మభ్యపెడుతున్నట్టు?—మనదేశానికి 'కన్స్యూమర్ రెసిస్టెన్స్' ఎప్పుడు అర్థమవుతుంది?

**కె. విశాలాక్షి** కర్నూలు

అసలైన స్త్రీ ధర్మం ఏది?

సంఘంలో ప్రతివ్యక్తీ నిర్వహించవలసిన పాత్రలు సంప్రదాయం నిర్ణయిస్తుంది. ఈ పాత్రలనే మనం ఆయా వ్యక్తుల విధులనీ, ధర్మాలనీ అంటాము. అసలైన స్త్రీ ధర్మం ఏది? అని ప్రశ్నిస్తే 'గృహిణీత్వం' అని జవాబు చెప్పాలి. చారిత్రకంగా చూసినా స్త్రీ స్థానం ఈ విధంగానే కనిపిస్తుంది. అంటే గృహ నిర్వహణ, అతిథి ఆదరణ, శిశు సంరక్షణ ఇత్యాది విధులు భార్య నిర్వహించేది. ఇలా స్త్రీ విద్యుక్త ధర్మ నిర్వహణ

గృహానికే పరిమితమైనా, 'కార్యేషు మంత్రీ, కరణేషు దాసీ, భుక్తేషు మాతా, శయనేషు రంభా, క్షమయా ధరిత్రీ....అన్న సూక్తికి అనుగుణంగా ప్రవర్తించేది. ఈ ధర్మాలనుండి స్త్రీకి 'గృహిణి' అనే పర్యాయపదం ఏర్పడింది. ఇంటికి దీపం ఇల్లాలు....ఇంటి యజమాని కేవలం ఒక యంత్రం వంటివాడు. ఆ యంత్రం నడిపేందుకు అవసరమైన శక్తివంటిది ఇల్లాలు. ఈ శక్తి ఆ యంత్రాన్ని ఆవహించి దానిలో లీనమై నడుపుతుంది. ఈ రెంటి అవినాభావ సంబంధంలో జరిగే యంత్ర గమనాన్ని అనుసరించి దీనిమీద ఆధారపడిన కుటుంబ చక్రమంతా పరిభ్రమిస్తుంది.

లోపల



కనుకనే 'పురుషుడు శివుడు—స్త్రీ శక్తి' అని అన్నారు. ఇప్పుడు మన మీద పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఎక్కువగా ఉంది. భారత స్త్రీ తనకున్న స్వేచ్ఛను విస్మరించి పెడర్థాలు చెప్పుకుని ఆత్మను కించపరచుకుంటున్నది. వంట చేయడాన్ని నీచకార్యంగాను, గృహ నిర్వహణ చాదస్తంగాను పరిణమించింది. పశ్చిమదేశాల్లోని స్త్రీ స్వాతంత్ర్యాన్ని చూచి మురిసేవారికి సంస్కృతి, నాగరికతలకు అర్థాలు తెలియవేమోననిపిస్తుంది. భారతీయ సంస్కృతిని, స్త్రీ స్వేచ్ఛను పశ్చిమ ఖండాలతో పోల్చి కించపరచడం హైందవ జాతికే గొడ్డలిపెట్టు. ప్రతి గృహిణీ తన బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తే దేశం సుభిక్షమవుతుంది.

**గార్ల సరస్వతి** — **మద్రాసు**

*శకునాల మీద నమ్మకమా?*

మానవుని జీవన నౌకకు 'చుక్కాని' నమ్మకం. గతి తెలియని పథికునికి గమ్యం చూపే 'వేగు చుక్క'. అందుకే మానవుడు నమ్మకం మీద ఆధారపడి బ్రతుకుతున్నాడు. వెనకటికో రాజు వేకువ జాముననే మంగలితో క్షౌరం చేయించుకుంటున్నాడట. మంగలి అజాగ్రత్తవల్ల రాజావారికి చిన్న గాయం అయింది. రాజావారు ఆగ్రహంతో "లేవగానే నీ ముఖమే చూశాను, గాయం అయింది. వెంటనే వీడిని ఉరి తీయండి" అని ఆజ్ఞ ఇచ్చాడు. వెంటనే మంగలి "రాజావారు అనుగ్రహించాలి. లేవగానే మీరు నా ముఖం చూశారు. చిన్న గాయంతోనే సరిపోయింది. నేను తమరి ముఖారవిందం తిలకించాను. నా తలనే పోగొట్టుకుంటున్నాను" అన్నాడట. అలాగే ఎవరైనా తను అనుకున్న పని సఫలం కాకపోతే "ఎవరి ముఖం చూశానో ఇలా జరిగింది" అనుకోవడం పరిపాటి. సామాన్యంగా మనం ఏదైనా పనిమీద వెళుతుంటే మనస్సు ఆందోళనగా ఉండకూడదు. అమంగళకరమైన దృశ్యాలు చూచినపుడు మనస్సు కలవరపడి, చికాకుగా తయారవుతుంది. కొన్నిసార్లు మనం చేయబోయే పనులు కూడా ఈ చికాకుల్లో సరిగ్గా చేయలేకపోతాము. అందుకే మంగళకరమైన దృశ్యాలు, నిగనిగలాడే ఎర్రని కుంకుమ దిద్దిన ముఖమూ, పసుపు పూసిన గడప, ముగ్గు వేసిన ముంగిలి, తోరణం కట్టిన ద్వారం, గోమాత, కన్యలు ఎదురువస్తే మంచి శకునం అనుకుంటారు. ఆహ్లాదకరమైన దృశ్యాలు, మనస్సును ప్రశాంతంగా ఉంచగలుగుతవి. రేరూ దేవిగారి కథలో శాస్త్రిగారు (ఫిబ్రవరి సంచిక: 'నమ్మకం కథ) కూడ సరోజ ముఖంలోని నిండుదనంలో శుభశకునం చూచుకున్నారు. విపరీతమైన నమ్మకాలతో, చాదస్తంతో ఎదుటివారిని చికాకు కలిగించే పద్ధతులు పాటించకపోతే మంచి శకునం చూచుకోవడంలో అనర్థం ఏమీ ఉండదు.

**డి. బాల** — **వికారాబాదు**

*స్త్రీకి కుడివెయ్యే చూడాలి!*

డిసెంబరు వనితలో బామ్మగారి పేజీలో ఒక ప్రశ్నకు జవాబిస్తూ బామ్మగారు— "సాముద్రికం చెప్పేవాళ్ళు మనకు (వనితలకు) ఎడమ చేతులు, మగవాళ్ళకు కుడిచేతులూ చూస్తారు-ఎడమ భాగం స్త్రీది, కుడిభాగం పురుషుడిది—" అంటూ వ్రాశారు.

కుడి ఎడమలను స్త్రీ పురుషులు ఎప్పుడు పంచుకొన్నారో నాకైతే తెలియదు కాని, ప్రజ్ఞావంతురాలైన వనితకు ఎడమచేయి చూసి చెప్పిన సాముద్రికం చాలావరకు తప్పుతుందన్నది మాత్రం తెలుసు.

హస్తరేఖలు ఒక చేతిలో ఉన్నట్లు రెండవ చేతిలో ఉండకపోడం ఆలోచనను రేకెత్తించక మానవు. ఎడమ చేతి రేఖలు అతి సహజమైనవి, వంశక్రమానుగతమైనవి అయిన లక్షణాలను, తదనుగుణమైన అదృష్టాన్ని తెలియజేస్తే, కుడిచేతి రేఖలు మనిషి తన ప్రజ్ఞాపాటవంతో సాధించిన వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తాయి. ఒక్కొక్కప్పుడు రెండు చేతుల రేఖలు పరస్పర విరుద్ధంగా ఉన్నా, ఆశ్చర్యపడనక్కరలేదు.

మనిషి తన మనశ్శక్తిని ఉపయోగించి సహజమైనవాటికి భిన్నమైన మార్పుని సాధించగలగడం పెద్ద విశేషమేమీ కాదు. ఆత్మబలంతో గ్రహగతులనే మార్చి సూర్యగమనాన్ని ఆపిన సుమతి, మృత్యువునే జయించిన మార్కండేయులు మనకు కొత్తవాళ్ళుకాదు.

స్త్రీ మృత్పిండంలా బ్రతికిన రోజుల్లో ఎడమ చేతిని చూసి సాముద్రికం చెప్పే అలవాటు ఉన్నా, నేడు-ఇంతో అంతో వ్యక్తిత్వాన్ని సాధించి అన్ని రంగాలలోనూ ముందంజ వేస్తున్న ప్రజ్ఞావతియైన వనితకు సాముద్రికం చెప్పదలచినవారు కుడిచేతిని చూడడమే ఉచితం.

**వెంపటి హేమసుందరి** — **నరసాపురం**

మార్చి నెల వనిత అట్టమీద అమ్మాయిని చూసి ఒక్కక్షణంనాకన్పించింది ఎంత అందంగావుందీమె ఎవరో కదా అని. పేజీలు తిరగేస్తుంటే అట్టమీద అమ్మాయి అన్న కాగితం మీద దృష్టి నిలిపి చదువుతూ ఒక్క క్షణం దిగ్భ్రాంతురాలినయ్యాను. ఇంత అందమైన "అముద"ను విధి ఈ విధంగా పరిహసించటం, ఆమె పూర్వజన్మలో చేసుకున్న పాపఫలమా అని కంటనీరు పెట్టాను. అంగవైకల్యం గల అనేక మందికి ఈ అముద జీవితం ధైర్య సాహసాలను, నూతన ఉత్తేజాన్ని కలిగించాలని కోరుకుంటున్నాను. "తెలిసి చేసిన పాపం" కథ అనుకున్న విధంగా ముగింపు కాలేదు. కట్టుకున్న భార్యకి అన్యాయం చేసి పారిపోయిన వేణుగోపాలరావుని పిరికివాడుగా చేసి ముగించిన ఈ కథ మమ్మల్ని ఆకర్షించలేదు.

—పి. ప్రభావతీ శ్రీధర్, కారువంగ

మార్చి నెల 'వనిత'లో కుమారి అముద పరిచయం మాకు సంభ్రమాశ్చర్యాలను కలుగజేసింది! పుట్టుకతోనే వచ్చిన ఆమెలో శారీరక లోపాలను మరపించి, మానసికంగా ఆత్మవిశ్వాసాన్ని ప్రేరేపించడంలో అముదను కన్నతల్లి పడ్డ శ్రమ అలాంటి బిడ్డలను కన్న ప్రతి తల్లికి మార్గదర్శకమే! తెన్నేటి రామలక్ష్మిగారి 'ఓ స్త్రీ! మోసపోకు' వ్యాసం ఎంతో భావగర్భితంగా వుంది!

—శ్రీమతి నజీర్ హుసేన్, కావలి

'అముద జీవిత గాథ' మమల్నెంతో ఆకట్టుకొని ఆశ్చర్యానందితులను గావించినది. 'తెలిసి చేసిన పాపం' ముగింపు ఏమవుతుందోనని భయపడ్డాము. కాని దానికి విజయలక్ష్మిగారు చక్కగా ముగింపు ఇచ్చారు. 'అన్యోన్య దాంపత్యం' కథ చక్కగా వుంది.

—యస్. సీతాలక్ష్మి, కదిరి




"మాటలు రాని వారికి మాటలు నేర్పడం" వ్యాసంలో స్పీచ్ అండ్ హియరింగ్ ఇన్‌స్టిట్యూట్ యొక్క పూర్తి వివరాలు తెలిపి, మాకు ఎనలేని మేలు చేసిన మీకు కృతజ్ఞతలు.

—పి. రోజా, దంగేరు

'ఓ స్త్రీ మోసపోకు' వ్యాసంలో, తెన్నేటి రామలక్ష్మిగారు పాశ్చాత్య దేశాలలో స్త్రీల స్వాతంత్ర్యం గూర్చి ఎన్నో విషయాలు తెల్పారు. 'వనిత' కేవలం వనితా ప్రపంచంలోనే విహరించకుండా, మామూలు ప్రపంచంలో కూడా విహరించి ఎంతో లోకజ్ఞానం కల్పిస్తున్నది.

—పి. సాయిలత, గన్నవరం

"తెలిసి చేసిన పాపం" కథ బాగుంది. 'ఓ స్త్రీ! మోసపోకు' వ్యాసంలో జీవితంలో స్త్రీ ఎదుర్కోవలసిన సమస్యలు, వాటికి అవసరమైన సలహాలు అందులో చక్కగా పొందుపరిచినారు. రచించిన తెన్నేటి రామలక్ష్మిగార్కి ధన్యవాదములు.

—సుజాత, సునీత, కొలనూరు

అన్యోన్య దాంపత్యానికి కావలసింది దంపతుల మధ్య అనురాగం - ఆత్మీయత - ఆప్యాయత, కాని అందచందాలు ముఖ్యం కావన్న సత్యాన్ని 'అన్యోన్య దాంపత్యం' కథలో రచయిత్రి చక్కగా చెప్పారు. భార్య అంటే, భర్త చెప్పిన ప్రతిదానికి గంగిరెద్దులా తలూపి, మరమనిషిలా పనిచేసే పనిమనిషి కాదని

## వనిత మాటల కొలువు - 44

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 అ | ర | 13 విం | 14 ద | ■ | 2 య | న | 15 న |
| ట | ■ | 3 శ | యు | 16 న | ము | ■ | వ |
| 4 వి | 17 న | తి | ■ | 5 వ | న | 18 స్ప | తి |
| ■ | త్తి | ■ | 6 నే | మి | ■ | ర్థ | ■ |
| 19 ఇం | ■ | 7 గో | డు | ■ | 20 త | ■ | 21 ర |
| 8 పు | 22 లు | పి | ■ | 9 ర | మా | దే | వి |
| ■ | 10 డ | క | ■ | క్ష | ■ | ■ | వ |
| 11 వీ | కో | లు | డు | ■ | 12 న | ద | ర్మ |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు పన్నెండుమంది. వారు :

1. యం. వెంకటమణి, ఆదిలాబాదు 2. బి. సుగుణ, హైద్రాబాదు 3. ఎస్. అరుణ, కలకత్తా 4. జయంతి రామలక్ష్మి, విజయనగరం 5. ఎస్. స్వరాజ్యలక్ష్మి, హైద్రాబాదు 6. సి. నిర్మల, ఖుర్దారోడ్ 7. పి. రామలక్ష్మి, చక్రధర్‌పూర్ 8. జె. వి. పద్మకుమారి, విజయనగరం 9. కె. ముత్యాలు, ఏలూరు 10. రజనీదేవి, కాజీపేట దర్గా 11. డి. పద్మ, ఆనంతపూర్ 12. వి. సుధీరకుమారి, గుంటూరు.

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి అందజేస్తున్నాము.

## చిత్రానికి కథ:

గత సంచికలో ఇచ్చిన 'చిత్రానికి కథ' పోటీకి వచ్చిన కథల్లో ఎన్నికయిన కథ—'కుందేటి కొమ్ము' అన్న ఈ కథ. ఈ కథను పంపిన వారు: మాటేటి ఇందిరాదేవి, గార్ల. ప్రకటించిన ప్రకారం-ఇస్తామన్న బహుమతిని ఆమెకు పంపివేశాము.

—వ. సం



### కుందేటి కొమ్ము

ఒక రాజుగారు చిత్రమైన చాటింపు చేశారు. ఏమిటంటే, ఎవరైనాసరే కొమ్ములున్న కుందేలును తెచ్చినట్లయితే, తగిన బహుమానం ఇస్తానని ప్రకటించాడు. ఆ చాటింపు విన్న కొందరు నవ్వుకున్నారు; కొందరు జరిగేపని కాదని పూరుకున్నారు. కాని, ఒక పేద బ్రాహ్మణుడు మాత్రం, తనకి తోచిన ఉపాయంతో, బహుమతి సంపాయించాలని అడవంతా వెతికి, ఒక కుందేలును పట్టి, రాజుగారి దగ్గరకు తీసుకెళ్ళాడు. "ఏదీ! ఈ కుందేలుకు కొమ్ములు ఎక్కడ? లేవే" అన్నారు రాజుగారు, కుందేలు చేతిలోకి తీసుకుని. అప్పుడా బ్రాహ్మణుడు చాలా వినయంగా "రాజా! మీరు బాగా పరిశీలించి చూడండి. ప్రతి కుందేలుకీ రెండు కొమ్ములు విధిగా వుంటాయి. కొమ్ములు లేకపోతే కుందేలు లేనే లేదు!" అన్నాడు. రాజుకు ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా చూశాడు. "మరేం లేదు ప్రభూ! కుందేలులోని మొదటి అక్షరం కు లో—'క'కి కొమ్ముంది; చివరి అక్షరం లు లో 'ల'కి కొమ్ముంది. ఆ విధంగా రెండు కొమ్ములు లేకుండా కుందేలు లేదు గదా—అప్పుడది 'కందేల' అవుతుంది గదా" అని చమత్కరించాడు. అతని చమత్కారాన్ని మెచ్చుకున్న రాజు, అతనికి బహుమానం ఇచ్చి పంపాడు.

—మాటేటి ఇందిరాదేవి

గుర్తించాలి. అన్యోన్య దాంపత్యం నిర్ణయించటానికి భార్యా భర్తల మధ్య పరస్పరావగాహన కాని, బాహ్య సౌందర్యం ప్రధానం కాదు.

—పి. లక్ష్మీశారద, రాజమండ్రి

మార్చి వనితలో ప్రవేశపెట్టిన క్రొత్త శీర్షిక "విశ్వ సాహిత్యంలో ఉద్గ్రంథాలు" సాహితీ ప్రియులకు ప్రియాతి ప్రియమైన శీర్షిక. "తెలిసి చేసిన పాపం" కథ ముగింపు చాలా బాగుంది.

—జి. సుధారాణి, కొల్లూరు

వనితలో అభిప్రాయాల శీర్షిక పేరు తీసివేసి, పొగడ్తల శీర్షిక అని పేరు పెడితే బాగుంటుంది. ఎందుకంటే వాటిలో విమర్శలకు చోటు లేదు కనుక. విమర్శలు రాస్తే (అరుదుగా తప్ప) అవి నేరుగా చెత్తబుట్టకే చేరుతాయి. పాఠకులు తమ అభిప్రాయాలను నిష్కర్షగా తెలిపే అవకాశం మీరు ఇవ్వాలి.

—ఆర్. ఇందిర, కోరగుంటపల్లె

మార్చి సంచికలోని 'మంచు మండింది' ముక్తేవి భారతిగారి కథ ఇంతకుముందు ఒక పత్రికలో పడింది. ఒకే కథ ఇలా రెండు పత్రికలలో రావడం ఇది మొదటిసారి కాకున్నా చదివే పాఠకులు ఎంతటి ఇబ్బందికి గురి అవుతారో మీకు తెలుసని అనుకుంటా. బహుశా రచయిత్రిగారు రెండు పత్రికలకూ ఒకేసారి పంపారో ఏమో! —కె. ఇందుమిత్ర, కరీమ్‌నగర్

మీరు ప్రచురించిన 'మంచు మండింది' కథ మేము ఇదివరకు చదివినదే. ఒకసారి ఒక పత్రికలో ప్రచురితమయిన కథను మీ 'మా' వనితలో ప్రచురించవద్దని మనవి.

—శ్యామలాదేవి, శారదాదేవి, చోడవరం

ముక్తేవి భారతిగారు రచించిన "మంచు మండింది" అను కథను ఇంతకుముందు వేరే వారపత్రికలో చదివామని చెప్పుటకు చింతిస్తున్నాము.

—శాంత, తిరుపతి

**['మంచు మండింది' కథ ప్రచురింపబడిన కథేనంటూ ఈ విధంగా చాలామంది పాఠకులు ఉత్తరాలు రాశారని, ఆ కథా రచయిత్రి శ్రీమతి ముక్తేవి భారతి గారికి, తెలియజేశాము. దానికి ఆమె ఇచ్చిన సమాధానం ఇది : —వ. సం]**

నేను రాసిన 'మంచు మండింది' అనే కథ హైదరాబాదు రేడియో స్టేషన్ ద్వారా వనితావాణి కార్యక్రమంలో ప్రసారితమైంది. ఆ కారణం చేతనే మీకు నేను పంపిన కథకింద ఆకాశవాణి సౌజన్యంతో అని రాసినట్టే బాగా జ్ఞాపకం. నాకు జ్ఞప్తి వున్నంత వరకూ నేనీ కథను మరి ఏ పత్రికకూ పంపలేదు. ఇది వారపత్రికలో పడిందని మీ పాఠకులు రాయటం వారి పొరబాటనుకుంటాను. దయచేసి మీ పాఠకులు చెప్పిన వారపత్రిక పేరు, తేదీ నాకు తెలియజేస్తే ఆ సంపాదకులతో సంప్రతించడానికి నాకు అవకాశముంటుంది. —ముక్తేవి భారతి, హైదరాబాదు

## ముఖచిత్రం



## రాధికాభైడ్

చలన చిత్రాలు ప్రదర్శించేముందు థియేటర్లలో కొన్ని వ్యాపార ప్రకటనాచిత్రాలూ అవీ చూపుతూ వుంటారు. వాటిల్లో నటించేవారు కనిపించేది కొద్ది సెకన్లు మాత్రమే. కాని ఆ కొద్ది సెకన్లలలోనే వారు ప్రేక్షకులను ఆకట్టుకోవాలి. అంతేకాక ఆ వస్తువు ప్రేక్షకుల మనస్సుకి హత్తుకునేటట్లు చేయాలి. ఇంత బాధ్యత వారిపై వుంది. అందుకే చలన చిత్రాలలో గంటల తరబడి కనిపించే పాత్రల కన్న వీరు నిర్వహించే పాత్ర చిన్నదైనా ప్రాముఖ్యత గలదని చెబుతూ వుంటారు. ఇలా నటించే వారు సాధారణంగా వివిధ వ్యాపార ప్రకటనల సంస్థకి చెందిన 'మోడల్స్' అయి వుంటారు. అసలు కొన్ని వస్తువులు కేవలం ఈ 'మోడల్స్' ప్రతిభ, ఆకర్షణ, అందచందాలవల్లే ప్రజాదరణ పొందుతూ వుంటాయి. అందులో ఆశ్చర్యం లేదు. అలా నాలుగు సంవత్సరాల పాటు వివిధ వ్యాపార ప్రకటనలకు 'మోడల్'గా వుండి పేరు తెచ్చుకున్న వనిత-శ్రీమతి రాధికా భైడ్.

రాధిక మద్రాసులోని స్టెల్లా మారీస్ కళాశాల ద్వారా బి. ఏ. పట్టం పొందింది. కళాశాలలో చదువుతూ వుండగానే సరదాకి 'మోడలింగ్' ప్రారంభించింది. అప్పుడు ఆమె – బతిక్ అద్దకం, చిత్రలేఖనం, ఎంబ్రాయిడరీ, చేతిపనులలో కూడా ప్రావీణ్యం సంపాయించింది.

కొందరికి ఎప్పుడూ ఏదో ఒకటి చెస్తూ వుండకపోతే తోచదు. ఆ కోవకి చెందినదే రాధిక. కళాశాల చదువు పూర్తయిన తర్వాత మద్రాసులోని దవార్స్ కళాశాలలో సెక్రటేరియల్ కోర్సులో చేరింది. ఎక్కడైనా కార్యదర్శినిగా ఉద్యోగం చేయాలన్నది ఆమె ఆశయం. ఆ కోర్స్‌లో ఒక భాగంగా కొన్ని నెలలపాటు అడయార్‌లోని ఒక ఇంజనీరింగ్ కంపెనీలో పాఠాలు నేర్చుకునేందుకు వెళ్లింది రాధిక. ఆ సంస్థలో ఉన్నతోద్యోగి మహారాష్ట్రీయుడైన జయంత్ భైడ్. అతనే ఆమెకి పాఠాలు నేర్పాడు. అయితే రానురాను అవి కాస్తా ప్రేమ పాఠాలు కూడా అయ్యాయి. దాంతో కార్యదర్శిని అవుదామనుకున్న రాధిక-'కార్యేషుదాసి'గా మారింది.

"అంతా కథల పుస్తకాలలో జరిగినట్లే జరిగింది. ఐతే, యిదంతా ఒక్క రోజులోనో....నెలలోనో జరిగిపోలేదు. సంవత్సరం పాటు ఇద్దరం ఒకరినొకరం అవగాహన చేసుకున్నాక .... పెద్దల అంగీకారాలతో ఈ మధ్యనే వివాహం చేసుకున్నాం" అన్నారు రాధిక.

ఆమె భర్త కూడా కళాకారుడే. 'మెడ్రాస్ ప్లేయర్స్' నాటక సంస్థ తరపున అతను అప్పుడప్పుడు ఆంగ్ల నాటకాలలో పాల్గొంటూ వుంటారు. అంతేకాదు. మద్రాసు దూరదర్శిని కేంద్రంలో ఆంగ్లంలో వార్తలు కూడా చదువుతూ వుంటారు.

రాధిక ప్రస్తుతం అడయారులోని 'శిష్య స్కూల్'లో ఉపాధ్యాయినిగా వుంటున్నారు. గృహిణిగా తన బాధ్యతలను నెరవేరుస్తూ అత్తగారి వద్ద మహారాష్ట్ర పద్ధతుల వంటలు కూడా నేర్చుకుంటున్నారు. రాధికా భైడ్‌గా మారిన రాధిక "నా హాబీలను మాత్రం నేను కొనసాగించాలనే అనుకుంటున్నాను" అన్నారు. —నళినీ రాధాకృష్ణ

చూపుకి
అందం
కంటికి
చలవ



అదే
# ఐటెక్స్
కాటుక

స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033




ప్రపంచ వార్తలలో గత కొద్ది నెలలుగా ప్రముఖ స్థానం ఆక్రమిస్తున్నది ఇరాన్. ఇరాన్‌లో పరిణామాలు ఊహించని విధంగా మారిపోతున్నాయి. అందుకే 'ప్రపంచం'లో ఇరాన్ గురించి, ఇరాన్‌లో సంభవిస్తున్న పరిణామాల గురించి తెలుసుకోవాలని అందరికీ ఆసక్తి ఏర్పడింది.

పశ్చిమ ఆసియాలో వున్న ఇరాన్‌ని ఒకరోజున పర్షియా అని పిలిచేవారు. ఇరాన్‌కి ఇరాక్, టర్కీలు పశ్చిమ భాగంలో వున్నాయి. రష్యా-ఉత్తరభాగంలో వుంది. ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ తూర్పు భాగంలో వున్నాయి. ఇరాన్ దేశస్థులు ఆర్య సంతతికి చెందినవారు.

1935లో పర్షియా పేరు ఇరాన్‌గా మారింది. అప్పటికే పది సంవత్సరాల క్రితం అంటే 1925లో ఇప్పటి షా తండ్రి కర్నల్ రెజాషా అప్పుడు అధికారంలో వున్న ఖాజర్ వంశస్థుడైన రాజుపై బ్రిటిష్ వారి ప్రోత్సాహంతో తిరుగుబాటు జరిపి పెహ్లవీ రాజవంశాన్ని స్థాపించాడు. రెజాషా తర్వాత ఆయన కుమారుడు నేటి షా 1941లో 21 సంవత్సరాల ప్రాయంలో నెమలి సింహాసనాన్ని ఆక్రమించాడు. అలా ఆయనఇరాన్‌ని ముప్పయి ఏడు సంవత్సరాలు పాలించాడు.

1960లో ఇరాన్‌కి ఒక రాజ్యాంగం నిర్మించారు. జాతీయ అసెంబ్లీ ఏర్పరచారు. అయితే అసెంబ్లీ చేసిన నిర్ణయాలు షా ఆమోదానికి నోచుకోవాలి. అసెంబ్లీని ఏ నిమిషంలోనయినా రద్దుచేసే అధికారం షాకి వుంది. మంత్రిసభ కూడా షా పేరు మీదుగా పని చేయాలి. ఇదంతా నిన్నటి కథ.

వ్యవసాయ ప్రధాన దేశమయినా ఇరాన్ చమురు గనులకి ఎంతో ప్రసిద్ధి చెందిన దేశం. చమురుని నల్లబంగారమంటారు. మూడు కోట్ల జనాభాగల ముస్లిమ్ దేశమైన ఇరాన్‌కి టెహరాన్ రాజధాని.

షా తన పాలనలో ప్రజల స్వేచ్ఛని, పత్రికా స్వాతంత్ర్యాన్ని నియంతృత్వ ధోరణిలో నిర్దాక్షిణ్యంగా అణచి వేశాడు. సి. ఐ. డి. సంస్థ 'సవక్' సహాయంతో ప్రజలలో తన వ్యతిరేకులని తొలగించుకొనడానికి ప్రయత్నించాడు. 'ముసలి నక్కకు రాచరికం దక్కునే' అని ప్రజలలో తిరుగుబాటు ధోరణులు ప్రారంభమయే సరికి ప్రజాభ్యుదయానికి కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టి చేతులు కాలాక ఆకులు పట్టుకున్నాడు. అయితే రాచరికంలో ప్రజలకి కనీసావసరాలు కూడా కరువయిపోతాయనే సత్యం వెలుగులోకి రావడంతో ప్రజలు మేల్కొని, చైతన్యంతో రంగంలోకి వచ్చారు. ప్రజా వెల్లువ షా రాజరికాన్నే తుద ముట్టించడానికి ఉప్పొంగింది. ఈ ప్రజా ఉద్యమానికి పారిస్‌లో ప్రవాసంలో వున్న ఇరాన్ మతాచార్యుడు, షా వ్యతిరేకోద్యమ నాయకుడు_ అయతుల్లా ఖొమైని ఊపిరి అందించాడు. అలా నమ్మిన కాళ్ళ క్రింద భూమి తొలగిపోవడం ప్రారంభించేసరికి షా భార్యాబిడ్డలతో ఇరాన్ విడిచిపెట్టి మొరాకో చేరుకున్నాడు.

ఇరాన్‌కి మొదటి నుంచి ఆర్థిక సహాయం అందచేస్తూ, ఆయుధాలని సరఫరా చేస్తోంది అమెరికా, ఇరాన్‌లో షా వ్యతిరేకోద్యమం నానాటికి బలపడుతూ వుంటే, అంతటి సర్వసంపన్నమయిన అమెరికా. షా ఇరాన్ విడిచిపెట్టి వెళ్ళడమే ఉత్తమమని సలహా ఇచ్చింది. ఇరాన్ నుంచి షా నిష్క్రమణవార్త రాకుండానే ఆ వార్తని అమెరికా ప్రకటించింది కూడా. షా ఇరాన్‌ని విడిచిపెట్టడమే ఉత్తమమనీ అమెరికా సమర్థించింది. అలా దేశాన్ని విడిచిపెడుతూ షాపూర్ బక్తియార్‌ని ఇరాన్‌కి ప్రధానిగా షా నియమించాడు. తిరిగి ఇరాన్‌కి రాగలననే నమ్మకంతోనే షా దేశం బయటకు అడుగుపెట్టి వుంటాడు.

1953లో అప్పటి ప్రధాని మొసాదిక్ కాలంలో షా దేశాన్ని విడిచి వెళ్ళవలసివచ్చింది. అయితే కాలం కలసివచ్చి షా నెమలి సింహాసనం మీద తిరిగి కూర్చోగలిగాడు.

షా నిష్క్రమణతో ఇరాన్‌లో రాజకీయ వాతావరణం మారడం ప్రారంభమయింది. పారిస్‌లో పదిహేనేళ్ళ ప్రవాస జీవితం గడిపిన ఆయాతుల్లా ఖొమైనీ ఇరాన్ చేరుకున్నాడు. ఇరాన్‌ని ఇస్లామ్ రిపబ్లిక్‌గా మార్చాలనే ఏకైక లక్ష్యంతో షా ప్రవేశపెట్టిన అభ్యుదయ సంస్కరణలని ఖొమైనీ వ్యతిరేకించాడు. ఇరాన్‌ని ప్రాచీన దేశంగా మిగల్చాలనే ఖొమైనీ ఉద్దేశాలను వ్యతిరేకించే యువశక్తులు ఇరాన్‌లో వుండడంతో ఇరాన్ చల్లారని అగ్నిపర్వతంగా మిగిలిపోతున్నది. అయితే షా వ్యతిరేకశక్తులు, మతాన్ని గౌరవించే వ్యక్తులు ఖొమైనీని గౌరవించి ప్రేమతో అభిషేకించారు.

ఇరాన్‌లో అడుగుపెట్టిన వెంటనే షా నియమించిన బక్తియార్ ప్రభుత్వాన్ని గుర్తించనని ఖొమైనీ ప్రకటించాడు. దేశంలో సంఘర్షణ తీవ్రరూపం దాల్చడంతో బక్తియార్ ప్రధాని పదవికి రాజనామా చేసినట్లు, ఆత్మహత్య చేసుకున్నట్లు వార్తలు వెలువడ్డాయి. అయితే బక్తియార్‌ని ఖొమైనీ అనుచరులు బంధించారు. మెహ్దీ బజార్గన్‌ని ఖొమైనీ ప్రధానిగా నియమించాడు. షా కాలంలో రాజకీయ నేరాలకు కారాగారవాసమనుభవిస్తున్న వారందరికీ స్వేచ్ఛ ప్రసాదించాడు. సైన్యంలోని షా అనుచరవర్గం లొంగిపోవడంతో రాచరిక పాలనకి ఖొమైనీ చరమగీతం పాడాడు. ఖొమైనీ అనుచరుడు, షా వ్యతిరేకి డా॥ అలీషెయగన్ ఇరవయి సంవత్సరాల ప్రవాసం తర్వాత ఇరాన్ రావడంతో, ఇరాన్ రాజకీయాలు తిరిగిన మలుపులో వేగం కనిపించింది.

సమకాలీన ప్రపంచ చరిత్ర మీద ఇరాన్‌లో వచ్చిన మార్పుల ప్రభావం కనిపించినా, ఇరాన్‌లో సంభవించిన మార్పులలో తిరిగి మార్పు కనిపించదా అనే ప్రశ్న రాజకీయ పండితుల పెదవుల మీద ఆడుతూనేవుంది.

వ్యక్తిగత జీవితానికి పరిమితం కావలసిన మతాన్ని రాజకీయాలలోకి తీసుకురావడం మంచిదా కాదా అనే ప్రశ్నకి రేపటి ఇరాన్ సమాధానమిస్తుంది. అరబ్ దేశాలలో సున్నీలు అధికంగా వుంటే ఇరాన్‌లో షియాలు అత్యధికంగా వున్నారు. అందుకే ముస్లిమ్ దేశాలు ఇరాన్‌తో ప్రస్తుతం ఎటువంటి సంబంధాలు పెట్టుకుంటాయోనని ప్రపంచం ఆసక్తితో ఎదురుచూస్తున్నది. షాని పూర్తిగా బలపరచిన అమెరికా ఇరాన్‌లో మారిన పరిణామాలని అర్థం చేసుకుని ఖొమైనీ ఏర్పరిచిన ప్రభుత్వాన్ని వెంటనే గుర్తించింది.

ఫరూక్ హయాంలో ఈజిప్టులోనూ, జహీర్ షా హయాంలో ఆఫ్ఘనిస్తాన్‌లోనూ రాజరికాలకి 'పెద్ద చుక్క' పెట్టారు. ఇరాన్‌లోనూ, షా రెజాపెహ్లవి హయాంలోనే రాచరికం పూర్తయిందని భావించాలి. ఇరాన్‌ని ప్రాచీనమయిన రాచరికంగా భావించి, 1971లో పర్షియన్ సామ్రాజ్యపు 2500 వార్షికోత్సవాన్ని ఘనంగా జరిపిన షాకి, ఈ రోజున కిరీటమూ లేదు; నెమలి సంహాసనమూ లేదు; ఇరాన్‌లో స్థానమూ లేదు. □



# వంచిత

నీరసంగా కళ్ళు తెరిచింది యామిని.

రూఫ్‌కి వేలాడుతూ - మెల్లగానూ కాక మరీ వేగంగానూ కాక మధ్యస్త వేగంతో నిశ్శబ్దంగా తిరుగుతూంది సీలింగ్ ఫ్యాన్. గది గోడలకి ఒక్క చిత్రమయినా లేదు. తెల్లగా - బోసిగా ఉన్నాయి.

మెల్లగా కళ్ళు పక్కకి తిప్పింది.

మంచం పక్కనే డ్రాయర్.

దాని మీద - ఫ్లాస్క్.

ఆమే కనుమానం వొచ్చిం దొక్కసారి.

తనెక్కడుంది? ఇది తమ యిల్లు కాదు. ఇది తన గది కాదు. మరి? ఇక్కడికెలా వచ్చింది?

ఆమె - కళ్ళు మూసుకుని జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించింది. ఆలోచించడం కూడా శ్రమే కలిగిస్తున్నట్లు ఆమె కంటి నరాలు పీకులు పెట్టసాగాయి. సన్నగా తల నొప్పి ప్రారంభమయింది. అయినా ఆమె గతాన్ని జ్ఞాపకం చేసుకోడం మానలేదు.

ఆ సాయంత్రం....

పొత్తి కడుపులో నొప్పులు. మొదట ఎక్కువ బాధగా కాకుండా తేలిపోతూ....క్రమక్రమంగా అవి ఎక్కువ కాసాగాయి. భరించలేక - విలవిలలాడిపోయింది. ఎలాగో ఫోను దగ్గరకి నడచింది. అతికష్టం మీద నంబరు డయల్ చేసి "ప్రభూ! నాకేమిటో ఐపోతూంది. చాలా భయం వేస్తూంది.



ఉగాది కథల పోటీలో
రెండవ బహుమతి
రూ. **300** పొందిన
కథ

# ఐ.కుసుమకుమారి

తక్షణం రండి....'' అంది బలహీనంగా. అంతే కళ్ళు చీకట్లు క్రమ్మాయి. గది - గిర్రున తిరుగుతున్నట్లయింది. కాళ్ళు తన భారాన్ని మోయలేక పోతున్నాయనిపించింది. ఫోను పక్కనున్న సోఫాలోకి వాలిపోయింది.

తరువాత - అంతా - ఏదో కలలా జరిగింది.

ప్రభు వచ్చాడు. కంగారుగా తన నెత్తుకుని - కారులో చేర్చాడు. కొంచెంసేపు పరుగెత్తి కారు ఆగింది. ఎవరో తనని మెట్లమీదుగా తీసుకువెళ్ళారు. అక్కడ ఆ గదిలో ప్రకాశవంతమైన వెలుగు. ఆసుపత్రి వాసన. ఆఁ తను వచ్చింది హాస్పిటల్ కన్నమాట!

నూతిలోంచి వినపడుతున్నట్లు మాటలు.

ఒక కంఠం ప్రభుది. రెండోది డాక్టరు నీలది.

ఆమె అంటూంది ''బహుశా సిజేరియన్ అవసరం కావొచ్చు. ఇంటర్నల్ చెకప్ చేసి చెబుతాను.''

ఆమె తనని పరీక్ష చేస్తూంటే పై ప్రాణాలు పైనే పోతున్నట్లనిపించింది.

ఎంత బాధ! నరాలు తోడేస్తున్నట్లు.

తనకి స్పృహ తప్పిపోయింది.

మళ్ళీ కొంచెం తెలివొచ్చేసరికి—

కళ్ళు చూడలేనంత వెలుగు. కత్తుల చప్పుళ్ళు.

ఏం చేయబోతున్నారు తనని? కత్తులతో కోసి చంపేస్తారా? ఊహుఁ తను చావదు. ప్రభుని విడచి తను వెళ్ళదు. తన ప్రాణంలో ప్రాణం ప్రభు. తను లేకపోతే అతనుండలేడు. తామిద్దరూ ఒకరి కొకరు ప్రాణం.

వెన్నులో సూదిపోటు. అబ్బ! తనకేమౌతూంది? కళ్ళు వాటంతట అవే మూతలు పడిపోతున్నాయి. అయ్యో! తనని వాడి కత్తులతో చీరేస్తున్నారు. చీల్చేస్తున్నారు. బాధ తెలిసీ తెలియకుండా తనకే మౌతూంది? ప్రభు ఏడీ? అతనుండే వీళ్ళు తననిలా చీరుతూంటే ఊరుకున్నాడా? ప్రభూ!

"యామినీ....మాడమ్."

కళ్ళు తెరిచింది యామిని.

నిలువెల్లా మల్లిరేకులు కప్పుకున్నట్లు తెల్లని స్కర్ట్‌లో సిస్టర్!

"యస్. మీకు తెలివొచ్చింది" నవ్వింది ఆమె ధైర్యం చెబుతున్నట్లు.

"నేనెక్కడున్నాను? అహఁ నాకేమయింది?"

"ఏమీ కాలేదు. మదర్ అయ్యారు. మీకు బేబీ పుట్టింది. కంగ్రాట్స్" చిరునవ్వుతో అభినందన లందించింది.

యామిని ముఖం ఒక్కసారి వికసించింది పద్మంలా.

"సిస్టర్!....నా బేబీ ఏది? త్వరగా తెచ్చి చూపవూ?"

నవ్వుతూనే వారించింది సిస్టర్. "మీరు చాలా వీక్‌గా ఉన్నారు. ముందు ఇంజక్షన్ తీసుకోండి. ఈలోగా బేబీకి స్నానం ఔతుంది. తెచ్చి చూపు తాను." అంటూనే ఆమె ముఖంలోకి ఆశ్చర్య పోతున్నట్లు పట్టి పట్టి చూసి - ఒక్క నిట్టూర్పు వదిలింది.

"ఏమైంది?" నిర్లిప్తంగా-సిరంజీలోకి ముందు ఎక్కిస్తున్న సిస్టర్‌ని చూస్తూ ఆత్రంగా అడిగింది యామిని.

"ఏమీ లేదు." అంటూ వొచ్చి-నీడిల్‌తో భుజం దగ్గర ప్రిక్ చేసి మెల్లగా యింజక్షనిచ్చి - వెళ్ళ బోయింది.

"సి....స్ట....ర్...."

వెళ్ళిపోతున్నదల్లా ఆగి-వెనక్కి తిరిగిచూసింది.

"వారు...." అడగలేక - సిగ్గుపడుతున్నట్లాగి పోయింది.

"ప్రభు?"

"ఊఁ"

"వొస్తారు. కొంచెంసేపట్లో...."

యామిని కిప్పుడు నీరసమనేదే లేదు. ఆమె హృదయం ఆనందంతో గంతులు వేస్తూంది. ఆమె సంతోషం పట్టలేకపోతూంది. గర్వం ఆమెలో పొంగిపొరలుతూంది. తను అమ్మ అయింది!.... తనకి నలుగురిలోనూ ప్రత్యేకత ఉంటుంది. స్త్రీకి అమ్మ అనిపించుకుంటే అదో హోదా. స్త్రీ జీవితా నికి మాతృత్వమే సార్థకత. తనూ-సృష్టికి తోడ్పడ గలిగింది. చిన్న పాపతో తన యిల్లు కలకలలాడు తుంది. ఇక తనకి తీరికే ఉండదు. బేబీకి నీళ్ళు పోయడం....పౌడరూ అదీ రాసి....బట్టలు మార్చి-నీటుగా ఆరోగ్యంగా ఉంచడం....ఆడించడం....నిద్ర పుచ్చడం....ఓహ్! చేతినిండా పనులే. క్షణం తీరికుండదు.

బేబీని చక్కగా పెంచాలి. ఆరోగ్యంగా. అందంగా, తెలివిగా తయారు చెయ్యాలి. ఫరవాలేదు. పిల్లల పెంపకం గురించి తను చాలా పుస్తకాలు చదివి చాలానే తెలుసుకుంది. తెలియనివి వుంటే ఏ చిల్డ్రెన్ స్పెషలిస్టునో అడిగి తెలుసుకుంటుంది. పాపకి త్వరగా టాటా చెప్పడం నేర్పెయ్యాలి. ప్రభుని గేటువరకూ సాగనంపి - బేబీచేత టాటా చెప్పిస్తే ప్రభు - మురిసిపోతాడు. ముచ్చటపడతాడు.

అన్నట్లు, యికనుంచి యిల్లు మరీ శుభ్రంగానూ ప్రశాంతంగానూ ఉంచాలి. పెద్ద వాల్యూములో రేడియో పెట్టడం, ధ్వనులూ చేయకూడదు. ప్రశాంతమైన, ఆహ్లాదకరమైన వాతావరణంలో పెరిగే పాపలు భవిష్యత్తులో ఆదర్శంగా తయా రౌతారుట. తన పాప-తనకి గర్వకారణం కావాలి. పాపవల్ల తనకి మంచి పేరు రావాలి. ఔను. తను-పాపనలాగే పెంచుతుంది. కంటికి రెప్పలా కాపాడు తుంది. క్రమశిక్షణతో పెంచుతుంది. పాప తనకి వెలుగు.

పాపకి—మంచి పేరు పెట్టాలి.

తన పాప అపురూపమైన పాప.

అపురూపమైన పాపకు అతికేలా అత్యంత అందమైన పేరు పెట్టాలి.

దీప్తి....జ్యోత్స్న....కౌముది....శశి. ..ఏం పెడితే బాగుంటుందో?

తన ఒక్కతె తరమూ కాదు. ప్రభు సహాయం తీసుకోవలసిందే. అతనయితే - నిశ్చయంగా మంచి పేరు నిర్ణయించగలడు. ప్రభు సౌందర్యపిపాసి. రసహృదయుడు. తీరుబడి దొరికితే కవితలు వ్రాస్తాడు. లలితమైన భావాలు. సరళమైన శైలి. సుందరమైన పదాలు. మనిషిలాగే అతని భావాలూ సున్నితమైనవీ, సుందరమైనవీ. మనిషి సుకుమా రంగా ఉంటాడు. ఏపని చేసినా సున్నితంగా చేస్తాడు. మనసు మృదువు. మాట మెత్తనా తీయనా. అటు వంటి మగవారు అరుదు. ప్రభు - తనకి లభించిన అమూల్యవరమే. నిజంగా—పూర్వజన్మనేదీ, పూర్వ జన్మ సుకృతమనేదీ ఉండే ఉంటుంది. కాకపోతే తనకి ప్రభు లభించడమేమిటి? ఎంత అదృష్టమో అతను తనకి భర్తకావడం. ఆ కరుణామయుడు కాదంటే తన గతేమయ్యేదో? చిన్నప్పుడు కష్టపడినవాళ్ళు పెద్దయ్యాక సుఖపడతారంటారు. ఆ మాట-తనపట్ల అక్షరాలా నిజమే అయింది. లేకపోతే-చీకటి నిండిన తన జీవితంలో వెన్నెలలు విరియడమేమిటి? అసలు-తను కలలోనయినా అనుకుందా యిటువంటి జీవితం లభిస్తుందని? ఇంత చక్కని జీవితం గురించి ఆశపడడానికయినా అర్హతలేని అథమ స్థితిలో గడిచింది తన బ్రతుకు.

యామిని శతవిధాల ప్రయత్నించింది. ఆ గడ్డు రోజులు తలుచుకోకుండా ఉండాలని. సుఖంలో— దుఃఖం నిండిన గతమూ; దుఃఖంలో సుఖమయ మైన పాత రోజులూ మనిషికి జ్ఞాపకం రాకుండా ఉండవు కాబోలు!

"సిస్టరింకా బేబీని తీసుకురాదేం?" విసుక్కుంది యామిని.

"ప్రభువొచ్చినా బాగుండును."

సిస్టర్ బేబీని తీసుకురాలేదు, ప్రభూరాలేదు.

యామినికి గతమంతా గుర్తుకి రాక తప్పలేదు.

ఆమె నీరసంగా, వెనక్కి దిండుమీదకి వాలింది.

*

తెలిసీ తెలియని వయసది. ఏడెనిమిదేళ్ళు.

ఎప్పుడూ అమ్మా నాన్నా దేనికో ఒక దానికి దెబ్బలాడుకుంటున్నట్లే కనిపించేవారు. వాళ్ళ మాటల్లో "డబ్బు.... అప్పులు .... పీకల మీదకి

వచ్చాయి వ్యవహారాలు....'' ఇటువంటివే విని పించేవి. నాన్న కళ్ళెప్పుడూ ఎర్రగా ఉండేవి. అమ్మ ఎప్పుడూ దిగులుపడుతున్నట్లే కనిపించేది.

ఆవేళ....సాయంత్రం.

ఇంటాయన వచ్చాడు. "ఆరునెలల పైన అద్దె బాకీ. నీ కోసం కట్టించాననుకున్నావా? ఉల్పాగా ఉండడానికి ఇదేమీ ధర్మసత్రంకాదు. అద్దె ఇస్తావో సరే, లేదంటే తెల్లారేసరికి నీ చెంబూ తప్పేలా వీధిలోకి విసిరేసి నిన్నూ నీ కుటుంబాన్నీ రోడ్డు మీదకి గెంటేస్తాను.''

"కొంచెం వ్యవధి...'' ప్రాధేయపడ్డాడు నాన్న.

"సిగ్గులేదూ? ఆరునెలల నుంచీ ఇలాగే జరుపులు పెట్టుకుంటూ వస్తున్నావ్! వ్యవధిలేదు ఏమీ లేదు. తెల్లారేలోగా అద్దె ఇచ్చినాసరే, ఇల్లు వదిలి పోయినాసరే.'' తెగేసినట్లు చెప్పి వెళ్ళాడు.

ఇంటాయన ఇలా వెళ్ళాడో లేదో బోలెడంత మంది వచ్చి యింటి మీద పడ్డారు.

"పాలబాకీ....''

"వెచ్చాలకొట్టు కాతా....''

"బట్టలకొట్టు పద్దు....''

"సిగరెట్ల అరువు....''

కట్టకట్టుకు వచ్చినట్లు వచ్చి పడ్డారు. పెద్దగా నోళ్ళు పెట్టి అరిచారు.

నాన్న వారికేమీ జవాబు చెప్పలేదు.

మాటలు రాని వాడిలా నిలబడిపోయాడు తల వంచుకుని.

"తేరగా తిని పోదామనుకున్నావా, ఎవడిబాబు సొమ్మనుకున్నావ్?''

ఒక్కొక్కరూ లోపలికి వచ్చేశారు. ఎవరిచేతి కందిన సామాను వారు పట్టుకుపోయారు. ఇంట్లో- సామాను మాత్రం ఏముందని?

తను వరండాలో ఓ మూల నక్కి జరుగుతున్నదంతా చూస్తూంది. తనకి చాలా భయం వేస్తూంది. ఏడుపు వస్తూంది. వాళ్ళందరూ దొంగల్లా వచ్చి తమ వస్తువులు పట్టుకుపోతూంటే నాన్న ఊరుకుంటాడేం? అసలు వాళ్ళని ఇంట్లోకి ఎందుకు రానిచ్చారు? బిక్కచచ్చి చూస్తూ ఉండిపోయింది.

ఇల్లు కాళీ ఐపోయింది పూర్తిగా. ఏమీ మిగల లేదు తనూ అమ్మా నాన్నా తప్ప.

ఇరుగు పొరుగువాళ్ళు వింత చూసినట్లు చూసి వెళ్ళిపోయారు.

అమ్మ — ఏడుస్తూంది.

తను అమ్మదగ్గరకి పరుగెత్తింది. "అమ్మా!'' ఒళ్లో వాలిపోయింది.

తనని దగ్గరకు తీసుకుని మరీ బిగ్గరగా ఏడవ సాగిందమ్మ. అమ్మ అలా ఏడుస్తూంటే తనకి ఎక్కువ భయమేసి ఎంతో ఏడుపొచ్చేసింది. అమ్మతో పాటు తనూ ఏడవడం మొదలు పెట్టింది.

నాన్నవచ్చాడు. "ఏడవకండి.''

అమ్మ ఏడుపు ఆపలేదు. "ఏడుపుగాక ఏం మిగిలింది?''

"చెబుతాను. ఇలా చూడు.''

నాన్న నవ్వుతున్నాడు. కాని- కళ్ళవెంట నీళ్ళు వస్తున్నాయి! ఆ నవ్వు తెచ్చిపెట్టుకున్నట్లుంది. ఇంతకీ అది ఏడుపా, నవ్వా? ఏమో.

"ఈ కష్టాలు మనకిక ఉండవు.''

కొత్తమాట వింటున్నట్లు నమ్మలేనట్లు చూసిందమ్మ ఏడుపు ఆపి.

"ఈ ఒక్కసారి నా మాట నమ్ము. త్రికరణ శుద్ధిగా నేను నిజమే చెబుతున్నాను. అబద్ధమాడడం లేదు. నిజంగా మన కష్టాలు గట్టెక్కేందుకు నేనో ఉపాయం ఆలోచించాను. దుర్భరమయిన మన బతుకులకి నిశ్చయంగా అదే తరుణోపాయం.''

నమ్మకం కలుగుతున్నట్లు ఆశగా చూసిందమ్మ.

"మన బాధలు తీరేమార్గం భగవంతుడే మిగిల్చాడు. అందుకే నీ మెడలో మంగళసూత్రం వాళ్ళకంటపడలేదు. దేముడు దయామయుడు సుమా!''

అమ్మ-మెడచుట్టూ చేతులు వేసుకుంది.

"నీ మంగళసూత్రం యిటివ్వు.''

యివ్వలేనన్నట్లు తల అడ్డంగా ఊపిందమ్మ.



1. ఈ మధ్య ప్రపంచం దృష్టిని విశేషంగా ఆకర్షించిన దేశాలలో కంబోడియా ఒకటి. అయితే ఈ దేశం ఇప్పుడు మరో పేరుతో వ్యవహరింపబడుతోంది. ఆ కొత్త పేరు ఏమిటి? అట్లాగే ఆ దేశం రాజధానీనగరం ఏదో చెప్పగలరా?
2. మన దేశానికి ప్రధానమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ అని మీకందరికీ తెలుసు. ఈ మధ్య కేంద్ర ప్రభుత్వంలో ఉపప్రధానులు కూడా నియమింపబడ్డారు. వారు ఎంతమంది? ఎవరెవరు?
3. ప్రపంచంలో కల్లా ఎత్తైన శిలావిగ్రహం ఏది? ఎక్కడుంది?
4. భారత స్వాతంత్ర్య సమరాన్ని సమర్థించి అందులో పాలు పంచుకున్న ఐర్లండు వనిత ఎవరు?
5. మన దేశంలోని చిత్తరంజన్‌లో విద్యుచ్ఛక్తితో నడిచే రైలు ఇంజన్లు తయారు చేస్తున్నారు. అసలు విద్యుచ్ఛక్తితో పయనించే రైలు ఇంజన్లు కనిపెట్టిన వ్యక్తి ఎవరు? ఏ దేశస్థుడు?
6. 1947లో భారత్, పాకిస్తాన్ దేశాలతో పాటు మరో రెండు దేశాలు కూడా స్వతంత్ర దేశాలు అయ్యాయి. అవి ఏవి?
7. ఇది వేసవికాలం. ఎండలు మండిపోయే ఈ కాలంలో సూర్యుడు మన కంటికి అగ్నిగోళంవలె కనిపించడం సహజం. అయితే సూర్యగోళంలో అంతర్గతమైవున్న ఉష్ణోగ్రత ఎంతో చెప్పగలరా?
8. ప్రపంచంలో కల్లా అతి పెద్ద వజ్రం ఏది?
9. మన దేశంలోని ముఖ్యమైన మతాలు ఎన్ని? అవి ఏవి?
10. మేఘాలయ, నాగాలాండ్, త్రిపుర, హిమాచల్‌ప్రదేశ్, మణిపూర్ రాష్ట్రాల రాజధానీనగరాలు ఏవో చెప్పగలరా?

**[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]**

ఆమె కళ్ళల్లోకి మళ్ళీ నీళ్ళొచ్చేశాయి.

"కాదనకు. సందేహించకు. ఇక ఎప్పుడూ ఏమీ అడగను. మన బ్రతుకులు మలుపు తిరగ బోతున్నాయి. అదృష్టం మనని వరించి అందల మెక్కించబోతూంది. ఆపకు." వేడుకుంటున్నట్లే అన్నాడు.

"అది కాదు. ఇది యిచ్చేందుకు నేను సంకోచించడం లేదు. కాని, దీన్ని నా చేతులతో తీసి యివ్వాలంటే....నాతరం కాదు. ఇది-మీరు కట్టిన తాళి. నా జీవితంలో ఏమయినా మిగిలిందంటే-యిదే ..."

"మన ప్రేమానురాగాలూ అనుబంధమూ మంగళసూత్రాని కతీతం. మనహృదయాలు పెన వేసుకున్నాక, ఒకదానిలో ఒకటి కలసిపోయాక యీ చిన్న ప్రాణం లేని సూత్రంతో పనేమిటి? మరణంలో కూడా మన బంధం విడదు."

మెల్లిగా అమ్మ మెడలోంచి మంగళసూత్రం విప్పేశాడు.

"కొంచెం సేపట్లో వొస్తాను. దరిద్రానికీ దౌర్భాగ్య జీవితానికీ స్వస్తి చేప్పే తరుణంలో మనం మంచి విందు చేసుకుందాం. సిద్ధంగా ఉండండి."

నాన్న బయటకు వెళ్ళిపోయాడు నన్నూ అమ్మనీ వదిలి.

బుడ్డిదీపం ఎర్రగా వెలుగుతూంది.

గదిలో సామానేమీలేక బోసిగా బావురు మంటూన్నట్లుంది.

"అమ్మా! నా బొమ్మలపెట్టి కూడా పట్టుకు పోయారు దొంగలు."

"మళ్ళీ కొనుక్కుందాంలే. మీ నాన్నగారు" మాట పూర్తిచెయ్యలేకపోయింది.

"ఆకలేస్తూందమ్మా."

"మీ నాన్నగారొస్తారు. మిఠాయిలూ అవీ తెస్తారు."

కొంతసేపటికి నాన్న వచ్చారు. పొట్లాలతో మిఠాయీ అవీ తెచ్చారు.

అమ్మ అవి ముగ్గురికీ సర్దింది.

కొంచెం తిన్నదో లేదో – నోరంతా ఏదోలా ఐ కడుపులో వికారం పెట్టి, వాలిపోయింది. నన్ను గమనించనట్లు అమ్మా నాన్నా ఆ స్వీట్లు తినేస్తు న్నారు. తనకు ఎక్కడలేని నిద్రా ముంచుకొచ్చింది.

కళ్ళు తెరిచేసరికి....

తనకి తెలియని చోట ఉంది. ఆ గదిలో ఎవరూ లేరు.

భయమేసింది. "అమ్మా!....నాన్నా!" ఏడిచింది.

ఎవరో వచ్చారు. "భయంలేదు పాపా. మేమున్నాంగా."

"అమ్మా....నాన్నా....?"

వాళ్ళొకరిముఖం ఒకరు చూసుకున్నారు. కొంచెంసేపటికి - కాకీబట్టలేసుకున్న పోలీసాయన వచ్చాడు. నన్ను చూసి వెళ్ళాడు.

కొంచెం రోజులు గడిచాక, ఒక ముసిలాయన వచ్చి, "పాపా!" అని పిలిచారు. ఆయన - తాతగారిలా ఉన్నారు గెడ్డాలూ పండుజుత్తులతో. నాకేమీ భయం వెయ్యలేదు.

"నీపేరేమిటమ్మా?"

"యా...మి...ని..."

"గుడ్!" తనే తలనిమిరి - "చదువుకుం టున్నావా?" అని అడిగారు.

"ఊఁ మూడోక్లాసు బి సెక్షన్."

"వెరీగుడ్, నిన్ను మంచి బడికి తీసుకెళ్తాను. నాతో వొస్తావా?"

"మా అమ్మా, నాన్నా?"

"నువ్వు బాగా చదువుకుని బుద్ధిగా ఉంటే, వొస్తారు."

తనకేడుపొచ్చింది, ఏడిఁ ంది, ఆయన తనకు చాకులెట్లూ అవీ యిచ్చి ఊరుకోబెట్టారు. ఎత్తుకుని అవతలకి తీసుకు వెళ్ళారు. అక్కడ జీపుంది. "జీపులో షికారు వెళ్దామా? నీకు బొమ్మలూ బట్టలూ కొంటాను."

"ఊఁ" ఉత్సాహంగా అంది. తాత్కాలికంగా అమ్మనీ నాన్ననీ మరచిపోయింది.

బజారులో ఆయన తనకి చాలా కొన్నారు. బొమ్మలూ, బొమ్మల పుస్తకాలూ, బట్టలూ, చాకులెట్లూ, చిన్న సంచీ కొనిపెట్టి మళ్ళీ జీపెక్కిం చారు. జీపులో వెళ్తూంటే తమాషాగా ఉంది. జీపు పరుగెత్తి పరుగెత్తి ఒక పెద్ద గేటు దగ్గర ఆగింది. అక్కడ దింపి లోపలకు తీసుకువెళ్ళారు. అది-ఎంత పెద్ద యిల్లు! అక్కడ తనలాటి పాపలెందరో ఉన్నారు.

తనక్కడ చాలాకాలం ఉంది. నిజానికక్కడే పెరిగి పెద్దదయింది. బి. ఏ. పరీక్షలు వ్రాసింది. సంగీతం నేర్చుకుంది. కుట్టుపనులు నేర్చుకుంది. తనని తీసుకువచ్చిన తాతగారు యింకా ముసిలి వి పోయారు. ఆయన తల అచ్చంగా ముగ్గుబుట్టలా ఉండేది. ముఖం - విభూతి పండులా ఉండేది. ఆయనకి తనంటే ఎంతో వాత్సల్యం.

ఆ వేళ....శరణాలయం వార్షికోత్సవం. ఊరి లోంచి చాలామంది వచ్చారు కార్యక్రమాలు తిల కించేందుకు. తను - బి. ఏ. ఫస్ట్ క్లాసులో పాసై నందుకు శరణాలయం అభినందించింది. తరువాత - తను లలిత సంగీతం పాడింది. నృత్యం చేసింది. తన పాటలూ....నృత్యమూ సభికులను ఆకర్షించి నట్లున్నాయి. కరతాళధ్వనులతో హాలు మార్మోగి గింది. తరువాత పదిరోజులకి కాబోలు....

ఆ సాయంత్రం తాతగారు తనని పిలిచారు. వారి గదికి వెళ్ళింది.

"చూడు యామినీ! నీ కోసం ఎవరో వచ్చారు. విజిటర్స్ రూములో ఉన్నారు."

"నా కోసమా!" ఆశ్చర్యపడింది. ఇన్నేళ్ళ లోనూ తన కోసం ఎవరూ రాలేదు. ఇప్పుడు వచ్చిందెవరై ఉంటారు?

"వారు - ప్రభు. నీకు తెలిసిన వారు కారు. కాని....నీతో మాట్లాడుతారుట. యామినీ నువ్వు వారితో మాట్లాడడానికేమీ సంకోచించనక్కరలేదు. వెళ్ళు."

ఆశ్చర్యపడుతూనే అతిథుల గదిలోకి నడిచాను. అక్కడ ఒక్క యువకుడు తప్ప ఎవరూ లేరు. తాతగారు - వారంటే ఎవరో పెద్దాయననుకుంది తను.

"మీరు - యామిని?"

"ఊఁ" అంటూ ఒక్కసారి చూసిందతన్ని. చాలా అందంగా ఉన్నాడు. సన్నగా సుకుమారంగా బొమ్మలా ఉన్నాడు.

"నా పేరు ప్రభు. చూడండి. మీతో కొంచెం మాట్లాడాలి. ఇక్కడ కంటే - కొంచెం విశాల మయిన ప్రశాంతమైన స్థలం ఏదన్నా ఉంటే...."

"అలా తోటవేపు వెళ్దాం పదండి –" దారి తీసింది. శరణాలయం ఆవరణలోనే కొంత మేర పూల తోట పెంచుతున్నారు. ఆ తోటలో ఫౌంటెనూ, కూర్చుందుకు బెంచీలు కూడా ఉన్నాయి. ఇద్దరూ కూర్చున్నారు. వాతావరణం మనోహరంగా ఉంది. అతను మెల్లగా అన్నాడు. "యామినీ!

మొన్న మీ గానం విన్నాను, నాట్యం చూశాను. రెండూ చాలా చక్కగా ఉన్నాయి. మీకు నా అభినందనలు.''

''కృతజ్ఞతలు'' తల వంచుకుని అంది తను.

''మీది - బహుముఖ ప్రజ్ఞ. మీరు అందమైన వారు. తెలివయినవారు. గాయని....నర్తకి.''

సిగ్గుతోనూ ఆనందంతోనూ మౌనం దాల్చింది తను.

''మీవంటి వారు అరుదు. యామినీ! మిమ్మల్ని నేను - ప్రేమిస్తున్నాను.''

త్రుళ్ళిపడి చూసిందతని వైపు.

''నేనెదురు చూసిన స్వప్నసుందరి మీరే! నేనేమీ ఆవేశంలో అనడంలేదు. ఆనాడు మిమ్మల్ని చూసినప్పటి నుంచీ యివ్వాళ్టివరకూ ఆలోచిస్తూనే ఉన్నాను. చాలా ఆలోచించాకనే నిర్ణయించుకున్నాను. నా పేరు ప్రభు. ఎమ్. కామ్ పాసై ఓ ఫర్మ్‌లో పనిచేస్తున్నాను అకౌంటెంట్‌గా. నెలకి పదిహేను వందల జీతం. క్వార్టర్సూ అవీ ఉన్నాయి. మీకు నేను నచ్చితే....''

సిగ్గుపడుతూ అంది తను మెల్లగా — ''అంతా తాతగారి యిష్టం.''

''అదృష్టవంతుణ్ణి. మీకు నేను నచ్చినట్లేగా.... నేను తక్కిన విషయాలాయనతో మాట్లాడతాను. అన్నట్లు నాకు అమ్మా నాన్నా లేరు. దూరపు బంధువులే ఉన్నారు.'' అతను తనని ఆశ్రమం వరకూ అనుసరించి తాతగారి గదిలోకి వెళ్ళాడు.

కొంచెం సేపట్లో పిలుపు వచ్చింది. ప్రభు — అక్కడే ఉన్నాడు. సిగ్గుపడుతూ ద్వారం వద్దనే నిలుచుంది తను. తాతగారు దగ్గరగా రమ్మన్నారు. తన చేతిలోని కాగితం అందించి - ''పైకి చదువమ్మా యామినీ!'' అన్నారు.

అది—పాత వార్తాపత్రికలో కటింగ్. ఇద్దరి బొమ్మలు. దిగువ....బయటికే చదివింది తను. ''దుర్వ్యసనాలకి లోనై ఉద్యోగం పోగొట్టుకుని — ఆర్థిక బాధలకు తట్టుకోలేక పిరికివాడై తనతోపాటు తన భార్యని కూడా మృత్యువుపాలు చేశాడీ యువకుడు. ఆహారంలో విషం కలిపి యిచ్చాడు. తనూ తిన్నాడు. అదృష్టవశాత్తూ ఏడేళ్ళ పాప మరణం తప్పించుకుంది.''

మెల్లగా చెప్పారు తాతగారు. ''ఆ పాప యామినే. హాస్పిటల్‌నుంచి అనాథ శరణాలయానికి తెచ్చాను. బంధువులెవరూ యీమెను చేరదియ్యలేదు.'' ఆగి — ''యామిని యిక్కడే పెరిగింది.



'వంచిత' కథ రాసిన శ్రీమతి ఇచ్ఛాపురపు కుసుమ కుమారి, బి. ఎస్ సి వరకు చదువుకున్నారు. జన్మస్థలం శ్రీకాకుళం. ప్రస్తుతం అనకాపల్లిలో వుంటున్నారు. లోగడ 'వనిత'లో 'మగబుద్ధి' అన్న కథను 'కవిత' అన్న పేరుతో రాశారామె. ఆమె రాసిన 'వాహిని' అన్న నవల - ఆంధ్రజ్యోతి వారపత్రిక నిర్వహించిన నవలల పోటీల్లో (1972) ప్రథమ బహుమతి గెల్చుకున్నది. 'ఏటిలో కెరటాలు', 'వెన్నెల'- అన్న నవలలు పుస్తక రూపంలో వచ్చాయి. పలు మాస, వారపత్రికల్లో ఆమె రచనలు చేస్తున్నారు.

పట్టభద్రురాలైంది. సంగీతమూ నృత్యమూ వంటి లలిత కళలలో ప్రవేశం సంపాదించింది. ప్రభూ! నువ్వీమెను చట్టబద్ధంగా వివాహం చేసుకుందుకు సంసిద్ధుడివేనా?'' అడిగారు.

''ఊఁ'' అన్నాడతను.

''ఎల్లుండి కలుసుకో. యామిని తరపున అంగీకారం తెలియజేస్తాను. నీ ఫొటో ఒకటివ్వు.'' డైరీలోంచి వెంటనే తన ఫొటో తీసి యిచ్చాడు.

చిత్రంగా చూస్తూంది తను.

ప్రభు వెళ్ళిపోయాక - గుమాస్తాని పిలిచి - ''ఈ ఫొటో పట్టుకుని యీ అడ్రస్‌కి వెళ్ళి రేపు సాయంత్రాని కన్ని వివరాలూ తెలుసుకురా. యామిని వివాహం చేసుకుంటానంటున్నాడీ యువకుడు.'' అని ప్రభు ఫొటో, వివరాలూ అందించారు. అతను వెళ్ళాడు.

''ఇవన్నీ కనీసపు ముందు జాగ్రత్తలు. అతని మాటలు నిజమోకాదో వాకబు చేసి - వరుడు సవ్యమైనవాడయితే - రిజిస్టర్డ్ మ్యారేజ్ చేయిస్తాం.''

తల ఊపింది తను. తను అనాథ! తన వెనుక చక్కని జీవితం ఏమీలేదు. ఇది తెలిసీ ప్రభు వివాహం చేసుకుంటాడా తనని? సందేహాలూ భయమూ పట్టుకున్నాయి.

నెల దాటేక - తనకీ ప్రభుకీ వివాహం జరిగింది రిజిస్ట్రార్ ఆఫీసులో. తరువాత - శరణాలయంలో చిన్న విందు. అక్కడినుంచి - ప్రభు యింటికి.

ఆ యిల్లు ఎంతో అందంగా, కళాత్మకంగా ఉంది. చిన్న గార్డెన్. కిటికీలకీ ద్వారాలకీ సిల్కు తెరలు.

ప్రభు కొంచెం ప్రత్యేకమైన మనిషి. తెలియక పోతే పిచ్చి అనిపిస్తుంది. అన్నీ అందంగా ఉండాలి. ఎప్పుడూ మనుషులూ పరిసరాలూ ఆహ్లాదకరంగా కనిపించాలి. సర్వెంటయినా సరే రోజూ గెడ్డం గీసుకుని బట్టలు మార్చవలసిందే. డైనింగ్ టేబుల్ మీదకి మంచి క్రోకరీ ప్లేట్లూ, కప్పులూ, సాసర్లూ, ఎక్కడినుంచో తెప్పించాడట. అతనమిత సౌందర్యారాధకుడు. ప్రణయ కవిత్వమూ భావకవిత్వమూ అల్లేవాడు.

''మీకింత పిచ్చికదా అందమంటే, నన్నెందుకు చేసుకున్నారు?'' అడిగేది తను తమాషాకి.

''నీ అందం నీకేం తెలుసు? నా కళ్ళు పెట్టుకుని చూడు.''

''నేను ముసలిదాన్నయి, అందం తగ్గిపోతే - ఏం చేస్తారు?''

''నీ అందం తగ్గదు. వయసుతో పాటు వన్నె పెంచుకుంటుంది.''

అతనితో ఐదారు సంవత్సరాలూ యిట్టే గడచి పోయాయి తెలియకుండా. అసలే ప్రభుకి స్నేహితులెక్కువ. వెడ్డింగ్ యానివర్సరీలకయితే ఎంతమంది వచ్చేవారో లెక్కే ఉండేది కాదు!

పాప కడుపులో పడింది.

''నేను చెప్పలేదూ, నువ్వు గర్భవతివి. అయినా నీ అందం పెరుగుతూనే ఉంది.''

''ఇక యిలాటి మాటలు కట్టిపెట్టాలి. మన మధ్యకు మూడో వాళ్ళు వస్తారు. మీ మాటలు వింటే - నవ్వుతారు.''

''ఏమీ నవ్వరు. నా పిల్లలు నాలాగే అందంగానూ ఉంటారు, సౌందర్యారాధకులూ ఔతారు.''

"ఇన్నాళ్ళయినా మీ పిచ్చి తగ్గలేదు."

"అది తగ్గేది కాదు పెరిగేదే."

"మీకు బాబు కావాలా బేబీయా?"

"బాబయినా బేబీ అయినా అందంగా ఉండాలి, నీలాగ. సౌందర్యాన్వేషి కావాలి నీలా."

నవ్వుకుంది అతని పిచ్చికి. తను అందమైనది. ప్రభు అందమైనవాడు. ఒకరంటే ఒకరికెంతో ప్రేమ. ప్రేమగా దాంపత్యం సాగించేవారికి అందమైన పిల్లలే పుడతారని ఎక్కడో చదివింది తను. ఏ విధంగా అయినా తమకి పుట్టబోయే పాప తప్పకుండా చక్కగా ఉండి తీరుతుంది.

అబ్బ! ఇంకా సిస్టర్ బేబీని తీసుకురాదేం?

ప్రభు యింకా రాడేం?

యామిని మనసు ఆత్రుతతో కొట్టుకుంటూంది. బేబీ ప్రభులను చూడాలని ఆమె కలలు కంటూంది జరగబోయే సన్నివేశం గురించి.

బేబిని సిస్టర్ తెస్తుంది. రబ్బరు బొమ్మలా దేవతల పాపలా ముద్దొస్తూంటుంది బేబీ. ప్రభు వొస్తాడు. అంత చక్కని బేబి నిచ్చినందుకు పొగడ్తలతో అభినందనలతో ముంచెత్తుతాడు. సున్నితంగా ముద్దు పెట్టుకుంటాడేమో!

"మాడమ్!"

"యామినీ!"

అటునుంచి సిస్టర్.

ఇటునుంచి ప్రభు.

అయ్యో! ఎంత అశక్తురాలైపోయింది తను! తనంతట తాను లేచి కూర్చోలేదు.

కదిలితే బాధ.

ప్రభు వచ్చాడు బెడ్ దగ్గరగా. "యామినీ!"

అతని ముఖం ఎందుకింత వాడిపోయింది? అలా ఉన్నాడేం?

"నాకు అపరేషను చేశారనా యింత దిగులు మీకు? ఫరవాలేదు. త్వరలోనే కోలుకుంటాను. మళ్ళీ మునపటి యామినినై...."

"మాడమ్ బేబీని క్రాడిల్‌లో ఉంచేదా?"

అటువైపు చూసింది. అంతే.

యామిని ముఖం చీకటిలా ఐపోయింది. "నో!" అరిచింది ఆవేశంగా. "అసంభవం! నేను నమ్మను మోసం, దగా" బేబీ ఏడవసాగింది.

ఆమె అరుపులకి కాబోలు డాక్టర్ నీలిమ పరుగెత్తుకొచ్చింది. "ఏమైం"దంటూ ప్రభునీ యామినినీ క్రాడిల్లో ఉన్న బేబీనీ చూసింది. ఆమె మెదడులో ఒక ఆలోచన మెదిలింది.

జాలిగా నిట్టూర్చుతూ "యామినీ! మీరు ఎక్సయిట్ కాకూడదు. మీకు చాలా విశ్రాంతి అవసరం. ప్రభూ! ఇందుకు మీ సహకారం కూడా అవసరం" అని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ప్రభు సిస్టర్ని పిలిచి బేబీ నక్కడినుంచి తీసుకు వెళ్ళిపొమన్నాడు.

యామిని కళ్ళనుంచి ధారలు కట్టి కారుతున్నాయి కన్నీళ్ళు.

"నేను వెళ్తాను యామినీ."

వొద్దన్నట్లు చూసిందామె అతనివంక సజల నయనాలతో.

"నీతో కొంచెం మాట్లాడాలి. కాని అందుకిది సమయం కాదు."

"ప్రభూ!" భయంతో కంపించిపోయింది.

"చక్కగా విశ్రాంతి తీసుకుని కోలుకో."

విశ్రాంతి! ఇంకెక్కడి విశ్రాంతి? ఇలా జరిగాక.

ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది. ప్రభు వెళ్ళిపోయాడు.

సిస్టర్ ఇంజక్షన్‌తో వొచ్చింది.

"సిస్టర్! ఎందుకిలా జరిగింది?" దీనంగా అడిగింది.

"ఎలా?" ఏమీ ఎరుగనట్లు ముఖం పెట్టి అడిగింది.

"వారిని ప్రభుని చూశావుగా!! నన్నూ చూస్తున్నావు. మేము అందమైన వాళ్ళంకామూ?"

"చాలా ప్రెటీ కపుల్. ఎవరు కాదనగలరు?"

"మరి మా బేబీ?"

జాలి పడింది నర్స్.

నిజమే. ఈ తల్లి తండ్రులకా బేబీ పుట్టిందంటే వింతగానే ఉంటుంది. ఎవరూ నమ్మలేరు. వీళ్ళ బేబీ నల్లగా చింపాంజీ పిల్లలా వికృతంగా అసహ్యంగా ఉంటుంది. కంఠం కూడా కర్కశంగా....

"ఎందుకన్న ప్రశ్నకి ఎవరు జవాబు చెప్పగలరు? సృష్టిలో ఎన్నో విచిత్రాలు జరుగుతూంటాయి. ఆరోగ్యవంతులయిన దంపతులకి వికలాంగులు జన్మిస్తూంటారు. ఒకొక్కప్పుడు అదనపు అవయవాలతో పుడుతూంటారు. వీటన్నిటికీ కారణాలు చెప్పగలిగేంత అభివృద్ధి సాధించలేదు వైద్యశాస్త్రం. మీ బేబీ కొంతవరకూ నయమే. అవయవ లోపం లేదు."

ముఖ్యమైన లోపం రూపమే. పెద్ద తలకాయ, సన్నని మెడ. ఎవరివో తెచ్చి పెట్టినట్లు ముఖాని కతకని కళ్ళు. నల్లని నలుపు రంగు వొళ్ళు. ఎంత వెదికినా కనిపించదు అందం. ఇటువంటి పిల్ల ఎలా పుట్టింది తనకీ ప్రభుకీ?

"ఒక్క మాటడుగుతాను. ఏమీ అనుకోక చెప్పవూ సిస్టర్?"

ఇంజక్షనివ్వబోయేదల్లా "అడగండి" అంది.

"నిజంగా మా బేబీయేనా? ఏమయినా పొరబాటు జరగలేదుకద?"

"కథలలోనూ సినిమాలలోనూ తప్ప నిజంగా అలా జరగడం చాలా అరుదు. నీలిమా నర్సింగ్ హోమ్‌లో అటువంటివి పూర్తిగా అసాధ్యాలూ అసంభవాలూ. మీతో పాటు మరెవరూ డెలివరీ చెయ్యనేలేదు. కనుక మీ అనుమానం నిరాధారం." ఇంజక్షనిచ్చి "బాగా విశ్రాంతి తీసుకోండి." అని వెళ్ళిపోయింది.

యామిని మెదడుకి విశ్రాంతి ఎక్కడ? జ్ఞాపకాలు ఆలోచనలు....తను గర్భవతి అని లేడీ డాక్టర్ చెప్పిందారోజు. ఇక ప్రభు చేసే ఆర్భాటాని కంతులేకపోయింది. కాశ్మీర్ నుంచి కుంకుమపువ్వు తెప్పించి పాలతో తాగమన్నాడు. అలా అయితే పుట్టబోయేవారికి చక్కనిరంగు వొస్తుందట. తన గదినంతటినీ మంచి మంచి చిత్రాలతోటీ, అందమైన బొమ్మలతోటీ అలంకరించాడు. సౌందర్యాన్ని చూస్తూంటే - సంతానం సౌందర్యవంతులౌతారట! అతని మీద ప్రేమకొద్దీ అతని మాట ఒక్కటీ జవదాటకుండా ఆచరించింది. నిజంగా అదో తపస్సు. తమాషాఐన తపస్సు.

అంత తపస్సుకీ యిదా ఫలితం? తన తపస్సులో ఏం లోపముందని? తీయని సంగీతం విన్నా పాపకి కర్కశమైన కంఠమే వచ్చింది.

దేముడెంత నిర్దయుడు! ఉహుఁ నిర్దయకాదు. కఠినత్వం! ఉహుఁ! హింసించి ఆనందించే తత్వం. తను అమ్మ అయిందని ఆనందించాలా, బేబీని చూసి ఏడవాలా? ఏం చెయ్యాలి? ఒక కంట ఆనంద బాష్పాలూ, మరో కంట దుఃఖాశ్రువులూనా! తన సంగతి సరే. ప్రభు సంగతేమిటి?

ఓహ్! సిస్టరిచ్చిన ఇంజక్షను సెడటివ్ కాబోలు. నిద్రవొస్తూంది.

*

"రెండు మూడు రోజులలో డిశ్చార్జ్ చేసేస్తా నంది డాక్టర్."

"ఊఁ." అంది యామిని. నిజమే, తను చాలా కోలుకుంది శారీరకంగా.

"ఆ లోగానే మనం ఒక నిర్ణయానికి రావడం మంచిది."

భయంగా చూసింది. దేని గురించి?

"బేబీ గురించి. శాపంలాటి పాప గురించి." ఆ ప్రసక్తిరాగానే అతని ముఖంలో కండరాలు బిగిసి-ఎంత వికృతంగా మారిపోయాడు ప్రభు!

"ఆలోచించడానికేముందని!" అమాయకంగా అడిగింది.

"అంటే - నువ్వు ఆ పిశాచపు పిల్లని వెంట బెట్టుకుని వద్దామనుకుంటున్నావా?"

"మనం - మనుషులం, మన పాపా మనిషే. మరోలా ఎలా అవుతుంది?"

"చూడు యామినీ! తర్కంతోనూ వాదన తోనూ నన్ను జయించాలనుకోకు. అది పూర్తిగా అనవసరం."

"మీమీద నాకు గెలుపా! నేనటువంటి మూర్ఖురాలిని కాను. ఇది మీకూ తెలుసు."

"థాంక్స్, నాకు తెలుసు, నా యామిని పూర్తిగా నాతో సహకరిస్తుందని, మనమిద్దరం అందచందాలలోనే కాదు అభిప్రాయాలలోనూ అభిమతాలలోనూ కూడా మేడ్ ఫర్ యీచదర్. ఏం? ఏటొచ్చీ బేబీ, దేముడు చేసిన పెద్ద పొరపాటు, ఎక్కడో పడెయ్యవలసినదాన్ని మన దగ్గర పడేశాడు. ఆ పొరపాటుని మనం సరిదిద్దాలి."

"ఎలా?" ఆత్రంగా చూసింది యామిని.

"మనకి పాప పుట్టనేలేదనుకుందాం. మనం మళ్ళీ మామూలుగానే ఉందాం."

"అంటే! పాపేమౌతుంది?" భయంగా చూసింది.

"అది నువ్వు తెలుసుకోనక్కరలేదు. తెలుసుకో కూడదు కూడా." కఠినంగా అన్నాడు ప్రభు.

అంటే - పాపనేం చేయదలుచుకున్నాడు ప్రభు? ఏ శరణాలయానికైనా యిచ్చేస్తాడా అనాథ అని! లేకపోతే పాపను నిర్దాక్షిణ్యంగా చంపించేస్తాడా?



## ట్వయిన్ దారంతో చిత్రాలు

కావలసిన వస్తువులు: రెండు మూరల పొడవు, ఒక మూర వెడల్పు ఉండే ముదురునీలం కేస్‌మెంట్ ట్వయిన్ దారపు బండిల్. తెల్లదారము (మెషీన్‌ది) సన్నసూది.

ఈ చిత్రాలు చేయటం చాలా సులభమే అయినా నేర్పుతో ఓపిగ్గా చేయాలి. కేస్‌మెంట్ కయే ఖర్చు తప్ప ఖర్చు కూడా లేదు. మనం సెలక్ట్ చేసుకున్న బొమ్మ అందం పైనా, మన నేర్పుపైనా దీని అందం ఆధారపడి ఉంటుంది.

ముందుగా కేస్‌మెంట్ బట్ట మీద డిజైన్ ట్రేస్ చేసుకోవాలి. మెషిన్ దారాన్ని సూదికెక్కించుకోవాలి. డిజైన్ అవుట్‌లైన్స్ మీద ట్వయిన్ దారాన్ని ఉంచుతూ పైన మెషిన్ దారంతో టాకా పోయాలి. టాకా పోసేటప్పుడు ట్వయిన్‌దారం లోంచి సూదిని తీస్తే పోగులు లేచిపోయి అసహ్యంగా వస్తుంది అందువల్ల కాడకుట్టుతో నీట్‌గా కుడ్తే ఎంతో పరిశీలనగా చూస్తేగాని మిషన్‌దారం కనపడదన్న మాట. (ట్వయిన్ దారానికి అడ్డంగా మిషన్ దారం కుట్లు వస్తాయి) బొమ్మంతా యిలాగే కుట్టేసేయాలి. చాలా సులభంగా పూర్తయిపోతుంది. పూర్తయాక క్లాత్ అంచులకు వేలెడు వెడల్పున తెల్లటి పైపింగ్ వేయాలి అందంగా చెక్కించిన కర్ర ముక్కలను దూర్చటానికి వీలుగా పైనా, కిందా కొంచెం వెడల్పుగా మడిచి కుట్టాలి.

డార్క్ బాక్‌గ్రౌండ్‌తో తయారైన ఈ బొమ్మను ప్లెయిన్‌గా ఉండేవాల్‌కు హాంగ్ చేస్తే చాలా అందంగా ఉంటుంద.

పురికొసతో కూడా యిలాగే తయారుచేయవచ్చు. జానపద చిత్రాల్లాంటివైతేనే పురికొసతో చేయటానికి బావుంటాయి. పూర్తయాక రంగులతో అలంకరిస్తే ఎంతో కళాత్మకంగా ఉంటుంది. కాదేదీ 'కళ' కనర్హం అన్పిస్తుంది అందంగా తయారైన ఈ చిత్రాలు చూస్తుంటే. చూసినవారందరి కళ్ళను తప్పక ఆకర్షిస్తాయి. —బి. లలితా కిషోర్

"జరిగినది - జరగలేదని ఎలా అనుకునేది? పాపను కని తల్లినిగానని ఎలా మోసం చేసుకునేది నన్ను నేను? ప్రభూ! నన్ను పరీక్షించకు. క్షోభ పెట్టకు. నేనే కాదు, ఏ తల్లీ యిటువంటి పాపానికొడి గట్టలేదేమో. పాప కురూపే కావచ్చు. కాని-పాపను నేను అనాథను చేయలేను. క్షమించు."

ప్రభు ముఖం జేవురించింది. అందమైన అతని ముఖం కోపంతో కందగడ్డే అయింది.

"అయితే - నామీద నీకు ప్రేమా, నా మాట మీద నీకు లక్ష్యమూ లేవన్న మాట."

"కాదు ప్రభూ, కాదు. ఎంత మాత్రమూ కాదు. ఈ ప్రపంచంలో నాకెవరయినా ఉన్నారంటే-అది నువ్వొక్కడివే. నా ప్రాణం....జీవితం.... సర్వస్వమూ నువ్వే. నిన్ను నేను ఎంత ప్రేమిస్తానో చెప్పడానికి నా భాష చాలదు. నేను చేసుకున్న అదృష్టం - మీ భార్యను కావడం."

"నిన్నూ నేనెంతగానో ప్రేమిస్తానని నీకు తెలుసు. యామినీ! నిజంగా నీకు నామీద ఉన్న ప్రేమని మాటలలో కాదు, చేతలలో చూపాలి."

"తల్లి మనసు మీరర్థం చేసుకుందుకు ప్రయత్నించండి. నేను మీ భార్యనే. కాని - పాపకి తల్లిని కూడా. పాపనీ నన్నూ వేరు చేయబోకండి."

"ముందొచ్చిన చెవుల కంటె - వెనకొచ్చిన కొమ్ములు వాడి. నాకంటె పాపే ఎక్కువా?"

"నన్ను అగ్ని పరీక్షకు నిలబెట్టకండి. రెండు కళ్ళల్లో ఏదెక్కువంటే ఎవరు చెప్పగలరు? స్త్రీగా నాకు భర్తా కావాలి, సంతానమూ కావాలి. దేన్నీ వదులుకోను."

"యామినీ! నువ్వా పిశాచపు పాపను వెంట బెట్టుకొని యింటికొచ్చి – నలుగురి ముందూ నా పరువు తీసి అవమానాల పాలు చెయ్యడానికి వీల్లేదు. స్మార్ట్‌గా ఉండే నాకూ, బ్యూటీకి నిర్వచనంలా ఉండే నీకూ – యిటువంటి పాప పుట్టిందంటే - నలుగురూ మన ముఖం మీదే నవ్వుతారు. నేను నిన్ను అమితంగా ప్రేమిస్తున్నాను. నాకు

[ 74 వ పేజీ చూడండి ]

ఫ్రిబవరి 26 నుండి మార్చి 9 వరకు మద్రాసులో ఐదవ స్త్రీల జాతీయ చదరంగ ఛాంపియన్ షిప్‌లు జరిగాయి. ఈ పోటీలలో పది రాష్ట్రాలకు చెందిన ముప్ఫై ఆరు మంది వనితలు పాల్గొన్నారు. ఇందులో మొదటి రెండు స్థానాలను గెలుచుకున్న వారు ఈ సంవత్సరం జరిగే జాతీయ పోటీలలో (పురుషులతో బాటు) పాల్గొనేందుకు అర్హులవుతారు. మొదటి ఆరు స్థానాలు పొందినవారు ఆరవ స్త్రీల చదరంగ పోటీలలో పోటీ లేకుండా పాల్గొనడానికి అర్హత పొందుతారు. ఈ సారి ఆ ఆరుగురిలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన బి. సునిత కూడా ఒకరు కావడం విశేషం! అయితే ఈ పోటీలలో తొలినుంచి అందరినీ విశేషంగా ఆకర్షించిన వారు ముగ్గురు – వారు ఖాదిల్కర్ సోదరీమణులు-వాసంతి, జయశ్రీ, రోహిణి. మద్రాసులో జరిగిన పోటీలలో గెలుపొందడంతో రోహిణి వరుసగా మూడు సంవత్సరాలు ఛాంపియన్‌షిప్ పొంది 'హాట్రిక్' సాధించింది. వాసంతి, జయశ్రీ కూడా మాజీ ఛాంపియన్‌లు కావడం మరొక విశేషం. 'ఇలా ఒక కుటుంబంలోని ముగ్గురు సోదరీమణులూ చదరంగంలో ప్రవీణులు కావడమన్నది ప్రపంచ చదరంగ చరిత్రలోనే యిదే ప్రథమం. అందుకే మీ విషయం విన్న వెంటనే మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నాను.' అంది రోహిణితో స్త్రీల ప్రపంచ చదరంగ ఛాంపియన్ మాయాచిబుర్దానిడ్జె. ఒక అంతర్జాతీయ పోటీలో యిద్దరూ కలుసుకున్నప్పుడు.

మన దేశంలోనూ, విదేశాలలోనూ అంతటి ఖ్యాతి పొందిన ఖాదిల్కర్ సోదరీమణులకు అసలు చదరంగం నేర్చుకోవాలన్న కుతూహలం ఎలా కలిగింది?

1972 లో జరిగిన బాబీ ఫిషర్ బోరిస్ స్పాస్కీ చదరంగం పోటీ ప్రపంచం మొత్తం మీది చదరంగ ప్రియుల దృష్టిని ఆకర్షించింది. ఎక్కడ చూసినా ఒకేధ్యాస. ఎక్కడ విన్నా అదే మాట. అయితే ఏ పోటీలుగాని ముగిసి కొంత కాలం అయిందంటే మామూలుగా దానిని గురించి పట్టించుకునేవారు వుండరు. కానీ, బాబీఫిషర్ నేర్పుకి ముగ్ధులై చదరంగంలో ఎంతో ఆసక్తి కనబరుస్తున్న–తొమ్మిది, పది, పన్నెండు సంవత్సరాల ప్రాయంలో వున్న తన కుమార్తెలు రోహిణి, జయశ్రీ, వాసంతిలకు ప్రత్యేకమైన శిక్షణ ఇచ్చారు నీలకంఠ ఖాదిల్కర్!

మహారాష్ట్రకు చెందిన ఈ ముగ్గురు వనితలు రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో జరిగిన చదరంగ పోటీలలో పాల్గొని అపూర్వమైన తమ నేర్పును ప్రదర్శించి జాతీయస్థాయి చదరంగం ఛాంపియన్ మాన్యుయల్ ఆరన్, రాజా రవిశేఖర్ మొదలైన ప్రముఖుల ప్రశంసలను పొందారు.

ఇటీవల మద్రాసులో జరిగిన ఐదవ అఖిలభారత మహిళా చదరంగం పోటీలలో ఈ ముగ్గురూ ఎంతో ప్రావీణ్యం ప్రదర్శించి ప్రతి ఒక్కరి దృష్టిని ఆకర్షించారు. ఈ సంవత్సరం మాత్రమే కాకుండా-1974 వ సం॥ వాసంతి, 1976 వ సం॥ జయశ్రీ, 77, 78 సం॥రాలలోనూ '79 లో కూడా రోహిణి ఈ అఖిలభారత వనితా చదరంగం పోటీలలో గెలుపొందడం విశేషం! ఇటీవల ఇరాన్, ఇరాక్‌లలో జరిగిన అంతర్జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీలలో కూడా వీరు పాల్గొన్నారు.

ఈ విజయాలకు వెనుకవారి కృషి, పట్టుదల నిరంతర అభ్యాసం ఎంతైనా వుంది. వీరికి కావలసిన ఉత్సాహ ప్రోత్సాహాలను వారి తండ్రి అందిస్తున్నారు. ప్రతి రోజు ఉదయం, తండ్రి దగ్గర శిక్షణ, సాయంత్రం తామే స్వయంగా ఆడుతూ వుండడం వల్ల వీరికి తీరిక అంటూ వుండడం లేదు. సంవత్సరం పొడవునా దేశవిదేశాలలో ఎక్కడో ఓ చోట పోటీలు జరుగుతూ వుండడం వల్ల చదువుకు కూడా అంతరాయం కలుగుతూంది. పండుగ, పబ్బాలకు కూడా ఇంటిపట్టున వుండడానికి వీలుపడడం లేదు. పైగా వీరు పూర్తిగా శాఖాహారులు కావడం వల్ల విదేశాలలో ఆహార విషయంలో కొన్ని ఇబ్బందులకు గురికావలసి వస్తోంది!

డిటెక్టివ్ నవలలు చదవడంలో ఎంతో ఆసక్తి చూపే వీరికి సినిమాలు చూడడం అంటే సరదా!

"పిల్లులు, కుక్కలు, కుందేళ్ళు లాంటి పెంపుడు జంతువులంటే నాకు ఎంతో ఇష్టం. కాని చదరంగంలో ఎక్కువ శ్రద్ధ, సమయం చూపవలసి వస్తుంది. అంచేత ఆ ఆశను వదులుకోవలసిన నిర్బంధం ఏర్పడింది. ఇప్పుడు ఒక పిల్లిని మాత్రం పెంచుతున్నాను" అంది పద్నాలుగేళ్ళ రోహిణి నవ్వుతూ.

తమ జీవిత లక్ష్యాలను గురించి ప్రస్తావించినప్పుడు - చిరునవ్వునవ్వి ఊరుకుంది జయశ్రీ.

భారతదేశం నుంచి ఇంతవరకు స్త్రీలలో అంతర్జాతీయ స్థాయిలో 'ఇంటర్నేషనల్ మాస్టర్' గా చదరంగంలో పేరు పొందిన ఏకైక వనిత జయశ్రీ!

"మా తాతగారు 'కేసరి' పత్రిక స్థాపించి నడిపారు. మా నాన్నగారు కూడా ఒక జర్నలిస్టు. మంచి రచనలు చేసి మంచి జర్నలిస్టు కావడమే నా ఆశయం" అంది వాసంతి. మద్రాసులో జరిగిన పోటీలలో ఆమె ద్వితీయస్థానం సంపాయించింది.

"మంచి చదరంగ నిపుణురాలిగా అంతర్జాతీయ రంగంలో పేరు ప్రఖ్యాతులు సాధించడమే నా జీవిత లక్ష్యం" అంది. వరుసగా మూడు సంవత్సరాలుగా జాతీయ స్త్రీల చదరంగ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్న రోహిణి.

వారి పట్టుదల, కృషి చూస్తున్నప్పుడు వారి ఆశయాలు సిద్ధించే శుభసమయం మరెంతో దూరంలో లేదు అనిపిస్తుంది.

—కమల

# చదరంగక్రీడా ప్రవీణులు ఖాడిల్కర్ సోదరీమణులు



జయశ్రీ

రోహిణి



## మన దేవాలయాలు:

# లేపాక్షి



"కళ కళ కోసమే. రసానుభూతి కల్గించడమే కళల ఆదర్శం" అని కొందరి సిద్ధాంతం. "సమాజం కోసమే కళ; మానవాభ్యుదయమే కళల పరమార్థం" అని మరి కొందరి విశ్వాసం. అయితే ఈ రెండు కూడా పాక్షిక వాదాలే. ఈ రెండింటి సమన్వయం అంటే రసానుభూతి కల్గించి మానవాభ్యుదయానికి తోడుపడడమే భారతీయ కళా సంప్రదాయ ఆదర్శం! ఈ సత్యానికి సాక్ష్యం మన లేపాక్షి ఆలయం!

ప్రాచీన భారతదేశంలో సంగీత సాహిత్యాలకు తర్వాత వాటికి సమానమైన ప్రాచుర్యం సంపాదించిన కళలు - చిత్రం, శిల్పం. ఆధ్యాత్మికమూ, శాస్త్ర సమ్మతమూ కావడం భారతీయ కళా వైశిష్ట్యం. ఈ వైశిష్ట్యాన్ని పుణికి పుచ్చుకున్న ఆంధ్రశిల్పాలు, చిత్రాలూ భారతీయ కళా స్రవంతిలో అంతర్భాగాలు.

తెలుగునాడు సిరిసంపదలతో శాంతి సౌఖ్యాలతో కళకళలాడినపుడల్లా మహోన్నతమైన సాహిత్యంతోపాటు మనోజ్ఞమైన శిల్ప, చిత్ర కళాఖండాలు విరియ బూచాయి. కాని కాలప్రవాహంలో, మన అజాగ్రత్త వల్ల, కొందరి అసహనం వల్ల వాటిలో అధికభాగం కొట్టుకుపోయాయి. మచ్చుకు కొన్ని అక్కడక్కడ శిథిలావస్థలో కనబడుతున్నాయి. అలాంటి కళా ఖండాలలో లేపాక్షి బసవయ్య విగ్రహం ఒకటి.

అనంతపురం జిల్లా హిందూపురానికి పదిమైళ్ళు తూర్పుగా లేపాక్షి అనే గ్రామం వుంది. కొంచెం ఎత్తుగా చూడడానికి తాబేలులా వున్న 'కూర్మ శైలం' మీద వీరభద్ర ఆలయం నిర్మించబడింది. విజయనగర ప్రభువైన అచ్యుతరాయల హయాంలో పెనుగొండను పాలించిన విరూపన్న అనే సామంత రాజు పదహారవ శతాబ్దంలో దీనిని విర్మించినట్టు ఆలయ ప్రాకారాలమీది శాసనాల వల్ల తెలుస్తోంది.

ప్రధానంగా ఇది వీరభద్ర ఆలయమే. అయితే ఇక్కడ వుండే శివుని అంటే పాపనాశేశ్వర లింగాన్ని అగస్త్యముని దర్శించాడని చెబుతారు. అంతేకాదు. భారత దేశంలోని నూటఎనిమిది శివ క్షేత్రాలలో లేపాక్షి ఒకటి అంటుంది స్కాంద పురాణం. ఇక్కడి శివాలయం విష్ణు ఆలయం ఒకదాన్ని మరొకటి చూస్తున్నట్టు ఎదురెదురుగానూ, వీటికి మధ్య వీరభద్ర ఆలయం వెలియడం వల్ల మూడు గుడులూ ఒకే మంటపంలో వున్నాయి. ఇవే కాకుండా రామ, దుర్గ ఆలయాలు కూడా ఇదే ప్రాకారంలో వున్నాయి.

ఈ ఆలయ మంటపాలు అసంపూర్తిగా కనిపించినా, విజయనగరం రాజుల కాలంనాటి మంటప నిర్మాణ రీతులకు ఇవి గీటు రాళ్ళు. ఉలిమొనల కనుసన్నలలో శిలలను కదిలించి శిల్పాలుగా తీర్చిదిద్దిన మన శిల్పుల కళా కౌశల్యానికి మచ్చుతునకలు — మంటప స్తంభాల మీద నాట్యభంగిమలో చెక్కిన 'పద్మిని', మహిషాసుర మర్దిని, వాస్తు పురుషుడు మొదలైన శిల్పాలు.

దేవాలయానికి దక్షిణం వైపున ఇరవై అడుగుల ఎత్తు నాగలింగం; గుడికి ఒక ఫర్లాంగు దూరంలో-బహుశా భారత దేశంలోనే చాలా పెద్ద నందీ



విగ్రహం-సుమారు ఇరవై అడుగుల ఎత్తు ముప్పై అడుగుల పొడవు లేపాక్షి బసవన్న-చూపరులకు ఆశ్చర్య ఆనందాలు కలిగిస్తుంది.

ఆలయ ప్రాకారం మీద, గర్భగృహ గోడల మీద, పై కప్పు మీద పురాణ ఇతిహాసగాథలు కుడ్యచిత్రాలుగా అందమైన రంగులతో చిత్రింపబడి వున్నాయి. ఇవి నాటి మన తెలుగు చిత్ర కళా కారుని సామర్థ్యానికి తార్కాణంగా వున్నాయి.

నీతి సమక్షంలో అందరూ సమానులే. నీతిని కాపాడే బాధ్యత పాలకులది. వారిలో స్వ, పర భేదాలు; పక్షపాతాలు పొడసూపకూడదు. ఈ నీతిని బోధించేగాథ ధర్మపాలుని వృత్తాంతం.

నీతిని రక్షించడంలో తన వ్యక్తిగత సాయం అసించేవారు మ్రోగించడానికి అనుకూలంగా అంతః పురం ముందు గంటను వ్రేలాడ దీశాడు రాజు. ఒక రోజు-వేళకాని వేళలో గంటను మ్రోగించింది ఒక ఆవు. గంటానాదం విని రాజు వచ్చి చూశాడు. ధారలు ధారలుగా కన్నీరు కార్చుతూ దీనంగా కన బడిందా గోవు. కారణం తెలుసుకోడానికి దాని వెంట నడిచాడు రాజు. నగర పొలిమేరలలో

**[లోకజ్ఞానం : సమాధానాలు]**

1. కంపూచియా. కంబోడియానే ఖేమర్ రిపబ్లిక్ అని కూడా అంటారు. రాజధానీనగరం ఫూనమ్-పెహ్ (Phnom-Penh).
2. ఇద్దరు. శ్రీ చరణ్‌సింగ్ (ఆర్థిక మంత్రి), శ్రీ జగజీవన్‌రామ్ (రక్షణమంత్రి) ఉపప్రధాను లుగా-యిటీవల పదవీస్వీకారం చేశారు.
3. 'మాతృభూమి' ('మదర్‌లాండ్') పేరిట రష్యాలో నెలకొల్పబడిన శిలావిగ్రహం. విగ్రహం ఎత్తు 82.35 మీటర్లు లేక 270 అడుగులు. వోల్గోగ్రాడ్ పొలిమేరల్లో మమయె-కొండల మీద చెక్కబడిన శిలా విగ్రహం యిది.
4. డాక్టర్ అనిబిసెంట్. హోమ్‌రూల్ ఉద్య మాన్ని ప్రారంభించినవారిలో ఆమె ఒకరు. అడయార్ (మద్రాసు)లోని దివ్యజ్ఞాన సమా జము లేక థియోసాఫికల్ సొసైటీని కూడా ఆమే స్థాపించారు.
5. 1851లో వెయిల్ (Vail) అనే అమెరికా దేశస్థుడు విద్యుచ్ఛక్తితో నడిచే రైలు ఇంజనును కనిపెట్టాడు.
6. ఇండోనీషియా (రాజధాని : జకార్తా), రుమే నియా (రాజధాని : బుకారెస్ట్).
7. 35,000,000° సెంటిగ్రేడ్. ఒక సెకనుకి పది మిలియన్లు (అంటే కోటి) అణుకణాల ఉదజనిని ఉపయోగిస్తుంది సూర్యగ్రహం. అందువల్ల ఒక చదరపు అంగుళానికి $3\times10^{27}$ కొవ్వొత్తుల కాంతిని విరజిమ్ముతుంది.
8. కల్లినన్ వజ్రం. దీనిబరువు 3,106 మెట్రిక్ కారట్లు. అంటే 670 గ్రాములపైగా అన్న మాట. ఈ వజ్రాన్ని 1905 జనవరి 26న ప్రిటోరియా (దక్షిణ ఆఫ్రికా)లోని ప్రీమియర్ గనులలో కెప్టెన్ ఎమ్. ఎఫ్ వెల్స్ కను గొన్నాడు. అయితే ఆ వజ్రానికి మాత్రం 1902లో ఈ గని ఉనికిని కనుగొన్న మేజర్ థామస్ కల్లినన్ పేరిట నామకరణం చేయడం జరిగింది.
9. ఏడు. అవి-హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు, జైన, బౌద్ధ, జొరాస్ట్రియన్ మతాలు. వీటిలో జైన, బౌద్ధ, జొరాస్ట్రియన్ మత అనుయాయుల సంఖ్య మన దేశంలో స్వల్ప మైనా అవి కూడా ముఖ్యమైన మతాల క్రిందనే పరిగణింపబడుతున్నాయి.
10. షిలాంగ్, కొహిమా, అగర్తాల, సిమ్లా, ఇంఫాల్.



పచ్చిక మేస్తూ గంతులువేస్తూ హాయిగా తిరుగాడే లేగ చచ్చిపడివుంది. ఈ దయనీయస్థితికి కారణం ఏమని విచారిస్తే, రాకుమారుడు విహారం వెడు తున్నప్పుడు రథచక్రాలు దూడ మీద ఎక్కడంతో అది ప్రాణాలు పోగొట్టుకుంది అని తెలిసింది. తన కుమారుడు నడిపిన అదే రథానికి ఆ ఆవును పూన్చి కుమారుని మీద రథం నడిపాడు రాజు! రాకుమారుడు మరణించాడు. రాజుగారి ధర్మ నిరతికి, నిష్పక్షపాత బుద్ధికి సంతసించిన ధర్మదేవత ప్రత్యక్షమై రాజును ఆశీర్వదించి-లేగను, రాకుమా రుని బ్రతికించిందట! ఇదీ ధర్మపాలుని కథ. ఇందులోని సత్యా సత్యాలు ఎలా వున్నప్పటికీ పాలకులు పాలితులకు ఆదర్శంగా వుండాలి అన్న మన పెద్దల అభిప్రాయం మనకు అర్థమవుతుంది. అందుకే "నా విష్ణుః పృథివీపతిః" అన్నారు.

మనిషికి నీతితోపాటు భక్తి కూడా కావాలని మన పెద్దలు ఆశించారు. ఈ భక్తి అనన్యభక్తిగా వుంటే మరీ మంచిది. దీనిని వివరించేదే—అతిథి పూజకు, శివభక్తి కోసం కన్న కొడుకును కూడా పోగొట్టుకోడానికి సిద్ధపడిన సిరియాళుని కథ!

పాశుపతంకోసం ఇంద్రకీలాద్రి పర్వతం మీద తపస్సుచేసే విజయుని నీతిని, శక్తిసామర్థ్యాలను పరీక్షించడానికి కిరాత వేషంలో శివుడు పోరాడిన కథనం కిరాతార్జునీయం!

ధర్మనిరతి, ఆత్మ విశ్వాసం, కృషి, పట్టుదల వుంటే సాధించలేనిది అంటూ వుండదు. వీటికి దైవభక్తి కూడా తోడైతే విధివ్రాతనే త్రిప్పివ్రాయ వచ్చు-ఈ సత్యం నిరూపించడానికి మార్కండేయ పురాణం చక్కని ఉదాహరణ!

ఇలా మన పూర్వులు శ్రేయస్కరం అని భావించిన భావాలనే వివరిస్తూ పురాణేతిహాస గాథలను-శిల్పాలుగా చిత్రాలుగా మార్చి కనులకు పండుగ, మనసుకు ఆహ్లాదం, బుద్ధికి వికాసం కల్గించే ఆలయం మన లేపాక్షి దేవాలయం!

**[ఈ వ్యాస రచనకు కొంత సమాచారం, ఛాయా చిత్రాలు పంపిన శ్రీమతి సి. వాణిగారికి కృతజ్ఞతలు —వ. సం.]**

ఉగాది కథల పోటీలో
మొదటి బహుమతి
రూ. **500** పొందిన కథ

# దావాగ్ని చెప్పిన సత్యం

తెనాలి
సుశీలాదేవి

ఒంటరిగా .... గదిలో ...
జీరోవాల్టు నీలం బల్బు
వెలుతురులో మంచం
మీద పడుకుని వున్న నేను
అసహనంగా అటూ ఇటూ
కదిలాను.
నాకు కావలసిన
అడుగుల చప్పుడు కోసం
నా చెవులు
రిక్కించుకునే వున్నాయి.



'చుక్క' లోపలికి పడిన నేను ఆగలేకపోతున్నాను. 'రేచుక్క' కోసం వెళ్ళిన మిత్రుడు యింకా రాలేదు మరి. ఎవరో యివాళ కొత్తసరుకు అన్నాడు. నాకు కొత్తనో .... మరి సరుకే కొత్తదో! .... వాడు పట్టుకు వచ్చేసరికి నా నిషా పెరిగి నిద్దర కొట్టేస్తానో లేక యీ కిక్కు కాస్తా తగ్గిపోయి ....

చెప్పుల చప్పుడు వినిపించింది, చటుక్కున లేచి కూర్చున్నాను. 'ఉహూ' ఆ చప్పుడు అలా.... అలా....దూరంగా సాగిపోయింది. ఎవరో దారిన పోయే దానయ్యలు. నా ఒంట్లో నరాలన్నీ జివ్వున లాగుతున్నట్టుగా వున్నాయి. వురకలు వేస్తూ పొంగుతున్నాయి. వాటికి వుద్రేకం కావాలి, వుత్సాహం కావాలి. అనుభవం కావాలి, ఆనందం కావాలి. వుపశమనం కావాలి 'అబ్బా' యింకా ఎంతసేపు....

'ఈ అవస్థ ఎందుకు? హాయిగా ఫ్యామిలీ తెచ్చుకో కూడదూ' అంతరాత్మగాడు చటాలున దెబ్బతీశాడు.

"నువ్ నోరుముయ్యవోయ్. రోజంతటికీ కొన్ని క్షణాలు మాత్రమే పొందే హాయి కోసం ఆ బాదర బందీలన్నీ ఎవడు నెత్తిన పెట్టుకుంటాడు? తెల్లారి లేస్తే సణుగుళ్ళు, దేబిరింపులు, ఎత్తిపొడుపులు, ఏడుపులు, పిల్లలు, రోగాలు ఛా....ఛా....వీటన్నిటితో మనసు పాడయిపోయి అసలు కోరికే చచ్చిపోదూ, ఇదే హాయిగా వుంది."

ఏ పదిహేను, యిరవై రోజులకు ఓసారి యింటి వెళ్ళటం, ఓ రోజుండి వచ్చేయటం జీతంలో సగం యింటికి యిచ్చేస్తే మిగతా సగం తనొక్కడికీ....యింకా పైన ఆదాయం అంటూ ఏదయినా వస్తే అది....హాయిగా, జల్సాగా, తన యిష్టం వచ్చినట్టు ఆనందం కొనుక్కోవచ్చు.

అసలు యీ మధ్య ఎప్పుడో ఓసారయినా యింటికి వెళ్ళాలంటేనే భయంగా వుంది. తనిచ్చే డబ్బులు చాలటం లేదట. ఇంటి నిండా దరిద్రం. యిల్లాలి ముఖంలో దరిద్రం, పిల్లల రూపాల్లో దరిద్రం. వచ్చిన ఒక్కరోజయినా, ఉన్న ఒక్క రాత్రయినా సంతోషం పంచుదామని, సుఖం దక్కించుకుందామని బుద్ధిలేదు కదా దానికి. మీద చెయ్యి వేసేసరికి ప్రారంభం చేసేస్తుంది. చేసిన అప్పులు, తన అనారోగ్యం, పిల్లల అవసరాలు, రోగాలు, మందులు, చివరగా ఏడుపు—అంతే.... యింక చెయ్యివేస్తే ఒట్టు. తెల్లవారగానే ప్రయాణం ఇక్కడే....యిదే....యిలాగే....హాయిగా....ఆనందంగా వుంది....

సాలెగూడులా అల్లుకుంటున్న ఆలోచనల దారం పుటుక్కున తెగిపోయింది. తలుపు మీద 'టక్ టక్' చప్పుడు.

'స్ప్రింగ్'లా మంచంమీంచి లేచాను. మరుక్షణంలో నా చేతులు తలుపులు తెరిచాయి. మా వాడు లోపలికి వచ్చాడు. ఆతృతగా వాడి వెనక్కు చూశాను. నాకు కావలసింది ఏదీ (ఎవరూ) కనిపించలేదు. కోపంగా వాడి ముఖంలోకి చూశాను. నా చేయి పట్టుకుని బరబరా మంచం దగ్గరకు లాక్కొని వచ్చాడు. విసురుగా పట్టు విడిపించుకున్నాను.

"కళ్లు కాయలు కాచేలా ఎదురు చూస్తుంటే యిప్పుడు ఒక్కడివీ చేతులూపుకుంటూ వచ్చి నన్ను డిసప్పాయింట్ చేస్తావురా బ్రూట్. నీవేదో పెద్ద తెలిసిన వాడిలాగా 'తీసుకొస్తాను' అంటే సరేననుకున్నానుగానీ యిలాంటి చవటవని తెలిస్తే నేనే చూసుకుందును ఎక్కడయినా...."

యింకేం మాట్లాడకుండా తన అరచేతిని నా నోటి మీద మూశాడు వాడు. 'ఒరేయ్ కాస్త మెల్లిగా మాట్లాడరా బాబూ, నీకు కావలసింది తెచ్చాను కానీ'....

"ఏదీ....ఎక్కడా?" అడుగుముందుకు వేసిన నన్ను చేయిపట్టుకుని లాగాడు. "కాస్త తగ్గుభాయ్. బయటే వరండాలో వుంది. చూడు నీకోమాట చెప్పాలి. ఫ్యామిలీటైప్ మరీ చీప్‌గా ప్రవర్తించకు."

"ఏమిటోయ్ పెద్ద వీళ్ళ దగ్గిర కూడా డీసెన్సీ పాటించాలా? డబ్బు పారేస్తాం మన యిష్ట మొచ్చినట్టు...."

"అదే వద్దన్నాను, అంత చీప్ క్వాలిటీ కాదు. అదయినా యీ మధ్యనే. యింకా పాతబడలేదు. పొద్దున్నే పంపించేటప్పుడు మరీ ఐదో, పదో చేతిలో పెట్టేవు సుమా. కనీసం ముప్పయ్ అయినా..."

తెరిచిన నోరు చప్పున మూసేసుకున్నాను గదిలోకి ప్రవేశించిన ఆవిడని చూసి. తలమీదుగా సగం ముఖం కప్పేస్తూ కొంగు కప్పుకుని వుంది.

'ఓ. కె. వుదయమే కలుసుకుందాం.' చకచకా వెళ్ళిపోయాడు మిత్రుడు. వాడి వెనకాతలే వెళ్ళి తలుపులు గడియపెట్టి వచ్చాను. పైట తలమీద కప్పుకుని అటువేపు తిరిగి నిలబడ్డ ఆమెని చూసి నవ్వొచ్చింది నాకు, 'ఓయబ్బా! శోభనపు పెళ్ళికూతురిలా ఏం సిగ్గుపడుతూ నుంచుంది.'

"ముఖం ఎలావుందోగానీ వెనకనుంచి చూస్తుంటే ఒళ్ళు బాగానే వున్నట్టుంది" నా దృష్టితో నేను బేరీజు వేశాను.

"పెళ్ళికూతురిలా నిలబడ్డావేం? రా"

తలమీదున్న పైటకొంగు అందుకుని లాగాను. చివ్వున వెనక్కి తిరిగింది. ఇప్పుడా పైట నా చేతిలో వుంది. నా చూపులు కొన్ని క్షణాలు ఆ ఎత్తు గుండెల మధ్య చిక్కుకుపోయాయి. బలవంతంగా చూపులు పైకి జరిపాను. మెడ మీదుగా పెదవుల మీదుగా కళ్ళల్లోకి....

మరుక్షణం నా చేతిలోంచి ఆ పైటకొంగు జారిపోయింది.

"నీవు...నీవు...నిన్ను...నిన్ను...ఎక్కడో..."

"మిమ్మల్ని చూడ్డం మాత్రం యిదే మొదటిసారి" తుంచినట్టుగా అంది.

లేదు లేదు....కాదు ఎక్కడో చూశాను. సందేహంలేదు. నాకు బాగా గుర్తుంది ఆ ముఖం. అయితే ఎప్పుడు....ఎక్కడ నా మస్తిష్కంలోని ఆలోచనలు తీవ్రతకు నా శరీరం తన పని మరిచిపోయింది. జ్ఞాపకాల సరంలో పూసలు చక్కగా కుదరడంలేదు.

"నీ పేరు"

'శాంత' అసహనంగా అంది.

ఈ పేరుతో యిప్పటిదాకా నాకెవరూ తగల్లేదు మరి....

ఫ్యామిలీ టైప్ అన్నాడు నా మిత్రుడు. "మరి మీ ఆయన పేరు?"

"మనిద్దరి మధ్య జరిగే వ్యాపారానికి మా వారి పేరు అవసరమా" నెమ్మదిగా అంటున్నా యీ సంభాషణపట్ల అయిష్టత కనబడుతోంది.

"కాదనకు. కాని నిన్ను ఎక్కడో బాగా చూసినట్టుగా అనిపిస్తోంది. అందుకని...."

"రైల్వేలో పని చేస్తారు" మెల్లిగా అంది.

పేరు చెప్పలేదు. ఫలాన వుద్యోగం అనీ చెప్పలేదు. అయినా నా మెదడులో మెరుపులా మెరిసింది ఆమె జ్ఞాపకం.

అవి నేను రిలీవింగ్ క్లర్కుగా పనిచేసే రోజులు. దక్షిణరైల్వేలో ఒక పెద్ద స్టేషన్‌కు వేశారు. ఆవేళే డ్యూటీకి వెళ్ళాను. ప్యాసింజరు ట్రెయిన్లన్నీ వెళ్ళిపోయాయి. ఫ్లాట్‌ఫారం మీది కొచ్చి నిలబడ్డాను సిగరెట్ త్రాగుతూ. పెద్ద గూడ్సు ట్రెయిన్ ఒకటి ఫ్లాట్‌ఫారం మీద ఆగి వుంది. అక్కడే షిఫ్టు మారుతుంది. ఒక డ్రయివర్ వచ్చి యింజన్‌లో ఎక్కి కూచున్నాడు. యిక బయలుదేరడమే తరువాయి. 'ఇదిగో... ఏమయ్యోవ్ ఆగు కాస్త' కేక వేసుకుంటూ చెమటలు కక్కుకుంటూ పరుగెడుతూ వస్తోంది ఒక ఆడది చంకలో పిల్లాడితో. అందరూ ఆమెకేసే కుతూహలంగా చూస్తున్నారు. ఆమె మాత్రం ఎవరినీ పట్టించుకోటంలేదు. నలుగురూ తనను

గమనిస్తున్నారని కూడా గుర్తిస్తున్నట్టు కనబడ లేదు. ఒక్క వుదుటున యింజను దగ్గరికి వచ్చింది. పిల్లాడిని ప్లాట్ ఫారం మీద కుదేసింది. యింజన్లోకి ఎక్కింది. అందరూ అక్కడ పోగయి పోయి ప్రేక్షకుల్లా నిలబడిపోయారు.

"దిగు ముందు కిందికి దిగు. ఆ జీతం డబ్బులు నా మొహాన పారేసి ఎటన్నా పో" వగురుస్తూ అంది.

"ఛీ పో! సిగ్గులేని దానా! స్టేషన్కొచ్చి ప్లాట్ ఫారంలో నిలేస్తావేం? రేపు పొద్దున్న యింటికి వచ్చేస్తాను. దిగి పో ముందు" ఆమెని పట్టుకుని దింపబోయాడు అతను.

"పొద్దున కొస్తావులే చేతులూపుకుంటూ. అదేం కాదు. ముందు జీతం యిచ్చేసి మరీ కదులు" ఆవిడ దిగలేదు; అతడిని విడువలేదు.

ఏడుస్తోంది. బ్రతిమాలుతోంది. గుంజుతోంది. జేబులో చేయి పెట్టబోతుంది. విదిలించి పారేస్తు న్నాడు అతను. ఎవరో జోక్యం చేసుకుని వదిలించ బోయేలోగా అతను ఆమెని క్రిందికి నెట్టడం ఆమె అతడిని వదలకుండా అతడి షర్టు కాలరు పట్టుకో డంతో అతనూ ప్లాట్ ఫారం మీదకు వచ్చేయడం జరిగింది. ఆవిడ జుట్టు పట్టుకుని చెంపకేసి ఒక్క చరుపు చరిచాడు. గుడ్లనీళ్ళు కుక్కుకుంటోంది.

"ఆ డబ్బులు నాకు యిచ్చేసి నువ్వెట్లన్నా చావు నాలుగు రోజుల్నుంచి పిల్లలు పస్తున్నారు. చంటోడు జ్వరంతో చచ్చిపోతున్నాడు. యిచ్చేయి యిచ్చేయి" పులిలా మీదపడి జేబులో చేయి పెట్టపోయింది. ఒక్క విదిలింపు విదిలించాడు కిందపడిపోయిం దామె.

"చెపితే నీక్కాదూ జీతంరానూ వచ్చింది. అయిపోనూ అయిపోయింది. అప్పులకు యిచ్చేసినా పో!" అంటూ ఒక్క విసురున బండి ఎక్కేశాడు. అప్పటికే గార్డు పచ్చజెండా వూపటం, బండి కదిలిపోడం జరిగిపోయింది.

నాకు ఆశ్చర్యంగా వుంది. ఏడెనిమిది వందల జీతగాడు యిట్లా వీధినబడి ఛీ....ఛీ అనుకుంటూ ఆమెకేసి చూశాను. 'ఒక్క పది రూపాయలన్నా యీరా పిల్లలు తిండికోసం చూస్తున్నార్రా. చంటిపిల్లోడు చచ్చిపోతాడురా' అంటూ యింజను వెంబడే ప్లాట్ఫారం చివరి అంచుదాకా పరుగు తీస్తోంది. ఆమె మాటలు యింజను శబ్దంలో కలిసిపోయాయి. బండి గాలిని చీల్చుకుంటూ వెళ్ళిపోయింది. టిక్కెట్టు లేని సినిమా అయిపోగానే ప్రేక్షకులంతా తమ దారిన వెళ్ళి పోయారు. నిరాశ, నిస్పృహలతో, అవమానంతో, దుఃఖ భారంతో ఆ పసిబిడ్డను భుజాన వేసుకుని నడుస్తున్న శవంలా కదిలిపోయింది ఆమె. దైన్యం నిండిన ఆ ముఖం, వడలిపోయిన ఆ రూపం, భర్తను కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమాలుకునే ఆమె నిస్సహాయత నాలుగైదు రోజుల పాటు నన్ను వెంటాడుతూనే వుండిపోయాయి. తరువాత ఆ విషయం మరుగున పడిపోయింది.

ఇప్పుడు తిరిగి అదే—ముఖం....

అప్పుడు శవంలా ఎండిపోయిన మనిషి యిప్పుడు పెళ్ళికూతుర్లా తయారయింది. మొదళ్ళు త్రుంచేస్తే ప్రక్కనే కొమ్మలు రెమ్మలు విరివిగా పెరిగిన గుబురు చెట్టులా నిండుగా వుంది. ఆ కళ్ళు మాత్రం గాజు కళ్ళలా నిర్జీవంగా వున్నాయి. అప్పుడు వాటిలో నిండివున్న నీళ్ళు; యిప్పుడవి ఎండిన చెరువులు.

"వీలయినంత త్వరగా నన్ను పంపించివేస్తే బావుంటుంది" ఆమె అసహనంగా మంచంవేపు కదలటంతో యీ లోకంలోకి వచ్చాను.

"నీ భర్త డ్రైవరు కదూ."

ఆమె మాట్లాడలేదు. అయినా నాకెందు కిదంతా నా పని నేను చూసుకోక అనిపించింది క్షణంసేపు. కాని ఏదో క్యూరియాసిటీ.

"చూడు నీ భర్త రైల్వేలో డ్రైవరు. ఆ స్టేషన్లో వుండేవాళ్లు కదూ. ఒక రోజు ప్లాట్ ఫారం మీద అతనితో డబ్బుకోసం గొడవ పడి, జ్వరం పడిన పిల్లాడిని ఎత్తుకుని ఏడుస్తూ కదిలి వెళ్ళిపోయావు అవునా? తరువాతేం జరిగింది?"

నా ప్రశ్నకు సమాధానంగా అన్నట్టు ఆమె మంచం మీద కూలబడి వెక్కి వెక్కి ఏడవ సాగింది. నా గుండెల్లో ఏదో కదిలిక.

"ఒక వుద్యోగస్థుడి భార్యగా వుండి నీవు యీ వ్యాపారం చేయటం అవమానంగా,అసహ్యంగా లేదూ?" అన్నాను. నేను మర్యాదస్థుడినా గిల్టీగా అనిపించింది నాకే. 'నేను మగవాడిని' అహం నన్ను వెన్నుతట్టి సపోర్టు చేసింది.

"అవమానాలు, అసహ్యాలు నా జీవితం నుంచి తప్పుకుని చాలా రోజులయింది. అయినా అవన్నీ మీకెందుకు? మాటలతోనే తెల్లారిపోతుంది. కాని నాకు డబ్బు చాలా అవసరం."

అనవసరంగా కాలయాపన చేస్తున్నాననే నింద వినిపించింది. ఆమెలో తొందర చేస్తున్నది నరాల తీపుకాదు. కడుపుతీపి. కాని....కాని.... నా శరీరం నాకు సహకరించటం లేదు. ఆమెతో అనుభవం కోసం పురకలు వేయటం లేదు. ఎందుకని....ఎందుకని .. ఆనాటి ఆమె దీనవదనం, నిస్సహాయస్థితి మాత్రమే గుర్తు వస్తోంది. ఆమెను తాకాలని కూడా కోరిక పుట్టటం లేదు.

"నీకు అనుకున్నట్టుగా డబ్బు యిస్తాను. నీ నుండి నాకేం అనుభవం వద్దు. కాని ఆ రోజు తరువాత ఏం జరిగింది? చెప్పగలవా?" నాకు తెలియ కుండానే నాలో ఏదో ఆత్మీయత. ఎలాంటి వాడి కయినా ఒక్కో సమయంలో ఒక్కో మనిషిని చూస్తే హృదయం స్పందిస్తుందేమో.

ఆమె చెబుతోంది. ఏదో కథ చెబుతున్నట్టు లేదు. ఆమె గుండెల్లో కరుడు గట్టుకుపోయిన బాధ కరుగుతోంది. కరిగి కరిగి ప్రహిస్తోంది.

"నేనూ పెళ్ళికూతురిగా అందరి ఆడపిల్లల్లాగే ఎన్నో ఆశలతో కాపరానికి వచ్చాను. మొదట్లో బాగానే వుండేవాడు. ఆ తరువాత చాలా రోజులకి తెలిసింది—త్రాగుడు, పేకాట అంటు రోగాల్లా జీర్ణించుకుని వున్నాయని. ఎంతగానో నచ్చచెప్పి, బ్రతిమాలినా, బెదిరించినా లాభం లేకపోయింది.

'నీకేం యిబ్బంది లేదుకదా' అనేవాడు. నిజమే మొదట్లో యిబ్బందులు తెలిసేవికావు. ఒక్కొక్కరే మీద మీద నలుగురు పిల్లలు పుట్టేసరికి వాళ్ళకు పాలు, తిండ్లు, రోగాలు, మందులు, డబ్బు అవశ్య కతను తెలియజేశాయి. నా ఆరోగ్యమూ బాగా పాడయిపోయింది. అప్పటికే ఆయనకి ఆ వ్యస నాలు బాగా వంటబట్టిపోయి యిల్లూ, పిల్లలూ కనబడకుండా పోయాయి. యింట్లో యిచ్చే డబ్బు యేమూలకీ చాలటం లేదు. అంతకి రెట్టింపు తన ఒక్కడి సరదాలకి ఖర్చుచేసేవాడు. కొన్నాళ్ళ తరువాత తెలిసింది తను వెళ్ళే రూట్లో ఎక్కడో యిద్దరు స్త్రీలని పెట్టుకుని మేపుతున్నాడని. తన అవసరాలు ఎక్కువయ్యే కొద్దీ యింట్లో యిచ్చే డబ్బు చాలా తగ్గించేశాడు. ఎంత డబ్బూ చాలక పోయేసరికి అక్కడక్కడా బ్రాందీ షాపుల్లో, సిగరెట్ బంకుల్లో పేకాట స్నేహితుల దగ్గరా అప్పులు పెరిగాయి. జీతంలో సగం అప్పులకి పోను మిగత తన ఖర్చుకే. అలాంటప్పుడు డ్యూటీ నుండి తిరిగి వచ్చినా యింటికి రాకుండానే మళ్ళీ బండీ ఎక్కేసేవాడు. ఎన్నాళ్ళు మందులు, సరుకులు? ఎవరుమాత్రం అప్పుగా యిస్తారు? ఏ యిరుగు పొరుగయినా ఎన్నాళ్లు మన అవసరాలు

తీరుస్తారు? నేను చేసిన అప్పులకి అప్పులవాళ్ళు యింటికే వచ్చారు. ఇంట్లోని ఒక్కోవస్తువూ కాళ్ళొచ్చినట్టు నడిచిపోయాయి. వీధిలోకి వెళ్ళి ఎవరి ముఖమయినా చూడాలంటే భయంగా వుండేది. అవమానంగా వుండేది.

మా పరిస్థితి కారణంగా అందరికీ చులకన అయిపోయాము. ఒకసారి ఎందుకో మావారు వస్తారేమో నన్నట్టు వీధి తలుపు ఆనుకుని నుంచుని వున్నాను. మా ఎదురు క్వార్టర్సులో వుండే ఒకతను రమ్మన్నట్టు తలవూపడం చూచి చట్టున తలుపు మూసి లోపలికి వచ్చేశాను. పెళ్ళాం కాన్పుకి వెళ్ళింది. నా స్థితి వాడికి అనువుగా కనిపించింది. ఆ వేళ ఎందుకో కుమిలి కుమిలి ఏడ్చాను.

ఎంత హీనం కాకుంటే, ఎంత లోకువ కాకుంటే సాటి ఉద్యోగస్థుడి భార్యను పిలువగలుగుతాడు! డబ్బు లేనంత మాత్రాన, దరిద్రం చుట్టుకుంటున్న మాత్రాన అంత చవుకా? అప్పుడప్పుడు యధాలాపంగా కంటపడినా వెకిలిచేష్టలు, సైగలు చేసేవాడు.

నెమ్మదిగా చంటిపిల్లల్ని దగ్గరతీసి బిస్కట్లు, పిప్పరమెంట్లు పెట్టేవాడు. ముందే తిండికి ముఖం వాచి వున్న యీ పిల్లలు అస్తమానం వెళ్ళేవాళ్ళు. ఎంత మందలించినా నా కన్ను గప్పి ఎప్పుడో జారుకునేవారు.

ఓసారి బాబు వచ్చి చెప్పాడు.

"అమ్మా......అమ్మా......ఆయన దగ్గరేమో యింత డబ్బుంది. చూపించాడు. మాకు లేదే అన్నాను. మీ అమ్మను రమ్మను ఇస్తాను అన్నాడు. వెళ్ళవే.... బోలెడు డబ్బులిస్తాట్ట. ఎంచక్కా గిన్నె నిండా అన్నం, పులుసూ, చేసుకుని....కంచం నిండా పెట్టుకుని...."

మాటలు పూర్తిచేయక ముందే పడిన నా దెబ్బకి గింగిరాలు తిరిగి క్రిందపడిపోయాడు. ముందే బలహీనంగా వున్నాడేమో....నా చేతి దెబ్బ ఎలా తగిలిందో మరి స్పృహపోయింది. నా గుండెలు అలిసిపోయాయి. నీళ్ళుచల్లి వాడిని ఒడిలోకి తీసుకున్నాను. నేనెంత పాపిష్టిదాన్ని? యీ దరిద్రుల కడుపున పుట్టడమే వాళ్ళు చేసిన నేరమా? వాడడిగినదాంట్లో తప్పొప్పులు తెలుసుకునే వయసు వాడికుందా. ఆ ఎదురింటి వెధవ ఏదో కూసి వీడితో చెప్పి పంపితే వీడికర్థం అయ్యేదంతా అప్పనంగా డబ్బు వస్తుందని మాత్రమే. వాడు చెప్పి పంపిన దాంట్లో ఎంత అర్థం వుందో,



ఈ కథ – 'దావాగ్ని చెప్పిన సత్యం' రాసిన శ్రీమతి తెనాలి సుశీలాదేవి-భర్త ఉద్యోగరీత్యా ధర్మవరంలో వుంటున్నారు. శ్రీమతి సుశీలాదేవి ఎక్కువగా కథలు రాయకపోయినా, రాసిన కథలు వారపత్రికల్లో వచ్చాయి. 'వనిత'లో తన కథ రావడం ఇదే మొదటిసారనీ, తనకు బహుమతి రావడం కూడా ఇదే మొదటిసారనీ, చెప్పారామె. "మనలోనూ మన చుట్టూ వున్న వాస్తవిక జీవితాల్లోనూ వున్న చేదునిజాల్ని గ్రహిస్తూ మనల్ని మనం సరిదిద్దుకునే రచనలు చెయ్యాలని నా ఆశయం" అనే సుశీలాదేవి – తన రచనలకు తొలి పాఠకులు, విమర్శకులూ తన భర్త శేషగిరిరావుగారే – అని చెప్పారు. ఈ దంపతులకు ఇద్దరు అబ్బాయిలు సంతానం.

అంత డబ్బు ఎందుకు ఇస్తానన్నాడో ఆలోచించేంత తెలివి, అనుభవం ఈ పసివాడికున్నాయా? వాడికి కావలిసిందంతా, వాడు కోరిందంతా ఏమిటి - బట్టలడిగాడా, సినిమాలు అడిగాడా....అన్నం....పులుసు గిన్నెనిండా వండుకుని కంచం నిండా పెట్టుకుని.... ఎంత చిన్న కోరిక! కంచం నిండా అన్నం పులుసూ కంటి కింపుగా పెట్టుకుని, కడుపునిండా తిని ఎన్ని రోజులయిందో. అలాంటి రోజు కోసం ఆశ.... కడుపునిండా అన్నం కోసం తృప్తిగా తినేలా గిన్నెడు పులుసుకోసం .... ఎంత నికృష్టమయిపోయింది నా బ్రతుకు. ఈ పసివాళ్ళ కడుపులు సగం మాడుస్తూ ఇంకా వాళ్ళని కొట్టడం కూడానా? నాలోనేనే కుళ్ళికుళ్ళి ఏడ్చాను.

ఆ రోజు నుండి ఎవరూ గడపదాటి వెళ్ళరాదని కఠినంగా చెప్పాను. బిస్కెట్ల కోసం, పిప్పరిమెంట్ల కోసం అలవాటు పడిన చంటివాడి మారాం మాత్రం దెబ్బలు పడేకొద్దీ ఎక్కువయ్యేది.

ఈయన ఇంటికి వచ్చిన రోజు కొంచెం ఆశ కలిగేది. ఏమైనా ఇవ్వకపోతారా అని బిచ్చక త్తెకు పారేసినట్లు నాలుగు డబ్బులు పడేసి వెళ్ళిపోయేవారు. ఇంటి పరిస్థితి చెప్పబోతేచాలు. నిద్ర నటించేవాళ్ళు. పగలయితే చెప్పుల్లో కాళ్లు దూర్చి వెళ్ళేవాళ్ళు. ఆయనున్న రోజు మాత్రం అందరం భోంచేసేవాళ్లం. తరువాత మళ్ళీ మామూలే. వారం పదిరోజులయినా ఇంటికి వచ్చేవారు కాదు. వచ్చినప్పుడేమయినా గొడవ చేస్తే ఆ మాత్రమూ రారేమోనని భయం వేసేది.

ఎనిమిదివందల రూపాయల వుద్యోగస్థుడి కుటుంబం బిచ్చగాళ్ళ కన్న నికృష్టదశలోకి వచ్చేసింది. పిల్లల కడుపులు నింపలేక, వాళ్ళ ఆకలి ముఖాలు చూడలేక గుండెలు బద్దలయ్యేలా ఏడిచేదాన్ని. నకనకలాడే కడుపులతో వాళ్ళు నిద్రపట్టించుకోలేక పొర్లాడుతుంటే నా గుండె తరుక్కుపోయేది.

చివరికి ఒకనాడు....ఆనాడే మీరు నన్ను చూశానంటున్నారు. చంటివాడు జ్వరంతో మూడు రోజులుగా బాధ పడుతున్నాడు. వాడికి మందులేదు; మాకులేదు. ఆస్పత్రి రంగునీళ్ళు పని చేయలేదు. ప్రయివేటు డాక్టరు దగ్గరకు వెడితే మందులయితే వ్రాసి యిచ్చాడు. కానీ నా దగ్గర కొనడానికి డబ్బేది? పిల్లాడి పరిస్థితి భయంగా వుంది. ముందు రోజు రాత్రి ఇంటికి వచ్చారు. ఇంటి పరిస్థితి, పిల్లాడి పరిస్థితి ఎంతో దీనాతిదీనంగా చెప్పాను. 'ఉదయం జీతాలు వస్తాయేమో చూద్దాంలే' అన్నారు. ఆ మాటతో నాకు ఎంతో బలం వచ్చింది.

ఆ ఉదయం బయలుదేరి వెడుతూంటే మళ్ళీ మళ్ళీ చెప్పాను. జీతం వస్తే వెంటనే ముందు యింటికి రమ్మని, పిల్లాడి పరిస్థితి చాలా ఆందోళనగా వుందనీ, ఒకవేళ యిప్పుడే జీతం అందకపోతే ఎక్కడయినా ఓ పది రూపాయిలు బదులు తెమ్మని. ఆ మధ్యాహ్నం మూడు గంటలవరకూ చూశాను. మనిషి అయిపులేడు. నాలో ఏ మూలో ఆశ....వెనువెంట దాన్ని చంపుతూ అనుమానం. ఒక వందసార్లయినా వీధి గుమ్మంలోకి వెళ్ళి సందు మలుపు దాకా చూశాను. కొంచెంసేపు అలాగే నిలబడ్డాను. నాకు తెలిసిన ఒకబ్బాయి వస్తూ కనిపించాడు.

"స్టేషన్‌లో సార్ గాని కనిపించారా" అడిగాను.

"చూశానండీ. ఇంతకు ముందే అందరూ అక్కడ జీతాలు తీసుకున్నారు. ఇప్పుడు బయలు దేరుతున్న బండికి వెడుతున్నారు గదండీ—"

అన్నాడు. నా నెత్తిన పిడుగు పడినట్టు, నా ఒళ్లు దహించుకుపోతున్నట్టు అనిపించింది. నాలో ఏదో పిచ్చి ఆవేశం. ఏం చేస్తున్నానో నాకే తెలియలేదు. జ్వరం వచ్చిన పసివాడిని చంకన వేసుకుని పట్టాలు దాటుకుంటూ, పరుగుతీస్తూ, పడుతూ లేస్తూ ప్లాట్ ఫారం చేరుకునేసరికే ఆయన ఇంజన్‌లోకి ఎక్కేశారు. తరువాత జరిగింది మీరు చూశారు. బండీ పట్టాల మీద కాదు నా గుండెల మీది నుంచే పోయింది. 'వాడు నాకు మొగుడుకాదు ఈ పిల్లలకు తండ్రీ కాదు' అనుకున్నాను ఆ క్షణమే.

చావు ముఖంలో వున్న పిల్లవాడిని దక్కించుకోవాలని ఎక్కడెక్కడో ఎంతో ప్రయత్నం చేశాను. బిడ్డ పరిస్థితి ప్రమాదంగా వుందనీ మందులు యిస్తే తప్పకుండా డబ్బు త్వరగా యిచ్చేస్తానని మందుల స్టోరులో అడుక్కుని లేదనిపించుకున్నాను. కట్టుకున్న వాడికే లేని కనికరం ఎదుటి పరాయివాళ్ళకు వుంటుందనుకోటం నా తెలివి తక్కువ.

కాళ్ళూ చేతులు ఆడని ఆ పరిస్థితిలో అపస్మారకంలో వున్న పసివాడిని భుజాల మీద వేసుకుని అటూ ఇటూ తిరుగుతూ వున్నాను యింట్లో. గుమ్మం దగ్గరగా వచ్చిన నేను ఎదురింటి వేపు చూశాను. ఆ యింటి గది కిటికీలో అతను—ముఖ్యంగా అతని చేతిలో రెపరెపలాడుతున్న నోట్లు, నేనున్న పరిస్థితిలో దిక్కుతెలియని ఆ కారు చీకటిలో ఆ కాంతికిరణ మొక్కటే కనిపిస్తోంది. అది నన్ను కాలుస్తుంది. నాకు తెలుసు. అయినా సరే నా పిల్లలకు వెలుగునిస్తుంది. నా గుండె రాయి చేసుకున్నాను. నా ఒళ్ళు మొద్దుబారిపోయింది. పసివాడిని చాప మీద పడుకోబెట్టి, తలుపులు దగ్గరగా మూసి తడబడుతూ అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి ఆ గుమ్మం ముందు నిలుచున్న నా మనసులో ఒకే ఒక్క ఆలోచన 'బాబును బ్రతికించుకోవాలి.'

వాడి ఒంట్లో వేడిని చల్లార్చి నా గుండెల్లో మంటలు రగిలించుకున్నందుకు ప్రతిఫలంగా ముట్టిన నోట్లను గుప్పిట్లో కుక్కుకుని అప్పటికప్పుడు మందుల షాపుకు వెళ్ళి మందులు తెచ్చాను. కాని .... కాని ఏం జరిగింది? ఇంకే మాత్రం ఆలశ్యం భరించలేనన్నట్లు బాబు హాయిగా నిద్రపోతున్నాడు. చల్లగా శాంతిగా విశ్రాంతిగా.... నిద్రపోతున్నట్టున్న పసివాడిని ఒళ్లోకి తీసుకున్నాను. నా గుండె కాలిపోతోంది. నా కడుపులో పేగులు తిప్పుతున్నట్లుగా, నాలో ఒకే ఒక్క ఆలోచన నా మనసుని కోసేస్తుంది యిప్పటికీ. చివరి క్షణాన 'అమ్మ' కోసం వాడి కళ్ళు ఆశగా చుట్టూ చూసివుంటాయా' ఆ మాట తలుచుకుంటే చిత్ర వధ చేసినట్టుగా వుంటుంది. వాడు అట్లా ఆశగా కలయ చూసిన క్షణాన నేను ఎక్కడున్నాను....ఎక్కడున్నాను? పశువులా మీద పడి తన ఆశ తీర్చుకుంటున్న పొరుగింటి వాడి పక్క మీదనా? భగవంతుడా—ఎటువంటి పరిస్థితి! 'బాబూ....నీ కోసం నీ ప్రాణాల కోసం నేను నలుగుతున్నానురా' కాసేపు ఆగి వుండకూడదా....నీ కోసం చీకట్లో పరుగెత్తుతూ, పట్టాలు దాటుకుంటూ, పడుతూ లేస్తూ మీ అమ్మ మందులు తెస్తున్నందుకైనా కొన్ని క్షణాలు ఆగకూడదురా? నీకు కూడా ఎందుకు కనికరం లేకపోయింది నాయనా....'' ఇవే ఇవే నా గుండెని తొలిచివేసి కుళ్ళి కుళ్ళి ఏడ్చేదాన్ని.

పిల్లవాడి తండ్రి ఎక్కడుంటాడో టెలిగ్రాం ఇప్పిస్తామన్న వాళ్ళని వారించాను. ఆ హంతకుడి చేతులతో మట్టికప్పడం కూడా నాకు యిష్టం లేకపోయింది. ఇదీ ఒక విధమైన తెగింపే. యిరుగు పొరుగు ఈసడించారు కూడా. ఆడదానికి అంత మొండితనం కూడదని. వాళ్ళకి తెలుసా నన్ను కాలుస్తున్న నిప్పు? ఎవరేమయినా అనుకోనీ-అన్న మొండితనం వచ్చేసింది. ఆ తెగింపులో నేను నిర్ణయించుకున్నది ఒకటే. ఏం చేసయినాసరే మిగతా పిల్లల్నయినా కాపాడుకోవాలి. వాళ్ళనీ పోగొట్టుకోకూడదు.

అంతే–ఆ రోజే మొదలు. తరువాత తరువాత అలవాటయిపోయింది. అవసరాలు అలవాటు చేశాయంటే బావుంటుందేమో. సరుకు బావుంటేగాని, సొగసుగావుంటే గానీ ఎవరూ కొనరు కదా. అందుకే నన్ను నేను బాగా పోషించుకుంటున్నాను. నా మనసు మసిబారి పోయింది. కానీ నా ముఖం కాంతులీనుతుంది. నా గుండె బండబారిందే కాని నా ఒళ్ళు పట్టుకుచ్చులా మెత్తగా మృదువుగా వుంది. నా పిల్లలు ఇప్పుడు గిన్నెనిండా అన్నం పులుసూ వండుతుంటే చూసి కంచం నిండా పెట్టుకుని తినగలుగుతున్నారు. కంటినిండా నిద్రపోతున్నారు. వీళ్ళలో ఇంకెవ్వరూ చచ్చిపోరు ఎవ్వరూ చచ్చిపోరు. తిండిలేక గానీ, నిద్రరాక గానీ, మందులు లేక గానీ చావరు. చావరు; చావనియ్యను.''

ఆమె ఆవేశంతో పిచ్చెక్కిన దానిలా మాట్లాడుతోంది. కాదు-కాదు ఆమె లోలోపల కరుగుతున్న బాధ వుడుకుతున్నలావాలా పొంగి పొంగి బయటికి రావడానికి కాస్తంత మార్గం కనబడగానే వెల్లువలా ప్రవహిస్తోంది.

''ఆగు. ఇదంతా నీ భర్తకు తెలియదా?''

మళ్ళీ అడిగాను అదే ప్రశ్న. నవ్వింది. ఆ నవ్వులో జీవం లేదు.

''తెలుసు. నేనే చెప్పాను. పిల్లాడు పోయాక, ఆయన తిరిగివచ్చాక వాడు పోయినట్టు నేను మాత్రం చెప్పలేదు. బండి దిగిరాగానే స్టేషనులోనే ఎవరో చెప్పినట్టు వుంది. ఇంటికి రాగానే నేనేం విరుచుకుపడతానో అన్నట్టు తప్పుకుని తప్పుకుని తిరిగారు. నేనా ప్రసక్తే తేలేదు. ఎవరో యింటికి వచ్చిన చుట్టంలా ఆయనకి వండాను. పెట్టాను. అడక్కుండానే డబ్బు యిచ్చారు. ఆ రాత్రికి ఆయనతో పడుకున్నాను. నేను అంత త్వరగా సహకరిస్తానని వూహించలేదు ఆయన. తరువాత నేనే చెప్పాను. డబ్బు యిచ్చారు గనుక పక్కలో చేరానని. ప్రస్తుతం తన భార్య పిల్లలు బ్రతుకుతున్నది యిలాంటి డబ్బుతోనేనని.

ఆ మాట విన్నప్పుడే గుర్తువచ్చినట్టుంది తను మగవాడినని. నేను అతని పెళ్ళాన్నని. చావచితకబాదాడు. నానా బూతులు తిట్టాడు. కాని ఏం జరిగింది? ఆ వుదయమే తనిచ్చిన డబ్బుకు మరో ఇరవై కలుపుకుని తీసుకెళ్ళిపోయాడు. ఆ తరువాత మళ్ళీ మళ్ళీ వచ్చినప్పుడు నా దగ్గరున్న డబ్బు కోసమే వచ్చేవాడు. తన భార్య ఒళ్ళమ్ముకుని సంపాదిస్తున్న డబ్బని తెలిసీ తన జల్సాలకోసం ఖర్చుపెట్టుకునే 'మగవాడు' నా మొగుడు. భార్యల సంపాదనల మీద బ్రతుకు వెళ్ళమార్చే ఎందరో భర్తలుండవచ్చు కాని 'యీలాంటి' సంపాదనకు కూడా చేయి జాస్తున్న భర్తకు భార్యనయిన దురదృష్టవంతురాలయిన ఆడదాన్ని నేను.''

''అయితే రేపు నీ పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు అయ్యాక నిన్ను అసహ్యించుకుంటే....''

ఛెళ్ళున కొరడా దెబ్బ తిన్నదానిలా తలెత్తి చూసింది.

''ప్రతి క్షణం నన్ను నేనే అసహ్యించుకుంటున్నాను. యీ శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరుక్కుందాం అని కూడా అనిపిస్తుందొక్కోసారి. కాని రెక్కలు రాని, ముక్కు పచ్చలారని నా పిల్లల కోసం బ్రతక్క తప్పదు. నా పిల్లలు నన్ను ఏవగించుకొనేంత పెద్దరికం సంపాదించినపుడు వాళ్ళ బాధ్యత నాకుండదు. వాళ్ళ నుండి దూరంగా పోతాను. అప్పుడయినా నాకు యీ హీనపు బ్రతుకు నుండి విముక్తి లభిస్తుంది. తరువాత నేనేమయినా ఫరవాలేదు.''

"మరి ప్రతి క్షణం ఏవగించుకుంటూ నయినా యీ బ్రతుకు బ్రతక్కపోతే నీ పిల్లలకూ యింత విషం యిచ్చి, నీవూ యింత తిని ఒక్కసారిగా విముక్తి పొంది వుండొచ్చుగా."

చాలా సినిమాల్లో, కథల్లో చూసిన దృశ్యాలు గుర్తుకొచ్చి అడిగాను. తలెత్తి సూటిగా నా కళ్లల్లోకి చూచింది.

'ఛీ. నీవూ ఒక మనిషివేనా' అన్నట్టు గ్రుచ్చుకుంది ఆ చూపు.

"కొన్ని క్షణాలపాటు అనుభవించే ఆనందం వల్లనే మీరు పిల్లల పుట్టుకకు కారణమవుతారు. తండ్రులవుతారు. కాని ప్రతి కాన్పుకి తన ప్రాణం ఒడ్డి జీవం పోసే ఆడది మీకు ఎట్లా అర్థం అవుతుంది? నా కడుపులోని ప్రేగులు తెంచుకుని పుట్టిన పాపలు వాళ్ళు. ఒక్కొక్కరికి కుండెడు రక్తం ధారపోసి కన్నాను. అట్లాంటి పిల్లలకి నా చేతులతో నేను విషం యిచ్చి చంపేయడమా? అట్లాంటి ఆలోచన వచ్చిన దురదృష్ట ఘడియలు లేకపోలేదు. కాని... చూస్తూ చూస్తూ... రెక్కల చాటున ఒరిగి పడుకున్న పక్షికూనల్లా నన్ను వాటేసుకుని చుట్టుకున్న ఆ బుల్లిబుల్లి చేతులను, కాళ్ళను ఆ పాలుగారే బుగ్గలను నిర్జీవం చేయలేకపోయాను. పోగొట్టుకున్న ఆ ఒక్క బిడ్డ జ్ఞాపకాలూ నా జీవితమంతా కాలుస్తూనే వుంటాయి. కన్న బిడ్డలను చేతులారా ప్రాణాలు తీయలేక, నేనయినా ఏదయినా మింగి చద్దామనుకుంటే వీళ్ళనలా వీధికొక బిచ్చగాడిగా కాలే కడుపులతో ఎండిన డొక్కలతో వూహించలేక అసమర్థురాలిని అయ్యాను. తండ్రి వదిలేయ గలిగాడు గాని తల్లిగా నేనా పని చేయలేకపోయాను.

'ప్రాణం కన్న శీలం ముఖ్యం' అని అందరూ అనేమాట. ఏ సినిమా చూచినా, ఏ కథ చదివినా కనిపించేది వినిపించేది ఆ మాటే. నిజమే. కాని యిక్కడ నా వొక్క ప్రాణమే అయివుంటే అది ఏనాడో గుటుక్కుమనిపించి వుండేదాన్ని. కాని నా ప్రాణానికి ప్రాణాలు నా పిల్లలు. ఏం చేసయినా సరే ఏం పోగొట్టుకుని అయినాసరే నా పిల్లల్ని నేను బ్రతికించుకోవాలి. అంతే...."

ఆమె మాటలో ఒక ధ్యేయం. ఆమె ముఖంలో ఒక దృఢ నిశ్చయం కనిపించాయి.

"జీవనాధారానికి యీ పని తప్ప మరేమార్గమూ లేదూ" అన్నాను. కాని అన్నీ వున్న నేను మరి యిట్లా తప్పుడు పనులెందుకు చేస్తున్నానో.... ఒక్క క్షణం నా మనసు నన్ను తట్టింది.

నా ప్రశ్నకి ఆమె నవ్వుతోంది. యింకా ... యింకా.... యింకా.... పగలబడి నవ్వింది. ఏడుపుకి వచ్చిన కన్నీళ్లు యీ నవ్వుతో రెట్టింపు అయ్యాయి. అతికష్టం మీద ఆపుకుని మళ్ళీ పెదవి విప్పింది.

'నేను చదివింది ఎలిమెంటరీ స్కూలు వరకే. వుద్యోగాలు చేసుకునేంత గొప్ప చదువులు చదవలేదు. మరే విద్యలూ రావు. భిక్షమెత్తలేను. ఏ వంకరాలేని నేను భిక్షానికి పోయినా వుమ్మేతారు జనం. పాచిపనులు చేసి కుట్టుమిషను మీద యింత సంసారం గడపడానికి యిది సినిమా కాదు. నవల కాదు. చదివి పక్కన పడేసే కథ కాదు. జీవితం. రాత్రీ, పగలూ, రోజులు, నెలలు, సంవత్సరాల తరబడి వెన్నాడి వేధించే జీవితం. చదువు సంధ్యలు లేని నేను యింతేసి మాటలు మాట్లాడటం మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు. కాని జీవితంలోని అనుభవాలు ఎన్నో పాఠాలు నేర్పుతాయి. ఎన్నో మాటలూ నేర్పుతాయి. మీరు చదువుకున్నారు. మీ చదువుని అమ్ముకుంటారు. తెలివిగలవాళ్ళు తమ తెలివిని అమ్ముకుంటారు. ఏ విద్య నేర్చిన వాళ్ళయినా ఆ విద్య కొనగలవాళ్ళ దగ్గర అమ్ముకుంటారు. బ్రతుకు బాట సాగిస్తారు. అలాగే అలాగే.... నేనూ నాకున్నదాన్ని అమ్ముకుంటున్నాను. నా అందాన్ని, నా ఆడతనాన్ని నా బ్రతుకు తెరువుకోసం అమ్ముకుంటున్నాను. ఎందరో ఆడవాళ్ళలాగా నేనూ పెళ్ళి, సంసారం, భర్త, పిల్లలు అనే కలల మంటపంలోకి వచ్చాను. నా దురదృష్టం కొద్దీ కూలిపోయింది. పందిరి వీడి ప్రక్కకు పడిపోయిన తీగలాగ నలుగురి కాళ్ళక్రింద నలిగి తొక్కివేయబడ్డాను. అట్లా కాక నేను నమ్ముకున్న మగవాడు నా జీవన లత అల్లుకున్న పందిరి ధృడంగా, నమ్మకంగా వుండివుంటే నా జీవితమూ ఎందరో గృహిణుల లాగానే కలకలలాడుతూ వుండేది. నేను చేస్తున్నది నీచమైన పనే. కాదనను. అయినా నాకు మరో మార్గం లేదు. మీలాంటి కొనే మహారాజులున్నంతవరకు మాలాంటివాళ్ళకు యిదీ ఒక దారే కదా! బ్రతుకు బాట ఎలాగోలా సాగించాలి. రహదారిన వెళ్ళడానికి అదృష్టం, అర్హత అందరికీ వుండవు. యిది ప్రక్కదారే; డొంకదారే అయినా నడక సాగించక తప్పదు. పథవిహీనులమే అయినా ప్రతి ఒక్కరూ గమ్యంవైపు సాగాల్సిందే కదా" ఆమె మాటలు వింటూంటే నాలో వుప్పెన.

నా హృదయంలో కల్లోల తరంగాలు, దావాగ్నులు విపరీతమయిన భయం, బాధ, ఆవేదన నాలో ఏదో పిరికితనం.

ఇలాగే.... ఇలాగే.... జరిగితే ఏదో ఒకనాటికి నా సంసారం కూడా యిలాగే మారుతుందా?

నేను సృష్టిస్తున్న సమస్యలలోంచీ, బాధలలోంచీ బయట పడటానికి నా భార్య కూడా ఎప్పటికయినా యిలా తెగిస్తుందా? తనూ ఒక పిల్లల తల్లే కదా. జీవితంలో తనూ విసిగిపోవచ్చు. పిల్లలకోసం ఆడది ఏమయినా చేస్తుందా? ఎంతకయినా తెగించేందుకు సిద్ధపడిందంటే అందుకు కారకులెవరు? మగవాడు కాదా? నాలాంటి మొగుడు కాదా?

బాధ్యత లెరిగి తన భార్య, తన పిల్లలు తన సంసారం అని తన శక్తికొద్దీ భారం మోస్తే కష్టమయినా సమానంగా స్వీకరిస్తుంది భార్య. భర్త పక్కకు తప్పుకున్ననాడు భారం మోయలేని ఆడది తప్పటడుగులు వేయడమో కూలిపోవడమో జరిగి తీరుతుంది. ఈమె జీవితం విధి వ్రాసిన వ్రాత కాదు. ఒక మగవాడు వ్రాసిన వ్రాత.

కదిపిన తేనె తుట్టలా నా మనసు కల్లోల పడింది. నా మనసు, మస్తిష్కం తీవ్రమైన వేదనకు గురయ్యాయి. నిముషాల మీద నా కర్తవ్యం పట్ల ధృఢ నిశ్చయానికి వచ్చాను. జేబులోంచి నోటు తీసి యిచ్చాను. దానికేసి చూసి ఆశ్చర్యపోయింది. "వంద రూపాయలా మరి నన్ను మీరు...."

"నాకు కావలసిందేదో నీవు యిచ్చావు. అంతే చాలు యిక నీవు వెళ్ళు" అంటూ ఆమెను పంపివేశాను. గబగబా బట్టలు వేసుకున్నాను. తాళం వేశాను. ఆమె నిశ్శబ్దంగా చీకటిలో కదిలిపోతోంది. నా పాదాలు బస్టాండ్ కేసి దారి తీశాయి. మొదటి బస్సు అందుకోవాలి. చకచకా అడుగులు వేస్తున్న నా మనసులో ఒకే ఆలోచన. ఒకే ధృఢ నిశ్చయం. ఈమె జీవితం నేను మార్చలేను. కాని యింకో జీవితం యిలా మారటానికి ఎలాంటి అవకాశం యివ్వకుండా జాగ్రత్త తీసుకోవాలి. నేనూ అలాంటి భర్తగా తయారుకాకూడదు. నా పాత జీవితానికి స్వస్తి చెప్పాలి. నా హఠాత్తాగమనం చూసి నా భార్య ఆశ్చర్యపోతుందేమో — నాతో పాటు అందర్నీ తీసుకువెళ్ళడానికే వచ్చేనంటే మూర్ఛపోతుందో....

కదులుతున్న బస్సులోకి ఎక్కి కూచున్నాను. నాకన్నా ముందుగా వెళ్ళి నా హృదయం నా భార్య చుట్టూ పరిభ్రమిస్తోంది. □

# దెయ్యాలతో రెండేళ్ళు



**— పుష్పా అశోక్ కుమార్**

దయ్యాలతో రెండేళ్ళు అన్న శీర్షికలో రెండో వ్యాసం ఇది. (తొలివ్యాసం ఫిబ్రవరి సంచికలో వచ్చింది) దయ్యాల గురించి విస్తృతపరిశోధనలు జరిపిన శ్రీవారి నోట్స్ నుంచి మరి కొన్ని ఘట్టాలను వివరిస్తున్నారు రచయిత్రి. ఇందులో చంద్రమతి తన అనుభవాలు వివరిస్తోంది:

**దయ్యాలనూ భయం వేస్తుందా?**

మా ఆయన పుట్టిపెరిగిన ఊరు దక్షిణాదిలోని ఒక మారుమూల కుగ్రామం. ఆ కాలంలో వారి స్వగ్రామంలో కాస్త వసతిగా వున్నవాళ్ళు మా అత్తగారి కుటుంబం మాత్రమే. వాళ్ళకు పెద్ద డాబా యిల్లు వుండేది. ఆ వూళ్ళో మిగతావన్నీ పూరిళ్ళే. ఆ గ్రామంలో చాలామంది వేసవికాలం వచ్చిందంటే ఇళ్ళముందు మంచాలు వేసుకుని వెన్నెల రాత్రుల్లో హాయిగా కథలూ, పురాణాలూ, లోకాభి రామాయణం మాట్లాడుకుంటూ నిద్రపోయేవారు. మంచాలు లేనివాళ్ళు శుభ్రంగా వున్న వాకిళ్ళలో ఈతచాపలు పరుచుకుని ఆదమరచి నిద్దరోయేవాళ్ళు.

నేను ఆ రోజు తొలిసారిగా ఆ ఊరు వెళ్ళాను. గ్రామ పరిసరాలు చాలా ప్రశాంతంగా ప్రకృతి దృశ్యాల మధ్య అందంగా వున్నాయి. మనుషులు లేమితో వున్నా ఆప్యాయంగా పలకరించారు. పట్టణవాస హిపొక్రసీకి దూరంగా వుంటున్నారు. అవాళరాత్రి చాలా పొద్దుపోయేవరకు ఆ వూరు గురించి, కుటుంబ విషయాల గురించి మా కుటుంబ సభ్యులతో వాకిట్లో కూర్చుని సంతోషంగా మాట్లాడుకున్నాము. నిద్ర వస్తుంది అంటూ ఒకరి వెనుక ఒకరు జారుకున్నారు. నేను, మా ఆయన అదీ ఇదీ మాట్లాడుకుంటూ వాకిట్లోనే మంచం మీద పడుకుని నిద్రపోయాము.

అర్థరాత్రి దాటి వుంటుంది. ఎవరో నా వీపు తట్టి లేపారు. కళ్ళుతెరచి చూశాను. తెల్లచీర కట్టుకుని ఒక ఆవిడ నుంచుని వుంది ఎదురుగా. ముఖం కళకళలాడుతోంది. శరీరఛాయ అంటారా మరీ ఎరుపు.

''ఏమిటండీ?'' అన్నాను కళ్ళు నలుపుకుంటూ.

''ఏమమ్మా....కొత్తమ్మాయీ....ఈ ఇంట్లో ఒక నియమం వుందమ్మాయి....మొగుడూ, పెళ్ళాం ఒకే మంచం మీద ఇలా అసహ్యంగా పడుకో కూడదు'' అంది.

నేను దుప్పటి కప్పుకుని పడుకునివున్నాను. అదేవిధంగా మా ఆయన కూడా మరో దుప్పటి కప్పుకుని వున్నారు. అసహ్యం అని దేన్ని అంటోంది ఆవిడ? ఒళ్ళు మండుకొచ్చింది నాకు.

''అసలు ఇప్పుడేం కొంపమునిగిందని అర్థ రాత్రిలో వచ్చి లేపి చెబుతున్నారు?'' అన్నాను చిరాగ్గా.

ఆమె ''అసహ్యం, అశ్లీలం అంతా నాకేమీ తెలియదమ్మాయ్. నాకు తెలిసిందల్లా ఈ ఇంట్లోనూ, బయటా ఆలూమగలు కలిసి పడుకోకూడదు. అంతే. ఇలా చెప్పిన తర్వాత కూడా హద్దు మీరారా ...'' అంటూ ఆమె చెప్పవచ్చింది సగం లోనే ఆపివేసింది.

''ఏం - ఏం చేస్తారేంటి?'' అన్నాను కోపంగా. ఆమె శాంతంగా, గంభీరంగా అంది ''లోపల వేసేస్తాను'' అని.

నాకేమీ అర్థం కాలేదు. ''అసలు మీరిప్పుడు ఇక్కడ నుంచి కదల్లేదంటే మావారిని లేపి చెబుతాను'' అన్నాను. అంతే_

తలక్రిందుగా పైకి ఎగిరి క్రిందపడ్డానా? అన్నట్టు వివరించలేని అనుభవం! దెబ్బ బలంగా తగిలి వుంటుందనుకున్నాను. కాని ఎలాంటి బాధ కలగ లేదు. మైకం వచ్చింది. మరు రోజు ఉదయం దీనిని గురించి మా ఆయనకు చెప్పాను. ''ఓస్.... ఇంతేనా.........ఇది ఇక్కడ సర్వసాధారణమైన విషయం. మనం పడుకోవాలంటే అదిగో గది!'' అంటూ నవ్వుతూ ఒక గదిని చూపించి ''ఇకమీదట అలాంటి సంఘటన జరగదులే. భయపడవద్దు.'' అని ఓదార్చి ధైర్యం చెప్పారు.

తర్వాత ఆ వూరి నుంచి బయలుదేరేవరకు ఎలాంటి సంఘటనా జరగలేదు. నేనూ, ఆయన ప్రత్యేకమైన ఆ గదిలోనే పడుకునేవాళ్ళం.

**మా ఆయన నోట్:**

చాలా స్వారస్యంగానే సాగుతోంది వివరణ. ఇంకా ఏమైనా కొత్తవి దొరకవా అనుకుంటూ ''ఈ ఇంట్లో ఇప్పుడు అలాంటి అనుభవాలు లేవు కదా?'' అన్నాను.

''అదెందుకు అడుగుతారు? ఒక్క సంఘటన అనేం ఖర్మ....ఎన్నో వున్నాయి'' అంది చంద్రమతి. మునుపటి సంఘటనల్లాంటివి ఐదారు అనుభవాలు వివరించింది. ఆ రాత్రి అక్కడే పడుకున్నాను. మరు రోజు ఉదయం చంద్రమతి లాగానే ఇలాంటి అనుభవాలు గల రామమోహన్‌ను కలుసుకున్నాను. ఆయన స్వానుభవాలు కొన్ని వివరించిన తర్వాత ఆయన మిత్రుడి అన్నయ్య రాజశేఖర్ అనుభవాలు చెప్పడానికి ప్రారంభించారు.

**మోహిని పిలుస్తూంది:**

నా స్నేహితుడి అన్నయ్య రాజశేఖర్ ఇండియన్ ఆర్మీలో పెద్ద ఆఫీసర్. వాళ్ళు వుంటూన్న క్వార్టర్స్ ఆఫీసుకు ఒకమైలు దూరంలో వుంది. మధ్య అరణ్యమార్గం! ఒంటరిగా ఎవ్వరూ

## ఢిల్లీకి కాదు పల్లెకు

పల్లె పైరులే లేకుంటే
పరువాల ధాన్యరాసులే రాకుంటే
పదపద ఢిల్లీ అనగలమా!
పరుగు పందాన నిలువ గలమా!
అందాలున్నాయక్కడ
ఆనందాలున్నాయక్కడ
అద్భుతాలు కనిపిస్తాయక్కడ
అయినా........
అన్నముండేనే
ఆ అనుభూతులు
ఢిల్లీ నాకెంతో యిష్టం
కానీ........
పల్లె లేకపోతే బ్రతకడం కష్టం.
యిచ్చట గొలిపె
పచ్చటి పైరుల
దాగిన ప్రకృతి కన్య
ఆనందంగా స్వాగతం చెబుతుంది
ఎవరొచ్చినా పోయినా పట్టించుకోదు
రాజ సమూలికే రాజధాని ఢిల్లీ.
ముగ్ధమోహన ముద్దబంతి
మృదు మనోహర
మమతల మల్లె
మన అందాల పల్లె.
అందరికీ ఆధారం ఆహారం
ఆ, ఆహారానికి ఆధారం అగ్రహారం
భారతానికి రాజధాని ఢిల్లీ!
ప్రపంచానికి రాజధాని పల్లె!
అందుకే అంటాను నేను
"ఢిల్లీకి కాదు
పాడిపంటల పల్లెకుపోదాం
పట్టెడు గింజలు పండించేదెలాగో
ధరణీ ముద్దు బిడ్డనడిగి తెలుసుకుందాం."

[నా "ప్రేమవాహిని" నవలకు పీఠిక వ్రాస్తూ—"ఢిల్లీకి కాదు పల్లెకు—అని విజయలక్ష్మి—ఓ కవిత వ్రాస్తే బావుండును. వ్రాస్తుంది." అని నమ్మకంగా పలికిన పూజ్యులు ఆంధ్ర ఆస్థాన కవీశ్వరులు, డాక్టర్ దాశరథి గారికి అంకితం]

—పాటిబండ్ల విజయలక్ష్మి

ఆ దారిలో వెళ్ళేవారుకారు. వెళ్ళాలనుకుంటే గుంపులు గుంపులుగానో లేదా ఇద్దరు ముగ్గురో వెళ్ళేవారు.

వెళ్ళే దారిలో బ్రహ్మాండమైన ఒక మర్రి వృక్షం. చాలా వయసుముదిరిన చెట్టు కావడం వల్ల ఊడలు ఎక్కువగా వున్నాయి. ఆ మర్రిచెట్టును దాటి వెళ్ళేప్పుడు ధైర్యవంతులైన సైనికులు కూడా తొందర తొందరగా నడిచి వెళ్ళేవారు.

నేనిప్పుడు చెబుతూన్న సంఘటన 1946 లో జరిగింది.

ఆఫీసర్ రాజశేఖరం దేనికీ భయపడే ఘటం కాదు. అయితే ప్రకృతి సౌందర్యం చూడడంలో వింత అనుభూతి, ఆనందం పొందే స్వభావం ఆయనది. అందువల్ల సుందరదృశ్యం కనబడితే చాలు అక్కడే కాస్సేపు ఆగిపోయేవారు అనుకోకుండా.

ఆయన ఆ ప్రాంతానికి బదిలీ అయిన తొలి రోజు అవాళ. అందరితోపాటు ఆ ప్రాంతాన్ని చూస్తూ వచ్చిన రాజశేఖరం ఆ మర్రి చెట్టు దగ్గరికి రావడంతో అనుకోకుండా అలాగే ఆగిపోయారు. దీనిని గమనించని మిత్రులు ముందుగా వెళ్ళిపోయారు.

మర్రి ఊడలు; అక్కడక్కడ చిక్కటి గుబురులు. వింత వింత దళాలతో గాలికి కులుకుతూన్న రంగు రంగుల పూల గుత్తులతో చెట్లను అల్లుకున్న అందమైన తీగల సోయగాలు చూస్తూ మైమరచిన స్థితిలో వున్న ఆయనకు ఒక మధుర స్వరం వినిపించింది. తిరిగి చూశారు.

ఒత్తైన శిరోజాలు నిండిన తలనిండా విరిసీ విరియని మల్లెమొగ్గలు; ఎడమ చెవి దగ్గర స్టైల్‌గా పెట్టుకున్న ఓ ఎర్రగులాబీతో లేత గులాబీరంగు చీర ధరించిన ఒక సుందరి మందహాసం చిందిస్తూ ఆయన దగ్గరికి వచ్చింది.

"ఎవరు నువ్వు?" అధికార ధోరణిలోనే అడిగారు ఆఫీసర్. ఎందుకంటే ఆ సెంటర్‌లో ఆడవాళ్లు ఎవరూ లేరు.

"నేను అడగవలసిన ప్రశ్న ఇది. ఈ ప్రాంతం నా పరిపాలనకు లోబడినది" అంది ఆవిడ.

ఏం చెప్పాలో తెలియక అలాగే నిలబడిపోయిన రాజశేఖర్‌ను చూసి "అలా కూర్చుని మాట్లాడుకుందాం" అని ఒక తెల్లటి బండను చూపిందావిడ.

ఆ బండమీద ఇద్దరూ కూర్చున్నారు. ఆయన్ని గురించిన వివరాలన్నీ చాలా వివరంగా అడిగి తెలుసుకుందావిడ. ఆయన కూడా దాచవలసిన విషయాలను దాచి చెప్పదగిన వివరాలన్నీ తెలియజేశారు.

అన్నీ మాట్లాడిన తర్వాత "నేను మీకు నచ్చానాండీ" అంది ఆవిడ నవ్వుతూ.

ఆయన ఒక కళారసికుడు కదా? "బాగా నచ్చావు" అన్నాడు సంతోషంగా మీసాలు దువ్వుతూ.

వెంటనే ఆవిడ "నచ్చానంటే ఏమిటి నచ్చింది? నా అందచందాలా, శరీర సోయగమా? మాటల చలాకీతనమా లేక గుణమా?" అని అడిగింది.

ఏం చెప్పాలా అని మొదట కొంచెం తటపటాయించి "అన్నీనూ" అన్నాడు.

వెంటనే ఆమె.... "....అబద్దం చెప్పకండీ" అంటూ కళ్ళు తుడుచుకుంటూ ఏడుపు ప్రారంభించింది.

"లేదు....నిజమే చెబుతున్నాను" అన్నారాయన.

"కానీ ఇలా ఈ రూపంలో వుండి మాట్లాడితే మీరు ఇష్టపడతారా?" అని వున్నట్టుండి అస్థిపంజరమై నిలబడింది.

పరుగు పెట్టారు మిలిటరీ ఆఫీసర్.

"ఏయ్....ఎక్కడికి పరుగెడతావ్? ఎందుకు పరుగెడతావ్" అంటూ వెంబడించి తరుముతున్నట్టే వినబడిందట ఆయనకు. దాంతో ఆయన మూడు రోజులు తీవ్రమైన జ్వరంలో పడ్డారట!

మా ఆయన నోట్

వినడానికి భయం వేసింది. ఇందాక నేను విన్న సంఘటనలలో దీనివి విన్నప్పుడు నాకు ఆశ్చర్యంతోపాటు ఒళ్లు గగుర్పొడిచింది.

[ఇలాంటి సంఘటనలు విన్నప్పుడు, చదివినప్పుడూ 'ఐతే' దెయ్యాలున్నాయా? అన్న అనుమానం చాలా మందికి వస్తుంది. ఉన్నాయనో లేవనో కచ్చితంగా మనం చెప్పలేకపోయినా, కొందరి కొందరి అనుభవాలు వింటూంటే మాత్రం, చాలా కుతూహలంగా వుంటుంది. అందుకే ఈ వ్యాసాలు ప్రచురించడం జరిగింది. —వ. సం.]

# ఒరిస్సా గ్రామీణ జీవితం - స్త్రీలు

**- పెదపూడి రాజ్యలక్ష్మీదేవి -**

ఒరిస్సా వెనుకపడ్డ రాష్ట్రమని ప్రతీతి. కాని ఒరిస్సా ప్రజలు ఎందులోనూ వెనుకబడిలేరని నా అభిప్రాయం. ఇతర రాష్ట్రాలవారికన్న వారు ఎందులోనూ తీసికట్టుకాదు. విద్యా విషయంలోనూ, యితర రంగాలలోనూ వారు ధైర్యంగా ముందుకు వస్తున్నారు. ఇక్కడి గ్రామీణ వాతావరణం, ప్రజల సంస్కారం, వారి సంస్కృతి, పొరుగు రాష్ట్రపువారమైన మనపట్ల వారు చూపే ఆదరాభిమానాలు మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి.

సువర్ణరేఖ, బ్రహ్మణి, బుధా, బొళాంగో, శాళొని, వైతరణీ, మహానది, ఋషికుల్య, వంశధార, ఇంద్రావతీ నదులు ప్రవహిస్తూ యీ నేలను సస్యశ్యామలం చేస్తున్నాయి. వర్షాకాలంలో యిక్కడ వరదలూ ఎక్కువే. కాస్త భారీ వర్షాలు పడితే యీ నదులు పొంగి పల్లెటూళ్ళని నిర్దాక్షిణ్యంగా ముంచెత్తివేసి అమాయకపు పల్లె ప్రజలను అష్టకష్టాలపాలు చేస్తాయి. బరంపురం, ఖుర్దా, భువనేశ్వర్. కటక్‌ల మీదుగా రైలు మార్గం వున్నా ఒరిస్సాలో పల్లెటూళ్ళు ఎక్కువ అవటం వల్ల బస్సులే ఎక్కువగా వుపయోగపడుతూ వుంటాయి. పల్లెటూళ్ళు నదుల ఆగ్రహానికి గురియైనప్పుడు ఒక వూరికి ఒక వూరికి మధ్య పడవలు, తెప్పలు ప్రయాణ సాధనాలుగా ఉపయోగపడుతూ వుంటాయి.

కళింగ, ఉత్కళ, ఓఢ్ర కోశాల దేశాలు ఏకమై ఒరిస్సా రాష్ట్రం ఆవిర్భవించింది.

1971లో తీసిన లెక్కల ప్రకారం యీ రాష్ట్రపు మొత్తం వైశాల్యం - 1,55,84,200 చదరపు కిలో మీటర్లు.

ఒరిస్సా రాష్ట్రపు మొత్తం జనాభా 2,19,44,615.

ఇందులో పురుషులు — 1,10,41,083

స్త్రీలు — 1,09,03,532

పట్నవాసాల్లో జనాభా — 18,45,395

ఇందులో పురుషులు — 10,00,060

స్త్రీలు — 8,45,335

గ్రామీణ ప్రాంతాల్లోని జనాభా - 2,00,99,220

ఇందులో పురుషులు — 1,00,41,023

స్త్రీలు — 1,00,58,197

పైన ఇచ్చిన వివరాలవల్ల పట్టణ ప్రాంతాల కన్న గ్రామీణ ప్రాంతాలలోని జనాభా ఎక్కువని మనకి తెలుస్తోంది. ఒరిస్సాలో మొత్తం 13 జిల్లాలు వున్నాయి. అవి కటక్, పూరీ, బాలేశ్వర్, మయూర్, భంజ్, కెయింజోర్, సుందరఘడ్, సంబల్‌పూర్, భొలంఘీర్, ఢెంకనాల్, గంజామ్, పూల్‌బాణి, కోరాపుట్, కొళహండీ జిల్లాలు.

ఒరిస్సాలో వున్న మొత్తం గ్రామాలు— 51,639. ఒరిస్సాలో హిందువులు, ముస్లిమ్‌లు, క్రిష్టియన్‌లు వున్నారు. ఇక్కడి వారిలో చాలామంది ఆదివాసీ హిందువులు. వీరు కోరాపుట్, కొళహండీ, సుందరఘడ్, మయూర్‌భంజ్, కెయింజోర్ జిల్లాల్లో వున్నారు. వీరిలో అనేక తెగలు వున్నాయి. కంధా, కహాలొ, ముండ, శబరొ, సంతాళొ, మొదలైన తెగల వారు ఆయా తెగలకు సంబంధించిన భాషలను మాట్లాడతారు.

## వృత్తులు

ఒరిస్సా ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. స్త్రీలు యిళ్ళవద్దే వుండి పశువుల పనులు, పిడకలు చేయటం, ధాన్యం వుడకపెట్టడం, పిల్లల్ని ఆడించడం చేస్తారు. మరీ గత్యంతరం లేకపోతే తప్ప కూలిపనులకు పోరు. వ్యవసాయ పనుల్లో రోజుకి ఒక కట్టధాన్యం కూలి క్రింద యిస్తారు.

చిత్రమేమంటే రోజూ కష్టపడి సంపాదించి కూడబెట్టుకోవాలనే తాపత్రయం యిక్కడి గ్రామీ



జెజాంగ్ గ్రామంలోని రైతు కుటుంబంతో రచయిత్రి. (ఫొటోలో ఎడమనుండి కుడికి. వెనుక వరుస) గృహిణి అత్తగారు, గృహిణి, ఆమె బావగారి కోడళ్ళు యిద్దరు, వారి చిరంజీవులు (ముందు వరుస) గృహిణి చిన్న కుమార్తె, రచయిత్రి కుమార్తెలు అమృత, కామేశ్వరి.

# మీపిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!



**బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు**
అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. వారికి మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గటుగా ఉండేందుకు!

క్యాడ్‌బరీస్
## బోర్న్‌విటా
**అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!**







OBM 8376 B/TL

ఋలలో కనిపించదు. చేతిలో డబ్బు వుంటే పక్క-రోజు కూలికి వెళ్లడం మానుకుంటారు.

ఇక్కడి స్త్రీలు తాటి ఆకులతో చాపలు విసన కర్రలు చేస్తారు.

ప్రభుత్వం గ్రామీణ అభివృద్ధి పథకాల క్రింద కుటీర పరిశ్రమలను నెలకొల్పింది.

'మీరు భారతదేశం అంటే ఏమిటో తెలుసు కోవాలంటే పల్లెటూళ్ళకి వెళ్ళి చూడండి.' అనే వారు బాపూజీ. ఆ మాట అక్షరాలా నిజం. నిజ మైన భారతీయ సంస్కృతి అంటే ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే పల్లెటూళ్ళే శరణ్యం.

పది యిళ్లు వున్న చోట ఒక చిన్న గ్రామం వెలుస్తుంది. ఇటువంటి కుగ్రామాలు రెండు మైళ్లకి ఒకటి వంతున వుంటాయి. ఒరిస్సాలో పల్లెటూళ్ళే ఎక్కువ.

ఒరిస్సాలోని గ్రామీణ జీవితం - అక్కడి స్త్రీలు - వారి ఆహార వ్యవహారాలు - గ్రామీణ స్త్రీల జీవితం గురించి మన వనితలకు తెలియజేయాలనే వుద్దేశంలో రెండు పల్లెటూళ్ళకు వెళ్ళి అక్కడి స్త్రీలను యింటర్వ్యూ చేసాను. నాతోపాటు శ్రీవారు డాక్టర్ పి. జి. రామారావుగారు, చిరంజీవులు అమృత, కామేశ్వరి, జనార్దన్ వచ్చారు. ఆ రెండు పల్లెటూళ్ళలోనూ ఒకటి జెజాంగ్.

ప్రకృతి సౌందర్యంతో విరాజిల్లుతూ మనస్సులకి ఆహ్లాదం కలిగించేలా వున్న యీ జెజాంగ్ గ్రామం కటక్‌కి 40 మైళ్ళ దూరంలో వుంది. ఈ గ్రామంలో జనాభా 1500. అందులో స్త్రీలు 700, పురుషులు 800.

దట్టమైన వెదురు పొదలతో, రకరకాల పక్షుల వింత ధ్వనులతో, కలకలారావాలతో శోభిల్లుతూన్న జెజాంగ్ గ్రామంలో 'గోల్డెన్ గ్రాస్ సెంటర్' ముఖ్యమైన కుటీర పరిశ్రమ. ఈ గోల్డెన్ గ్రాస్‌నే ఒరియాలో 'కాయ్‌చో' అని అంటారు. ఇది గ్రామ స్త్రీలకు జీవనోపాధిగాను, విరామ సమయాల్ని సద్వినియోగం చెయ్యడానికి వుపయోగ పడుతోంది. ఇక్కడ ఘోషా పద్ధతులు కావటం వల్ల స్త్రీలు యిళ్ళ దగ్గరే ఈ కాయ్‌చో గడ్డితో రకరకాల చిన్న చిన్న బుట్టలు, టోపీలు, చాపలు తయారుచేసి సెంటరుకి పంపి ధన సంపాదన చేస్తారు. ఈ కేంద్రంలో 200 మంది స్త్రీలు పని చేస్తున్నారని కేంద్రం సూపర్‌వైజర్ చెప్పారు. పట్టాముండీ రోడ్డు మీద ఒక వైపున జెజాంగ్ గ్రామం, మరొక వైపున వ్యవసాయ క్షేత్రం - జనుము పరిశోధనా కేంద్రం వున్నాయి. ఒరిస్సాలో జనుము పంట ఎక్కువ. ఈ వ్యవసాయకేంద్రం 46 ఎకరాల్లో వుంది. ఇక్కడి పరిశోధనా విభాగం అధికారి శ్రీ దీక్షిత్. మేము వచ్చిన పని తెలుసు కుని వ్యవసాయ క్షేత్రమంతా దగ్గరుండి చూపించి వివరాలు తెలియచేశారు. ఈ 46 ఎకరాల భూమి లోనూ 36 ఎకరాలు సాగు చేస్తున్నారు. ఇక్కడ రెండు రకాల జనపనారను పండిస్తున్నారు. ఒకటి పిత్తా (చేదు) నశిత, మరొకరకం మీతా (తీపి) నశిత. మీతానశితతో మన గోంగూరపచ్చడిలా చేసుకోవచ్చు. ఇక్కడ నుంచి జనపనారని పశ్చిమ బెంగాల్, ఆంధ్ర రాష్ట్రాలలోని జనుము మిల్లులకి ఎగుమతి చేస్తున్నారు. జనుము సీజను అయిపోయాక ధాన్యం, బంగాళాదుంపలు, పప్పు దినుసులు, గోధుమ, కూరగాయలు పండిస్తారు.

ఆ కేంద్రం తిలకించిన తర్వాత జెజాంగ్ గ్రామం లోకి ప్రవేశించాము.

సన్నటి గ్రామ వీధుల్లోంచి నడిచివెడుతున్న మమ్మల్ని ఇళ్ళలోంచి బయటికి వచ్చి అంతా వింతగా చూడ చూసారు. వారికంటికి మేము విదేశీయులు లాగా కనిపిస్తున్నమాయె. కొంతమంది మా దగ్గరికి వచ్చి ఆదరంగా పలకరించసాగారు. మేము వచ్చిన పని తెలుసుకుని కొన్నికొన్ని వివరాలు చెప్పారు. గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయ పనులు మగవారే చేస్తారు. ఆడవారు యింటి దగ్గర వుండి పశువుల పని, పిడకలు చెయ్యడం, ధాన్యం వుడకబెట్టటం, పిల్లల పెంపకం చేస్తారు. మరీ గత్యంతరం లేకపోతే తప్ప సాధారణంగా పై పనులకు పోరు. చేపల్ని పట్టి అమ్మడం స్త్రీలు చేసే పని. మనవైపులా యిక్కడి గ్రామీణ స్త్రీలు పొలం పనులకు పోరు. గ్రామాల్లో స్త్రీలు తాటి ఆకులతో చాపలు, విసనకర్రలు చేస్తారు, తుంగతో బుట్టలు అల్లుతారు. ఈ బుట్టల్ని స్నేహితులకి బహుమతిగా యిస్తారు. ఇంట్లో వాడుకుంటారు, తాటాకులను సన్నగా చీల్చి వాటిని రంగుతో కలిపిన వేడి నీళ్ళలో పడేసి పదిహేను నిముషాలు నానబెడతారు. ఆ తర్వాత తీసి వాటితో చాపలు విసనకర్రలు చేసి అమ్ముతారు. స్వెటర్లు, లేసులు మొదలైన అల్లిక పనులు కూడా గ్రామీణ స్త్రీలు చేస్తారు. ఇవి తమకు కాలక్షేపంగానూ, ఉపయోగకరంగానూ కూడా వున్నాయని ఆ స్త్రీలు చెప్పారు. ప్రశాంతమైన ప్రకృతి వాతావరణంలో వుండే పల్లె పడుచులకి సృజనాత్మకమైన యీ కళలు మానసికోల్లాసాన్ని కలిగిస్తున్నాయి. అంతేకాదు - ధనార్జనకు కూడా వుపయోగపడుతున్నాయి.

## సంస్కృతి-ఆచారాలు

ఒరిస్సాలోనే కళింగ యుద్ధం జరిగింది. వరదలై పారిన రక్తపుటేరులను చూసి కళ్ళు చెదరి అస్త్ర సన్యాసం చేసిన వీర అశోకుడు శాంతి అశోకుడుగా పరివర్తన చెంది బౌద్ధమతం స్వీకరించి ఆ చరిత్రాత్మక స్మృతి చిహ్నంగా నిర్మించిన విశ్వశాంతి స్థూపం ధవళ గిరిలో వుంది. రాజుల పరిపాలనలో వున్న యీ ఒరిస్సాని బ్రిటిష్ ప్రభుత్వం అన్ని రాష్ట్రాలనీ తీసుకున్న తరువాత ఆఖర్ని తీసుకుంది.

అందుచేతనే యిక్కడి భారతీయ సంస్కృతి, సనాతన ధర్మం, నాగరికతా వాసనలు సోకి కలుషితం కాకుండా యింకా పరిరక్షింపబడుతున్నాయి. ప్రశాంత ప్రకృతి వాతావరణంలో నిర్మించబడిన యిక్కడి కుటీరాలు గడ్డి కప్పులతో పూర్వపు ఋష్యాశ్రమాలను తలపింపజేస్తూ వుంటాయి, వరి పంట అయ్యాక ఆ ఎండు గడ్డితో యిళ్ళు చేసుకుంటారు.

ఈ పల్లెలో ప్రతి యిల్లూ గోమయంతో శుభ్రంగా అలకబడి గోడలమీద తెల్లటి అందమైన చిత్రాలతో కళకళ్ళాడుతూ వుంది. ప్రతియింటికీ వెదురుబద్దలతో బైగోబా చెట్లు వుపయోగించి కట్టిన సరిహద్దులు వున్నాయి. ఇక్కడ అందరికీ పశు సంపద వుంటుంది.

మాకు ఆతిథ్యమిచ్చిన గృహిణి మాపట్ల చూపిన ఆదరాభిమానాలు ఆవిడ మాకు చేసిన అతిథి సత్కారం ఎన్నటికీ మరుపురానిది.

"బాబూ మళ్ళీ మా యింటికి రమ్మంటే మాత్రం వస్తారా....? ఇవేళ మా పూర్వపుణ్యం కొద్దీ వచ్చారు కాని." అంటూ ఆవిడా పిల్లలు మేము వద్దని వారిస్తున్నా వినకుండా బలవంతాన మా కాళ్ళు కడిగి గుడ్డతో తుడవబోయారు. అది వారి మర్యాద. వాళ్ళని తుడవనీయకుండా గుడ్డ తీసుకుని నా కాళ్ళు నేనే తుడుచుకున్నాను. శ్రీవారికి మాత్రం. ఆవిడా, కొడుకూ చెరోకాలూ తుడిచేసారు. మా పిల్లల కాళ్ల ఆవిడ కూతుళ్ళు నీళ్ళతో కడిగి తుడిచారు. ఆ తరువాత మమ్మల్ని వాళ్ళ పడగ్గదిలో వున్న పందిరిమంచం మీద కూర్చోపెట్టారు.

వాళ్ళది నాలుగు గదుల మంచువా యిల్లు.

ఆ యింటికి ఒక గదికి ఒక గదికి మధ్య గుమ్మంలేదు. మండువాకి చుట్టూ వసారా వుంది. ఏ గది కాగది విడివిడిగా వుంది. ఒక గదిలోంచి మరో గదిలోకి వెళ్ళాలంటే వసారాలోంచే వెళ్ళాలి. ముందు యింట్లో ఏమీ సామాను లేదు. ఆ గదికి ఎదురుగా వున్న గది వంట గది. ఆ గదిలో కొన్ని కుండలు, రెండు కంచు పళ్ళేలు వున్నాయి. వంటకుండల్లోనే చేస్తామనీ, భోజనం కంచు పళ్ళేలలో చేస్తామనీ ఆమె చెప్పింది. ఎప్పుడేనా పూజలు వచ్చినప్పుడు కొత్త కుండలలో వండుకొని దేవతార్చన చేస్తామని చెప్పింది. కాస్త వున్నవాళ్ళ వంటకి జర్మన్ సిల్వర్, కంచు పాత్రలు వాడతారని చెప్పిందామె., వీరికి మన కుంపట్లు తెలియవు. పగిలిన కుండను భూమిలో పాతేసి దాని మూతిని ముఖ ద్వారంగా చేసి పైన పొయ్యిలా మట్టితో చేసి ఎండిపోయిన జనప పుల్లలు, వెదురు ఆకులు వుపయోగించి వంట చేసుకుంటారు. హోటళ్ళ లోనూ, కాస్త ధనవంతుల యిళ్ళలోనూ రాకసి బొగ్గును వుపయోగిస్తారు. పొయ్యిలో పుడక ముక్కలు వేసి, పైన రాకసిబొగ్గు వేసి అడుగు నుంచి అంటిస్తారు. "ఈ పల్లెటూరిలో కుండలతో వండుకోవడమే మంచిది. ఎంచేతంటే యిక్కడ పనివాళ్ళు దొరకరు. అట్టే ఖరీదు వుండవు కనుక కొన్నాళ్ళు వాడిపారవేయ వచ్చు" అందాగృహిణి.

వంటగదికి పక్కగా మరొక గది, దాని కెదురుగా పడగ్గది వున్నాయి. చిన్న బీరువా, పందిరి మంచం యీ గదిలోనే వున్నాయి. వాళ్ళకి వున్న కంచు సామాను, గాజు సామాను రాత్రిపూట వంటింట్లోంచి తెచ్చి బీరువాలో దాచుకుంటారుట.

ఆ గదిలో మంచం పక్కనే రెండు కర్ర కుర్చీలు కూడా వున్నాయి మంచం మీద కూర్చున్న మాకు గృహిణి కూతుళ్ళ యిద్దరూ చెరోవైపునా వచ్చి కూర్చుని విసనకర్రలతో విసరసాగారు. వద్దని ఎంత వారించినా వినకుండా. వారిలో ఒక అమ్మాయి మెట్రిక్ మరో అమ్మాయి థర్డ్ఫారమ్ చదువుతున్నారు.

"మా యింట్లో కరెంటు లేదు. మీకు ఎంత యిబ్బందిగా వుందో!" అంటూ నొచ్చుకుందా గృహిణి.

"యాంత్రిక వస్తువుల్లోంచి సుఖమూ సంతోషమూ వస్తాయా!" అన్నాను మనస్ఫూర్తిగా నవ్వుతూ.

మమ్మల్ని కూర్చోబెట్టి ఆ యిల్లాలు హడావుడిగా వంటింట్లోకి వెళ్ళి ప్లేట్లతో ఫలహారాలు తెచ్చి మా ముందు పెట్టింది.

"ఇప్పుడివన్నీ ఎందుకమ్మా! మీ సంస్కృతి గురించి మీ ఆచార వ్యవహారాల గురించి తెలుసుకుందామని మా వాళ్ళకి తెలియజెప్దామని వచ్చాను."

"అలాగే తరువాత మాట్లాడుకోవచ్చు. ముందీఫలహారాలు తీసుకోండి" అందా గృహిణి.

చెనా గొజ్జా అనే స్వీటు, రసగుల్లా, కొబ్బరి, నూకలు కలిపి పంచదార వేసి చేసిన పాయసం చూడగానే "మీకు చాలా శ్రమ యిస్తున్నాం" అన్నాను నొచ్చుకుంటూ.

"ఎంత మాట! మీరలా అనకూడదు. ఈవేళ నాకెంత సంతోషంగా వుందో ఎలా వర్ణించగలను?" అంది ఆ గృహిణి. ఆమె హృదయంలోని ఆనందం మొహంలో ప్రతిఫలిస్తోంది.

వాళ్ళ సంస్కృతి గురించి చెప్పమని అడిగాను గృహిణి అత్తగార్ని.

సంభాషణలో నాకు అర్థంకాని చోట్ల గృహిణి కొడుకు, అతడి పెత్తండ్రి కొడుకు ఆంగ్లంలో తర్జుమా చేసి మాకు సహాయపడ్డారు. [సశేషం]



# అల్సర్

— 'డాక్టర్'

"శక్తులకు మించిన బాధ్యతల తో తీరికలేకుండా పని చేసే ఉద్యోగస్థులకే అల్సర్ వచ్చే అవకాశాలు ఎక్కువ. అల్సర్ రోగులకు పాలు ఉత్తమమైన ఆహారం. కాఫీ ఈ రోగాన్ని మరింత ఎక్కువ చేస్తుంది. అల్సర్ నుంచి మనల్ని కాపాడుకోవాలంటే కొన్ని ఆహార నియమాలు పాటించడం ఎంతైనా అవసరం. ముఖ్యంగా కారం బాగా తగ్గించాలి. నూనెతో చేసిన వంటకాలను, క్రొవ్వు నిండిన ఆహారపదార్థాలను ఎక్కువగా తీసుకోకూడదు. మద్యం అసలు ముట్టుకోకూడదు. అల్సర్ నుంచి విమోచనమార్గం ఒక్క శస్త్రచికిత్స ద్వారానే సాధ్యం—" ఇవీ మామూలుగా డాక్టర్లు అల్సర్ రోగులకు ఇచ్చే సలహాలు. అయితే ఇటీవల ఈ శాఖలో జరిగిన కొన్ని వైద్య పరిశోధనలు ఇవన్నీ అనుకున్నంత నిజాలు కావని రుజువు చేశాయి. అల్సర్‌కు కారణాలుగా భావించబడినవన్నీ సరియైనవేనా? అన్న సందేహం కల్గించాయి. అంతేకాదు, అల్సర్ రోగులకు ఉపకరించే కొన్ని కొత్త కొత్త విషయాలు కూడా వెలుగులోకి వచ్చాయి.

ప్రపంచం మొత్తం మీది ప్రజలలో-పదిమందిలో ఒకరు తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు అల్సర్‌కు గురవుతున్నారు. ముఖ్యంగా స్త్రీలలో ఇది మునుపటికంటే ప్రస్తుతం ఉధృతమౌతున్నది. గత దశాబ్దంలోనూ అంతకుముందూ ఇరవైమంది అల్సర్ రోగులుంటే అందులో ఒకరు మాత్రమే స్త్రీ. కాని ప్రస్తుతం ప్రతి ఇద్దరిలోనూ ఒకరు స్త్రీగా వుండడం గమనార్హం: దీనికి ముఖ్యమైన కారణాలు స్త్రీలలో కూడా పొగపీల్చడం, మద్యపానం ఎక్కువ కావడం, నానాటికి పెరిగిపోతున్న పరిస్థితుల ఒత్తిడి, మానసిక సంఘర్షణ అని చెబుతారు.

పెప్టిక్ అల్సర్: ప్రేవులలోని లోపలి గోడలను ముఖ్యంగా చిన్న ప్రేవుగోడలను - జీర్ణశక్తి కోసం స్రవించే ఆమ్లాలు ఎక్కువకావడం వల్ల— తినివేస్తాయి. అంచేత అక్కడ పుండు ఏర్పడుతుంది. జీర్ణాశయంలో హైడ్రోక్లోరిక్ ఆమ్లం, పెప్సినోజిన్ స్రవిస్తాయి. అవి పెప్సిన్ అనే ఎంజైమ్‌గా తయారై ప్రొటీన్లు జీర్ణం కావడానికి దోహదం చేస్తాయి. ఈ ఆమ్లస్రవాన్ని వేగస్‌నర్వ్ (Vagus nerve) కంట్రోల్ చేస్తుంది. జీర్ణాశయాన్ని మెదడుతో కలిపే ఈ 'నరం' గాస్ట్రిన్ అనే హార్మోను స్రవించడానికి కూడా దోహదం చేస్తుంది.

డయోడినల్ అల్సర్: మామూలుగా జీర్ణాశయానికి సమీపంలోని చిన్న ప్రేవులలో అల్సర్ వస్తూ వుంటుంది. జీర్ణాశయంలో ఎక్కువగా స్రవించే ఆమ్లం జీర్ణాశయాన్ని బలహీనపరచడం వల్ల అనారోగ్యం ఏర్పడి గాస్ట్రిక్ అల్సర్ వస్తుంది. కావలసినదానికన్నా ఎక్కువగా ఆమ్లం ఎందుకు స్రవిస్తుంది? అంటే మద్యం, కాఫీ, ఆస్పిరిన్ మొదలైన వాటిని ఎక్కువగా తీసుకోవడమే దీనికి కారణం. అయితే ఏళ్ళ తరబడి వీటిని మితిమించి తీసుకుంటూ వున్నా కొందరికి అల్సర్ రావడమే లేదు. మరి దీనికేం కారణం అంటే - వంశ పారంపర్యం. అల్సర్‌తో బాధపడేవారి దగ్గర రక్త సంబంధం కలవారిలో మిగతా వాళ్ళలో కన్నా మూడింతలు ఎక్కువగా వుంటుంది. '0' గ్రూప్‌కు చెందిన రక్తంగల వారికి మిగతా వారికన్నా ఎక్కువగా అల్సర్ సంప్రాప్తిస్తుంది. అదే విధంగా పరిసరాల ప్రభావం కూడా అల్సర్ రావడానికి కారణం అవుతుంది.

చూడడానికి నెమ్మదిగా, కడుపులో చల్ల కదలకుండా పనిచేసే విధంగా కనబడే వారికి కూడా అల్సర్ వచ్చే అపాయం లేకపోలేదు. కాయకష్టం చేసే రైతులు, కూలీలు, మొదలైన వారికి వచ్చినట్టే - వ్యాపార నిర్వాహకులు, రచయితలు, గుమస్తాలు మొదలైన వారికి కూడా అల్సర్ వస్తుంది. మనిషిలో వత్తిడి, ఉత్కంఠ, ఉద్రేకం, దిగులు ఎక్కువైనపుడు వారు ఏ రంగానికి చెందిన వారైనప్పటికీ అల్సర్ రావడానికి అవకాశం వుంది. అయితే ఇక్కడో ముఖ్య విషయం ఏమంటే - జీవితంలో ఒత్తిడి వుండడమే అల్సర్‌కు కారణం కాదు. ఆ ఒత్తిడికి మనిషి ఎలా రియాక్ట్ అవుతాడు అన్న దానిమీదే అది ఆధారపడుతుంది. ఒత్తిడి కొందరిలో నిరుత్సాహం నిస్పృహ కల్గించి హాని కల్గిస్తే - మరి కొందరిలో ఉత్సాహాన్ని ప్రేరేపించి పట్టుదలను పెంపొందిస్తుంది.

మామూలుగా పాతికేళ్ళకు పైన నలభై ఏళ్ళకు లోపల వయసు గల వాళ్ళకిఅల్సర్ వస్తూ వుంటుంది. కాని ఏడేళ్ళ నుంచి తొమ్మిదేళ్ళ వయస్సుగల పసిపిల్లలలో కూడా అరుదుగా అల్సర్ రావడానికి అవకాశం వుంది.

బొడ్డుకు పైభాగంలో నొప్పి కల్గడం అల్సర్ రావడానికి మొదటి సూచనగా చెబుతారు. కడుపులో మంట, మితిమించిన ఆకలి కూడా కొందరిలో వుంటుంది. కొందరికి భోజనం చేసిన అర్ధగంట తర్వాత రెండు గంటల లోపున వస్తే మరి కొందరి కా బాధ అర్ధరాత్రి నిద్రను కూడా చెడుపుతుంది. పసిపిల్లలకయితే కడుపు నొప్పితోపాటు తలపోటు కూడా వుంటుంది.

బేరియం కలిపి మ్రింగుతూ తీసే ఏక్స్‌రే ద్వారా అల్సర్ వుందా లేదా అని తెలుసుకోవచ్చు. దీని ద్వారా కూడా సరిగ్గా తెలుసుకోడానికి వీలు కానప్పుడు బల్బు అమర్చిన మెత్తటి పొడవైన గొట్టాన్ని (గాస్ట్రోడమో డినోస్కోప్) నోటి ద్వారా ఆహార నాళికలో పంపి అల్సర్ వుందా లేదా అని నిరూపణ చేసుకుంటారు.

అల్సర్‌ను ఆరంభ దశలోనే కనుగొని చికిత్స పొందాలి. అలా కానప్పుడు అది మరికొన్ని శారీరక రుగ్మతలకు దారి తీస్తుంది. చిన్న ప్రేవుల్లో అడ్డంకులు ఏర్పడవచ్చు. రక్తస్రావం అధికమై అనీమియా వ్యాధి రావడానికి ఆస్కారం వుంది. కొన్ని పరిణామాలు మరణాంతకాలు కూడా కావచ్చు. అంచేత అల్సర్ లక్షణాలు కనబడగానే వెంటనే డాక్టర్‌ను సంప్రదించి అజాగ్రత్త చూపకుండా తగిన చికిత్స చేసుకోవడం ఎంతైనా శ్రేయస్కరం. □

# మేము నిర్వహించింది.
# అదే మా సేవకు ప్రతిబింబం.




| | డిపాజిట్లు రు. కోట్లలో | పెరుగుదల రేటు ( % ) | అడ్వాన్సులు రు. కోట్లలో | బ్రాంచిలు |
|---|---|---|---|---|
| 1974 | 141.46 | (24.28) | 104.66 | 347 |
| 1975 | 178.70 | (26.32) | 117.66 | 404 |
| 1976 | 235.53 | (30.50) | 163.93 | 500 |
| 1977 | 319.35 | (35.60) | 210.84 | 600 |
| 1978 తాత్కాలికము | 438.30 | (37.21) | 280.12 | 666 |

## ఇప్పటివరకూ మేం సాధించిన ఈ అసాధారణ ప్రగతికి మా ఖాతాదారుల తోడ్పాటే కారణం. వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ప్రగతికి అంతమంటూ లేదు. ఏ యేటి కా యేడు జాతి పటిష్ఠంగా అభివృద్ధి చెందుతూనే వుంటుంది. ఉజ్వల భవిష్యత్తువైపుకు దృఢ సంకల్పంతో పయనిస్తూనే వుంటుంది.

అదే విధంగా ఆంధ్రా బ్యాంక్ కూడా జాతికి ఆర్థిక సేవ చేస్తూ అభివృద్ధిని సాధిస్తోంది. ఈ అభివృద్ధి, ప్రజలకు మా పట్ల గల విశ్వాసానికి నిదర్శనం. కేవలం ఐదు సంవత్సరాలలో మా బ్యాంకు డిపాజిట్లు రు. 141 కోట్ల నుంచి రు. 438 కోట్లకు పెరగడమే ఇందుకు తార్కాణం. 1978 లో మా పెరుగుదల రేటు 37 శాతానికి మించింది. అడ్వాన్సులు రు. 280 కోట్లకు పెరిగాయి! మా నిరంతర ప్రజా సేవకు ఇంతకన్నా నిదర్శనమేముంది ?

**మరింత సేవకోసం విస్తరణ . . .**

666 బ్రాంచిలతో, 55 సంవత్సరాలపైగా అపార అనుభవంతో, ఆంధ్రా బ్యాంక్ ప్రజల ఆర్థిక అవసరాలను గుర్తెరిగి సేవ చేస్తోంది. బలహీన వర్గాలకు, పన్నకారు, చిన్నకారు రైతులకు మా శాయశక్తులా తోడ్పడుతున్నాం!

ఈ విధంగా దేశ పురోభివృద్ధిలో మేమూ భాగస్వాములమైనందుకు గర్విస్తున్నాము!



**ది ఆంధ్రా బ్యాంక్ లి.**

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001.

ప్రజావసరాలకై పాటు పడేదే - ఆంధ్రా బ్యాంక్

ఒ. స్వామినాథ రెడ్డి : ఛైర్మన్

KIRON AB/79

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| జ ఝ | ஜ | ಜ ಝ | ജ ഝ | ज झ | જ ઝ | ଜ ଝ |
| జా ఝా | ஜா | ಜಾ ಝಾ | ജാ ഝാ | जा झा | જા ઝા | ଜା ଝା |
| జి ఝి | ஜி | ಜಿ ಝಿ | ജി ഝി | जि झि | જિ ઝિ | ଜି ଝି |
| జీ ఝీ | ஜீ | ಜೀ ಝೀ | ജീ ഝീ | जी झी | જી ઝી | ଜୀ ଝୀ |
| జు ఝు | ஜு | ಜು ಝು | ജു ഝു | जु झु | જુ ઝુ | ଜୁ ଝୁ |
| జూ ఝూ | ஜூ | ಜೂ ಝೂ | ജൂ ഝൂ | जू झू | જૂ ઝૂ | ଜୂ ଝୂ |
| జృ ఝృ | — | ಜೃ ಝೃ | ജൃ — | जृ झृ | જૃ ઝૃ | ଜୃ ଝୃ |
| జౄ ఝౄ | — | — — | — — | — — | — — | — — |
| జె ఝె | ஜெ | ಜೆ ಝೆ | ജെ ഝെ | — — | — — | — — |
| జే ఝే | ஜே | ಜೇ ಝೇ | ജേ ഝേ | जे झे | જે ઝે | ଜେ ଝେ |
| జై ఝై | ஜை | ಜೈ ಝೈ | ജൈ ഝൈ | जै झै | જૈ ઝૈ | ଜୈ ଝୈ |
| జొ ఝొ | ஜொ | ಜೊ ಝೊ | ജൊ ഝൊ | — — | — — | — — |
| జో ఝో | ஜோ | ಜೋ ಝೋ | ജോ ഝോ | जो झो | જો ઝો | ଜୋ ଝୋ |
| జౌ ఝౌ | ஜௌ | ಜೌ ಝೌ | ജൗ ഝൗ | जौ झौ | જૌ ઝૌ | ଜୌ ଝୌ |
| జం ఝం | ஜ் | ಜಂ ಝಂ | ജം ഝം | जं झं | જં ઝં | ଜଂ ଝଂ |
| జః ఝః | — | ಜಃ ಝಃ | ജഃ ഝഃ | जः झः | જઃ ઝઃ | ଜଃ ଝଃ |

* తమిళంలో మన జ, ఝ లకు-ఒకే అక్షరం (ஜ) వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

సశేష నవల

# కృష్ణవేణి

విమలారామం



"ఇంతకాలం ఈ యిల్లు వదిలి వెళ్ళి విడిగా వుండవల్సి వస్తుందన్న ఆలోచనే నాకు రాలేదు!.... తల్చుకుంటేనే భయంగా వుంది!"

"ఇంకా నీకు భయమెందుకు....అంతా మారి మంచిదారిని పడ్డారు కదా!"

ఇక్కడింకా మారని వ్యక్తి వున్నాడు - ఇంటి పరిస్థితి ఏమీ బాగా లేదని చెప్పి ఆ మధురక్షణాలు చేదుగా మార్చుకోవటానికి యిష్టపడలేదు మాధవి. ఎన్నో రోజుల తర్వాత కలిసిన భర్తకు సుఖ సంతోషాలందజేయటమే తన విధి అని మాట మార్చి వేసింది.

సరిగ్గా అదే సమయంలో పెద్దకొడుకు ఆనాటి మధ్యాహ్నం కోరిన కోరిక గురించి భర్తతో మాట్లాడుతోంది సుభద్రమ్మ. తల్లిదండ్రుల్ని తన వద్దకి వచ్చి వుండమని మొదట మురళీమోహన్ ప్రస్తావన ఎత్తాడు. వాళ్ళను తనతో తీసుకువెడదామనుకుంటున్నానని- ఇన్నాళ్ళుగా తను చేసిన తప్పు సవరించుకొనే అవకాశం తనకిమ్మని - ఎంతో ప్రాథేయపడుతూ చెప్పాడు కృష్ణారావు.

"మనం పెద్దాడి దగ్గరికి వెళితేనే బావుంటుందనుకుంటున్నాను" అంది సుభద్రమ్మ.

"పెద్దాడు చిన్నాడు ఒకచోటే వున్నారు కనుక వాడి దగ్గరో కొన్నాళ్ళు, వీడి దగ్గరో కొన్నాళ్ళు వుండచ్చు. కాని, మనం వెళ్ళటానికి విశ్వం ఒప్పుకుంటాడా అని!" అన్నారు సత్యనారాయణగారు.

"వాడిప్పుడీ లోకంలో వుంటేకదా మనమాట గురించి ఆలోచించటానికి!" అంది ఆమె నిస్పృహగా.

"వాడు కాకపోతే కృష్ణ....ఇంతకాలం మనల్ని కన్న తల్లిదండ్రుల కన్న ఎక్కువగా అభిమానించి సేవ చేసింది....కృష్ణ ఒప్పుకోకుండా వెళ్ళిపోవటం మనకి ధర్మంకాదు. ఐనా, ఒక్కసారిగా మాధవీ మనమూ కూడ వెళ్ళిపోతే బాధపడుతుంది. పోనీ, నువ్వెళ్ళు....నేను మరి కొన్నాళ్ళుండి వస్తాను...."

భర్త మనసులో ఏమనుకుంటున్నాడో గ్రహించింది సుభద్రమ్మ. "మీకిదివరకున్నంత శక్తి వుందనుకుంటున్నారా? మీరిలా పని చేసి చేసి ఏదయినా తెచ్చుకుంటే కృష్ణకింకా బాధ పెరుగుతుందే కాని ప్రయోజనమేమీ వుండదు...."

"ఏమయినా, మనమంతా కల్సి ఒక్కసారిగా వెళ్ళిపోవటం నాకు సుతరామూ యిష్టంలేదు.... నువ్వు వాళ్ళతో వెళ్ళు. నేను తర్వాత నెమ్మదిగా వస్తాను."

ఆ రాత్రి తమ గదిలో బావగారి కుటుంబానికి పక్కలేర్పాటు చేసింది కృష్ణవేణి. తన మూలంగా తమ్ముడు విశ్వనాథం జీవితం ఎంత కష్టాలు పాలయిందో భార్యతో చెప్తున్నాడు కృష్ణారావు. "వాడూ నాలా చదువుకునుంటే పెద్ద ఉద్యోగం లోనే వుండేవాడు. నాకు శక్తి వుండి కూడా బాధ్యతలు వదులుకుపోయాను. వాడు శక్తికి మించి శ్రమపడ్డాడు. ఈ వేళ మురళి పెద్ద ఆఫీసరయ్యాడంటే వాడి చలవే! నావల్ల వాడికెంతో అపకారం జరిగింది. అయినా, పల్లెత్తుమాటన్నాడా? వాడి ముందు నిలబడే అర్హత కూడా నాకు లేదు...."

భర్తనెలా ఓదార్చాలో జానకికి తెలియలేదు.

"వాడే కాదు. వాడి భార్యను చూడు....ఎంత ఆప్యాయత! ఎంత ఆదరణ!"

"మీరు స్వయంగా బావగారు. మిమ్మల్ని ఆదరించటంలో వింతేముందండీ! ఈ రోజు ప్రొద్దుటి వరకు ముఖమయినా చూడని నాతో అదే ప్రేమతో మాట్లాడింది. వాళ్ళు మామూలు మనుషులు కారు. దేవతలు!...."

అదే సమయంలో తన గురించి ఎంతో వున్నతంగా చెప్పుకుంటున్న వాళ్ళ గురించి దొడ్లో భార్య ప్రక్కన నిలబడి ఎంతో నీచంగా మాట్లాడుతున్నాడు విశ్వనాథం. అన్నగారు కులసంకరం చేసాడుట. కొంపకూల్చి వెళ్ళాడుట. 'ఇప్పుడు ఏ ముఖం పెట్టుకొని వచ్చారు? సిగ్గు అభిమానాలన్నవి లేవా?....' భర్త పరుషవచనాలను నిర్ఘాంతపోయి వింటోంది కృష్ణవేణి. ఇంతకాలం తన పేకాట వ్యసనాన్ని సమర్థించుకుంటూ అతనునోటికి వచ్చినట్టు మాట్లాడటం మాత్రమే ఆమె వింది. కాని యిప్పుడు అతని మాటలు ఎంతో సంస్కార హీనంగా, అనాగరికంగా కూడా వున్నాయి.

"....ఇన్నాళ్ళు రెక్కలు ముక్కలు చేసుకు చచ్చాను. అందుకు నేను పనికిమాలిన వెధవనా?... ఏ బాధ్యతలూ పట్టకుండాపోయారు వాళ్ళు నెత్తిమీది దేవతలా?...."

"మిమ్మల్నెవరూ తక్కువచేసి మాట్లాడలేదు. రాకరాక వచ్చినవాళ్ళని ఆదరించారంతే! పశ్చాత్తాపంతో క్షమించమంటున్నవాళ్ళని ఆదరించక నిందించమంటారా?...."

కృష్ణవేణి అనునయమైన మాటలు వినటం అతనెప్పుడో మానుకున్నాడు. అందరి మీది కోపాన్ని ఆమె మీద ప్రదర్శించాడు. "....లేదు అడ్డమయినవాళ్ళనీ అక్కయ్యా అంటూ నిన్ను కావలించుకోమంటాను."

ఆ క్షణంలో భర్తని అసహ్యించుకోకుండా వుండలేక పోయింది కృష్ణవేణి. ఈమాత్రానికే యింత గొంతు చించుకుంటున్నవాడు....తల్లిదండ్రుల్ని హైదరాబాదు తీసుకువెడదామని అన్నదమ్ములు అనుకుంటున్న విషయం చెపితే మరింత రెచ్చిపోతాడేమో!....ఆ భయంతోనే "మన మాటలు వింటే ఎవరయినా బాధపడతారు కూడా!...." అంటూ కదిలి లోపలికి వెళ్ళిపోబోయింది.

"నీకు నీ మొగుడి బాధక్కర్లేదే! లోకంలో అందరి బాధలూ కావాలి" అని బూతులు తిడుతూ భార్య జుట్టు పట్టుకొని గుంజుతూ లెంపలు వాయించాడు విశ్వనాథం. భార్య మళ్ళీ మూర్ఛ వచ్చి పడిపోతుందేమో నన్న స్పృహ అతనికి లేకపోయింది కాని, తను కళ్ళుతిరిగి పడిపోతే అతని పరువెక్కడ పోతుందోనని సర్వ శక్తులూ కూడదీసుకొని నిలద్రొక్కుకుంటోంది కృష్ణవేణి.

అప్పుడామె పడిన హింస చూసి భరించలేనట్టు చెట్టు మీద కునుకుతీస్తున్న పిట్టొకటి కంగారుగా పొరుగింటి దొడ్డివైపు ఎగిరిపోయింది. ఆమె పెదవుల కొసల్లోకి చిందిన రక్తపుబొట్టు చూడలేక మరింత ఎర్రబడిన గులాబిమొగ్గ మరోవైపు తల త్రిప్పుకుంది. ఆమె గుండెల్లో పేరుకున్న చీకటిని చూడలేక కళ్ళముందున్న చీకటి మరింత చిక్కనయిపోయింది!

## 64

రెండు రోజులు గడిచాక కృష్ణారావు, మురళీమోహన్‌లు ప్రయాణమయ్యారు.

పెద్దకొడుకు కోరిక మన్నించాలన్న ఆత్రుత కన్నా-కోడలు 'కృష్ణవేణి' భారం తగ్గించాలన్న తపనతో తనూ ప్రయాణమైంది సుభద్రమ్మ. 'నిన్ను వదిలి వెళ్ళాలని నాకసలు లేనేలేదు' అని మనసులోని మాట పైకి అంటే కోడలెక్కడ ప్రాథేయపడి వుండిపొమ్మంటుందో నన్న భయంతో- "వాళ్ళ దగ్గర కొన్నాళ్ళపాటు వుండి వద్దామనుకుంటున్నానమ్మా!" అంది.

"అలాగే అత్తయ్యా!....మీ అబ్బాయితో చెప్పండి." అంది కృష్ణవేణి తల దించుకొని.

తల్లి అడిగినదానికి "....మీ యిష్టం!" అని పొడిగా జవాబిచ్చాడు విశ్వనాథం. అంతకుమించి మరోలా మాట్లాడతాడని ఆమె అనుకోలేదు కూడా.

మనసారా భర్త ఎవరితోను మాట్లాడలేదన్న బాధకన్న ఎవర్ని ఏ మాటలని నొప్పిస్తాడో అన్న భయంతో గడిపింది కృష్ణవేణి. అతను మౌనంగా వుండటమే ఆమెకు సుగుణమనిపించింది.

దిగులుగా కూర్చున్న మాధవి దగ్గరికి వచ్చింది కృష్ణవేణి. చెల్లెలి ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుంది. "ఇంకెంత? మూడు నెలలు. పండంటి బాబునెత్తుకుంటావు! నిన్ను చూడ్డానికి రెక్కలు కట్టుకువస్తాను!"- అని పెద్దగా నవ్వింది. ఎంత

ఆపుకున్నా ఆమె కళ్ళల్లోకి నీళ్ళు పొంగివస్తూనే వున్నాయి.

''నిన్ను వదిలి ఎలా వుండగలనో నాకు తెలియటం లేదు'' అంది మాధవి బొంగురు గొంతుతో.

''నువ్విలా బాధపడకూడదని చెప్పానా లేదా? నా మాట వినవా?''

''నువ్వొక్కదానివీ'' దుఃఖంతో ఆమెకు పైమాట రాకపోయినా కృష్ణవేణి గ్రహించింది. ''నాకేమీ భయం లేదు. మామగారున్నారు.... ఇంక నా సమస్యంటావా? అది కాలమే పరిష్కరించాలి! బాధపడి మనం చెయ్యగలిగింది ఏమీ లేదు.''

మురళీమోహన్ గదిలోకి రావటంతో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

రిక్షాలు వచ్చాయి. సామాన్లు ఎక్కించటమయింది. వెళ్ళే పిల్లల పక్కన ఉండిపోయే పిల్లలు కూడా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. మూడు రోజుల వాళ్ళ అనుబంధం వాళ్ళనెంతో బలంగా కట్టివేసింది. మరి కొన్ని క్షణాల్లో విడిపోతామన్న బాధ వాళ్ళకింకా మొదలవలేదు.

పెద్దవాళ్ళు అప్పగింతలు చెప్పుకుంటున్నారు కన్నీళ్ళుపెట్టుకుంటున్నారు. మాటలు రాక చూపులతోనే వీడ్కోలు తీసుకుంటున్నారు.

ఈ సందడిలో విశ్వనాథం ఎప్పుడు బయిటకి వెళ్ళిపోయాడో కృష్ణవేణి గుర్తించనేలేదు.

ఇంట్లోకి వచ్చి తలుపులు వేసుకుంది. ఇల్లంతా కలయజూసింది. బావురుమంటూ నిశ్శబ్దంగా వుంది. ఆమె తన ప్రాణాలన్నీ ఎవరో పట్టి లాక్కుపోయినట్లు నిస్త్రాణ పడిపోయింది. తానొంటరిదయిపోయిందనుకునేసరికి గుండెలు దడదడలాడాయి. ఒక్కసారిగా మంచం మీదకి విరుచుకుపడిపోయి పెద్ద పెట్టున ఏడువసాగింది.

ఎంతోకాలంగా ఆమె కన్నీరు వరదలై పారుతున్నా....ఎవరు చూసి నొచ్చుకుంటారోనని తనలో తను కుమిలిపోతూ రహస్యంగా ఏడ్చేది. ఇప్పుడు ఎవరూ చూడకుండా తనివితీరా ఏడువగలుగుతోంది. ఇన్నేళ్ళ తర్వాత ఆమెకు దొరికిన స్వేచ్ఛ అదొక్కటే!

## 65

నిర్మల వ్రాసిన నవల అచ్చయిపోయిందని కాంప్లిమెంటరీ కాపీలు త్వరలోనే పంపుతామని - విజయవాడ నుంచి ఉత్తరం వ్రాసాడు పబ్లిషర్ రంగారావు. వెంటనే యీ వార్త ఆమెకు చెపుదామనుకున్నాడు రామచంద్రం. కాని, నవల చివర ఎఫెక్ట్ కోసం మార్పు చేస్తే బావుంటుందనిపించి తానే ఆ పని చేసానని ఈ మార్పు చేసినందుకు మరోలా భావించవద్దని, ఆమెది మొదటి నవలే అయినా పాఠకుల మన్ననలందుకుంటుందని రంగారావు వ్రాసాడు. ఆ మార్పేమిటో చూడకుండ నిర్మలకి సంగతి ముందు చెప్పటం ఎందుకని అప్పటికి వూరుకున్నాడు రామచంద్రం.

మరో రెండు వారాలకి అచ్చయిన నవల కాపీలు వచ్చాయి. అవి వచ్చినప్పుడు రామచంద్రం యింట్లో లేడు. రాఘవరావు రిజిష్టర్డు పార్సిలు తీసుకున్నాడు. అదేమిటో సుజాత చెప్పింది. ''వెంటనే, నిర్మల దగ్గరకి వెళ్ళి చూపించి రానా!'' అని కోడల్ని అడిగాడు రాఘవరావు.

''ఆయన వచ్చి చూసేదాకా ఈ సంగతి నిర్మలకి చెప్పవద్దన్నారు.'' అంది సుజాత.

కుతూహలంకొద్దీ ఓ నవల ప్రతి తీసి వెంటనే చదవటం ప్రారంభించాడు రాఘవరావు.... ఆ తర్వాత కాలమెంత గడిచిందో కూడ అతనికి స్పృహలేకపోయింది. సగం నవల చదివేసరికి నిర్మల ఎవరి మీద ఈ కథ సృష్టించి వ్రాసిందో అతనికి అర్థమైపోయింది....విషయం తెలిసేసరికి అతని ప్రాణాలు గిలగిలలాడాయి.

ఇంటికి వస్తూనే తండ్రి చేతిలోని నిర్మల నవలని చూసాడు రామచంద్రం. ''చదివారేమిటి నాన్నా!'' అంటూ నవ్వుతూ ఆ నవలని చేతిలోకి తీసుకున్నాడు. రాఘవరావు మాట్లాడలేదు.

రామచంద్రం గబగబా నవల వెనక పేజీలు త్రిప్పాడు....అతనికా కథంతా క్షుణ్ణంగా తెల్సినదే! ఎక్కడ పబ్లిషరు మార్పులు చేసాడో వెంటనే గుర్తు పట్టాడు. మంచినీళ్ళు తెచ్చిచ్చిన భార్య వైపు చూసి నవ్వుతూ ''....చివర చూసావా?'' అని అడిగాడు.

సుజాత తల వూపి ''నిర్మల మీభరతం పడుతుంది.'' అని నవ్వింది.

''బావుంది. నవల చివర ట్రాజడీ చేయమని నేను రంగారావుతో చెప్పలేదు. అతనే చేసాడు. కావాలంటే అతను వ్రాసిన ఉత్తరం సాక్ష్యం వుంది!''

''ఈ నవలంతా నువ్వు చదివావా రామం!'' అని కొడుకుని అడిగాడు రాఘవరావు గంభీర కంఠంతో.

''చదవటమేమిటి మామయ్యా! ప్రతి చాప్టరు చర్చచేస్తే కాని నిర్మలని ముందు చాప్టరుకి వెళ్ళనిచ్చేవారు కాదు! పాపం, ఎంతో కష్టపడి వ్రాసింది. నవల ట్రాజడీ చేయనని ఈయనతో ఎంత దెబ్బలాడిందని!....ఇలా కావటం నాకూ బాధగానే వుందండి!'' అంది సుజాత.

''ఈ నవల వ్రాసి నిర్మల చాలా పొరపాటు చేసింది....'' అన్నాడు రాఘవరావు ఉస్సురుమంటూ.

''ఏమిటి నాన్నా మీరనేది?'' రామచంద్రం ఆశ్చర్యపోతూ అడిగాడు.

ఇక నిగ్రహించుకోలేకపోయాడు రాఘవరావు. ''ఇది ఎవరి కథ అనుకుంటున్నావురా!....కృష్ణవేణి కథ!....'' అని తల మొత్తుకుంటూ తనకు తెల్సినదంతా చెప్పుకు వచ్చాడు.

సుజాతా రామచంద్రాలకి అఘాతం తగిలినట్టయింది. ఆ నవల వ్రాసేటప్పుడు నిర్మల ఎంత బాధపడిందో ఊహకు అందేసరికి వాళ్ళ ప్రాణాలు పట్టి పిండినట్టయింది. నవల విషాదాంతం కావటానికి వీల్లేదని నిర్మల ఎంతగా వాదించిందో కూడా వాళ్ళకి అర్థమయింది.

మళ్ళీ నవల మొదటిపేజీ తీసి చదివాడు రామచంద్రం. 'అమృతమూర్తి 'కృష్ణవేణి' వదినకు-ప్రేమతో నిర్మల '—అని ఉంది.

''నా మొదటి నవల వదినకే అంకితమిస్తానన్నాను.'' అన్నది నిర్మల నవల పంపేటప్పుడు. కాని, ఆ నవలే వదిన మీద వ్రాసిందని ఇంతవరకు తమకి తెలియదు. ఇప్పుడీ నవల పట్టుకువెళ్ళి నిర్మలకి ఇవ్వాలంటే ధైర్యం చాలలేదు రామచంద్రానికి.

''అంతా కల్పుకున్న ఆనందంలో ఉన్నారు వాళ్ళు. ఇప్పుడీ సంగతి నిర్మలకి చెప్పటం మంచిది కాదు!'' అన్నాడు.

''నిర్మలకే కాదు. మధూకి కూడా తెలియనివ్వద్దు. ఈ పుస్తకాలన్నీ ఎక్కడేనా దాచిపెట్టండి!'' అన్నాడు రాఘవరావు.

అదే సమయంలో ఇదేమీ యెరుగని నిర్మల కృష్ణవేణి గురించి మాధవి చెప్పే కమ్మని కబుర్లు వింటూ ఆనంద సాగరంలో ఓలలాడుతోంది.

ఆ తర్వాత ''నా నవల స్పీడుగా అచ్చేయించి పంపిస్తామన్నారు మీ ఫ్రెండు. ఏవండీ బావగారూ?'' అని రెండు మూడు సార్లు పరిహాసం చేసింది




## వీరకేసరి

(నవల)

**[రచన : మాదిరెడ్డి సులోచన; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల: 3-50; పేజీలు : 147]**

ఒక చెయ్యి తిరిగిన రచయిత్రి రచించిన జానపద నవల ఇది. అయితే తెలుగు సినిమాలా ఉంది. గ్రాంథిక భాష మీద ఏమాత్రం అధిపత్యం లేకుండా చేసిన ఈ ప్రయోగం హాయిగా చదువుకు పోవడానికి కూడా అడ్డు పడింది.

వివాహిత అయిన ఉదయసుందరి అజ్ఞాత వీరుడైన వీరకేసరిని ఆరాధించడం తప్ప ఏ మాత్రం కొత్తదనం ఈ పుస్తకంలో లేదు. ఒక డిటెక్టివ్ నవల, పాతకాలపు జానపద నవల, ఈనాటి అసందర్భపు ప్రేమ కథ, మూడూ కలగా పులగం చేసి రచించిన నవలా ప్రయోగం....పబ్లిషర్స్ అన్నట్లు "మాదిరెడ్డి జానపద సాహసం". చదివించగల నేర్పు ఉన్న ఈ రచయిత్రి భాషా ప్రయోగంతో ఈ నవలను సాగనీయకుండా చేశారు.

"ఈ దినము నుండి తాను పరాధీన....పెద్దల కనువిందుకై తమ వివాహము పనితనమునందే చేయనేల? తనకు కోరికలు, అభిరుచులు ఉన్నాయి." ఈ రకంగా భాషతో జరిగిన స్టంటు చాలా ఉంది.

ఏదో చెప్పాలని తపన ఉండి, చదివించగల నేర్పు ఉండి, అనుభవమున్న మాదిరెడ్డి లాంటి ప్రముఖ రచయిత్రులు ఇటువంటి వింత ప్రయోగాల జోలికి పోక, సూటిగా, అందంగా మంచి సమస్యలు తీసుకుని పరిష్కార మార్గాలు వెతికి చెపితే ఈ సాహిత్యపు వంట, వార్పు తగ్గుతాయి.

## పడుచుదనం రైలుబండి

(నవల)

**[రచన పి. సత్యవతి; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో; మద్రాసు-1; వెల: 3-50; పేజీలు: 136]**

ఈ నవలలో చాలా వాస్తవికత ఉంది. మంచి రచయిత్రికి కావలసిన 'అబ్సర్వేషన్' సత్యవతి గారిలో ఉంది.

ఆ అమ్మాయి-పెళ్ళి గురించి ఎప్పుడూ కలలు కనలేదు. మాయని చిరగని శుభ్రమైన బట్టలు, ఆకలి కాగానే తినడానికి భోజనం, పడుకోడానికి శుభ్రమైన పక్క. తగాదాలు అరుపులూ లేని బ్రతుకూ ఇవి ఎలా వస్తాయి?

"తలక్రింద మంచి గలీబున్న ఓ దిండు, కప్పుకోడానికి చిరుగుల్లేని దుప్పటి, మురికి లేని రెండు చీరెలు, ఇవి ఎప్పటికి? ఎన్నాళ్ళకి? ఇంకెన్నాళ్ళకి........"

ఇది ఒక మధ్య తరగతి ఆడపిల్ల ఆశల తోరణాలు కట్టుకోకుండా కనీసం తలుపులున్న చిన్న కుటీరం కావాలని కోరుకునే కథ. ఇందులో పాత్రలకు సజీవత్వం ఉంది. ఇందులోని మోహనరావులు ఆర్థిక వలయంలో చిక్కుకున్న ప్రతి ఆడపిల్ల జీవితంలోనూ తటస్థపడతారు. ఇది ఒక జవాబు లేని ప్రశ్న. అర్థంలేని రంగు వెలిసిపోయిన కాగితం పూలలాంటి జీవితాలు, ట్రెడిషన్, సెంటిమెంట్సూ కూడా లేకుండా జీవితంతో పోరాడుతూ మేమూ మనుష్యులమే అని జీవన ప్రవాహంలో మునిగిపోతూ తలెత్తి చూసే జీవాలు ఇవి. చదివించే నేర్పు, చెప్పే సబ్జెక్ట్‌లో సిన్సియారిటీ ఉన్న ఈ రచయిత్రి మరింత కృషితో మంచి రచయిత్రి అవుతారు.

నిర్మల. వస్తుంది వస్తుందని నవ్వి మాట మార్చి వేసాడేకాని రామచంద్రం నిజం చెప్పలేదు.

నవల వస్తే స్వయంగా వదినగారికి పట్టుకువెళ్ళి చూపించాలని అనుకుంటోంది ఆమె. అసలు తనకు జ్వరం తగ్గిన వెంటనే వెళ్ళి చూద్దామనుకుంది. కాని, వూర్నించి తల్లి, చిన్నవదిన రావటంతో కృష్ణవేణిని చూసినంత తృప్తి అనుభవించింది. ఆ తర్వాత మురళీమోహన్ సంసారం పెట్టుకోవటం, ఒప్పలేని వదినకి సాయంగా తాను వెళ్ళటం జరిగింది.

ఏడోనెల వచ్చిందని రాఘవరావు సూడిద లిప్పించి కూతుర్ని పురిటికి తీసుకువెళ్ళాడు. నిర్మల ఇక తమవూరు వెడదామనుకుంటుండగా శలవు లయిపోతున్నాయని తిరిగి వచ్చాడు రవి. "ఇప్పుడు నువ్వు వెళ్ళటం కన్న వదినకి కొంచెం డబ్బు పంపటం మంచిదక్కా!" అన్నాడు.

వివరాలు చెప్పమని తరచితరచి తమ్ముడ్ని అడిగింది నిర్మల.

"అప్పుడెప్పుడో శ్రీకాంత్ బావదగ్గర వదిన అప్పు తీసుకుందిగా! ఆ డబ్బు ఇంకా యివ్వలేదట! పదిహేను రోజుల క్రితం బావొచ్చి నిష్టురంగా మాట్లాడాడు....ఈ నెలలో చిన్నన్నయ్య, నువ్వు పంపిన డబ్బు అలా పంపేసింది! ఆ మనియార్డరు నేనే కట్టి వచ్చాను!...." అన్నాడు.

తన కోరిక చంపుకొని మళ్ళీ తన ప్రయాణానికి వాయిదా వేసుకొని మరికొంత డబ్బు వదినగారికి పంపింది నిర్మల. ఆ తర్వాత యింటిపని, ఆఫీసు పని, మధ్యమధ్య చిన్న వదినగార్ని చూసివచ్చేపని, పెద్దన్నగారింట్లో వున్న తల్లిని పలకరించి వచ్చేపని వీటిలో తన స్వవిషయాలు ఆలోచించే తీరికే లేక పోయింది ఆమెకు.

ఎటొచ్చీ ఆమె మనస్సులోని బాధ తగ్గిస్తూ తరచు కృష్ణవేణి నుంచి ఉత్తరాలు వస్తున్నాయి. ఆ ఉత్తరాలలో ఎన్నో ప్రియాలాపాలుంటున్నాయి. పరిస్థితులు కొంచెం మెరుగుపడటం మూలానే ఆమె అంత సంతోషంగా ఉత్తరాలు వ్రాస్తోందని నిర్మల భావించింది.

## 66

ఋతువులు మారుతున్నాయి. ప్రకృతి మారుతోంది.

కాలంతోపాటు మనుషులు మారుతున్నారు.... ఒకప్పుడు పిచ్చిగా లాటరీ టిక్కట్లు కొన్న సత్యనారాయణగారు ఇప్పుడెవరయినా వాటి గురించి మాట్లాడితే కసురుకుంటాడు. పదిహేడేళ్ళపాటు నిర్దాక్షిణ్యంగా తల్లిదండ్రుల్ని బాధ పెట్టిన కృష్ణారావు-ఇప్పుడు కుటుంబ భారాన్ని ఎంతయినా మోయటానికి సిద్ధపడుతున్నాడు. విడుదలయి రాగానే తనకెవరయినా ఉద్యోగం ఇచ్చినా ఇవ్వక పోయినా తన కాళ్ళమీద తను నిలబడాలని జైల్లోనే టెయిలరింగ్ పని నేర్చుకుంటున్నాడు సుబ్బారావు. ఓ వైపు స్కూలుకి వెడుతూ ఇంట్లో వున్నంత సేపు జానకి చేతిలో పని అంది పుచ్చుకుంటోంది పార్వతి....

వాళ్ళంతట వాళ్ళు మారి మంచి దారిని ప్రయాణం

# ఆ అందం చిందే వాలుకళ్ళు




మిలమిలలాడే, సొగసులు చిందే ముగ్ధమనోహరమైన ఆ కళ్ళు. మీ కళ్ళనూ అంత అందంగా తీర్చిదిద్దుకోవచ్చు. ఎలాగంటే

**శింగార్ డీలక్స్ కాటుక (కాజల్) అందించే సహజమైన రూపంతో**

ఈ కాటుకను కళ్ళలోపల, పైరెప్పకూ, కింది రెప్పకూ, కనుకొలకులలో రాసుకుని చూడండి. దీనితో మీ కళ్ళలో తొణికిసలాడతాయి లక్షలాది భావాలు, భాషలు.

మరొక మాట! శింగార్ డీలక్స్ కాటుక శుద్ధమైన మూల పదార్థాలతో తయారుచేయ బడింది. ఆరోగ్యమైన తీరులో ప్యాక్ చేయబడుతుంది.

**శింగార్**
డీలక్స్ కాటుక
(కాజల్)

**మీ కళ్ళకు మేలైనది, అందంగా తీర్చిదిద్దుకునేందుకు సాటిలేనిది.**

everest/78/SH/326 t

చేస్తున్నారు. బాధ్యతలు పంచుకోవటంలోని పరిపూర్ణమైన ఆనందాన్ని సంతృప్తిని అనుభవిస్తున్నారు! కాని, మాసాలు గడిచి సంవత్సరాలలోకి అడుగు పెడుతున్న విశ్వనాథం మాత్రం మారటం లేదు....కృష్ణవేణి దయనీయ స్థితికి మార్పంటూ కనిపించటం లేదు.

మనిషి స్వార్థానికి తరుగుదల ఉండచ్చు.... అంతమంటూ ఉండవచ్చు. మనిషికి వ్యసనం ముదిరితే పతనమే కాని మంచి వైపు మార్పంటూ ఉండదు.

మార్పంటూ ఉంటే అతనింక బాగుపడినంతగా పాడయిపోవటం వరకే.... ఆమె కన్నీళ్ళింకి పోయేంతవరకు దుఃఖించటం వరకే వెళ్ళింది!

ఆమె బ్రతిమాలటం – ప్రార్థించటం – అర్థం చెప్పటం అవన్నీ ఎన్నడో నిష్ప్రయోజనాలయి నాయి. అతను మరచిన బాధ్యతలు గుర్తు చేయటం-ఆమె అపరాధమని అతను భావించేవరకు వెళ్ళింది. అహోరాత్రాలు అతన్నెలా దారికి తీసుకు రావాలా అని ఆమె ఆలోచించి విసిగి వేసారి పోయింది. ఆమె చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయినాయి.

కొంతకాలంగా నోట్లు వ్రాసి అప్పు తెచ్చి పేకాట ఆడేవాడు. ఇక అప్పు పుట్టటం లేదు కాబోలు... ఇప్పుడు లంచాలు కూడా పుచ్చుకుంటున్నాడట – – ఓ రోజున అతని కొలీగ్ పురుషోత్తం వచ్చి చెప్ప లేక చెప్పలేక చెప్పాడు!

కృష్ణవేణి తల మీద పిడుగులు పడినట్టయింది.

"ఇన్నాళ్ళుగా ఎలా చెప్పాలా అని సందేహించాను. ఎవరూ చెప్పకపోతే ఇంకా పాడయి పోతాడు. రేపు పట్టుపడితే మొదటికే మోసం వస్తుంది...." అని బాధపడుతూ వెళ్ళిపోయాడతను.

ఆ ప్రస్తావన భర్త దగ్గర ఎత్తినందుకు ఆమెకు లభించిన బహుమతి మళ్ళీ చెంప దెబ్బలు!....ఈ సంగతి చెప్పితే మామగార్ని బాధ పెట్టటం తప్ప మరేం కాదు. ఆయన మాట ఇతను గౌరవిస్తాడన్న నమ్మకం లేక నోరు మూసుకునుండిపోయింది.

నిర్మల తన నవలలో చిత్రించిన తన కథానాయికి కన్న ఎక్కువ చిత్ర హింసలను అనుభవిస్తోంది కృష్ణవేణి!

కోడలి శ్రమ తగ్గించటం కోసం సాయంత్రం చీకటి పడేదాకా లాయరుగారి దగ్గర పని చేస్తున్నాడు సత్యనారాయణగారు .... కాని, ఆయనకి తెలియకుండా ఇంకెన్నో అవస్థలు పడుతోంది ఆమె.

ఒకనాడు పేకాటకి డబ్బు దొరక్క భార్య పీక మీదకి వచ్చి కూర్చున్నాడు విశ్వనాథం. ముఖం తప్పించుకుని డబ్బు లేదంది కృష్ణవేణి.

"మా మరిది పంపిస్తున్నాడు. మా మరదలు పంపిస్తోంది. మా మామగారు తెచ్చిస్తున్నారు.... నీ దగ్గర కాకపోతే నా దగ్గరుంటుందేమిటి?" అన్నాడు వ్యంగ్యంగా.

అతని ముఖం చూసి ఇంతకాలం ఇతనితోనేనా తను సంసారం చేసింది – అని ఆశ్చర్యపోయింది కృష్ణవేణి.

'ఏం మాట్లాడవేం?" అని విసుక్కున్నాడతను.

అప్పటికీ "ఉందేమో చూస్తాను. ముందన్నం తినండి...." అంది సాధ్యమయినంత మార్దవ స్వరంతో.

అతను వినిపించుకునే స్థితిలో లేడు. "తర్వాత వచ్చి తింటాను. ముందు వెళ్ళాలి. ఓ పది రూపాయి లియ్యి."

అతని మంకు పట్టునిక భరించలేకపోయింది ఆమె. "వాళ్ళిస్తున్నారన్నారు. ఆడబ్బంతా అప్పులు తీర్చటానికే సరిపోయాయి. నా దగ్గరేం మిగల్లేదు."

"మరి నా జీతం?"

సగం జీతమయినా యివ్వని మనిషి ఆ మాట అడగటానికి కనీసం సిగ్గయినా పడటం లేదు. స్పృహతో "మీ జీతం ఎంతిస్తున్నారో మీరెప్పుడయినా లెక్క పెట్టుకుంటున్నారా? పోనీ, పట్టుకు వెళ్ళింది లెక్క పెట్టుకుంటున్నారా?" అని అడిగింది.

"లెక్కలు బాగానే రాసుకుంటున్నావుగా; అవన్నీ నీకే బాగా తెలియాలి."

"అయితే వినండి. మీరిచ్చిందానికన్నా పట్టుకు వెళ్ళిందే ఎక్కువ. ఇక మీ డబ్బేం లేదు నా దగ్గర నుంచి యివ్వటానికి!"

విశ్వనాథానికి షాక్ తగిలినట్టయింది. ఆమె అలా ఎదిరించి మాట్లాడటం అదే మొదటిసారి! దేనికయినా ఒక హద్దుంటుంది. అది తను అధిక మించానని అతను గ్రహించలేదు. "యేమిటే వాగుతున్నావ్? నా డబ్బులేదా? మరెవడిచ్చిన డబ్బుంది?" అంటూ మీదకి దూసుకువచ్చాడు.

అన్నేళ్ళ ఆమె సహనం ఆక్షణంలో హరించి పోయింది. "నేను నా బిడ్డలకింత తిండి పెట్టుకుందామని రెక్కలు ముక్కలు చేసుకొని సంపాదించిన డబ్బుంది. అది మీరివ్వమన్నా యివ్వను."

"రెక్కలు ముక్కలు చేసుకుంటున్నావా? ఒళ్ళమ్ముకుంటున్నావా?" అన్నాడు వెటకారంగా.

అతనంత నీచంగా మాట్లాడేస్థితికి దిగజారి పోయేసరికి కోపావేశాలతో గజగజ వణికిపోయింది కృష్ణవేణి. "అవును. ఒళ్ళమ్ముకోటానికి మీరను కునే అర్థమేమిటో నాకు తెలియదుకాని, నా పిల్లల్ని పస్తుపడుకోపెట్టలేక నా వొంట్లో శక్తి నమ్ముకుంటున్నానండీ! ఎవరెవరివో బట్టలు తెచ్చుకొని కుట్టుకుంటున్నానండీ!" అని అరిచింది. విసురుగా లోపలి గదిలోకి వెళ్ళి కుడుతూకుడుతున్న బట్టలన్నీ తెచ్చి అతనిముందు గుమ్మరించింది. "చూడండి." అని హుంకరించింది.

మళ్ళీ ఆమె బట్టలు కుట్టటం మొదలు పెట్టిందని ఆ క్షణం వరకు అతనికి తెలియదు. గతంలో జరిగిన సంఘటన గుర్తుకువచ్చి అఘాతం తిన్నట్టు నిలబడిపోయాడు.

కృష్ణవేణి యింకా ఆవేశపడుతూనే ఉంది. "మీరింటి సంగతి పట్టించుకుంటే తెలిసేది నేనెలా అవస్థలు పడుతున్నానో!"

విశ్వనాథం అహం దెబ్బతింది. మళ్ళీ రెచ్చి పోయాడు. "నేను పట్టించుకోకపోతేనేమే.... నీ అచ్చట ముచ్చట తీర్చటానికి నీ ప్రియుడున్నాడుగా!" అన్నాడు వికృతహాసం చేస్తూ.

గుండెల్లో కస్సున బాకు దిగబడినంత బాధ కలిగిందామెకు.

"నీ రంకుపురాణం నాకు తెలియదనుకోకే! ఆ పురుషోత్తంగాడిక్కడికి రావటం లేదూ? మీ సంగతి నాకు తెలియదనుకుంటున్నావా? ఎక్కడో పేకాటలో పడుంటాడీ వెర్రివెధవ! తెల్సుకోలేడనుకుంటున్నావా? ఛీ వెధవబ్రతుకులు.'

తను లంచాలు పుచ్చుకుంటున్న విషయం భార్యకి చెప్పింది పురుషోత్తమేనని ఆమె అడిగినప్పుడే గ్రహించాడు విశ్వనాథం. ఆ దుగ్ధ మనసులో చాలా రోజులుగా ఉంది. ఆ అక్కసుకొద్దీ నోటికి వచ్చినట్లు మాట్లాడాడు.

కృష్ణవేణి కొన్ని నిమిషాలదాకా ఆ అఘాతం నుంచి తేరుకోలేకపోయింది. ఒక వ్యసనం మనిషి నెంత నీచానికి దిగజార్చివేస్తోందో నిరూపించటానికన్నట్టు అతను ఎదుట నిలబడి నోరు

పారేసుకుంటున్నాడు. ఒకప్పుడు ప్రాణసమానంగా చూసుకున్న స్నేహితుడికి ప్రాణంకన్న యెక్కువగా చూసుకున్న భార్యకి మధ్య లేనిపోని సంబంధాలు ఊహిస్తున్నాడంటే-ఇంకే మనిషి బాగుపడే ఆశ ఎక్కడుంది ?

నిస్పృహతో నిస్తేజితురాలైన భార్య కళ్ళల్లో నీళ్ళు చూసి మరింత కసిగా వాగటం మొదలు పెట్టాడు విశ్వనాథం. అత్తగారినీ ఆడబడుచుల్నీ అందర్నీ దూరంగా పంపేసిందిట. మామగారున్నా లేనివాడితో జమట....ఇల్లు కూడా ఆమె పేరనే ఉందిట. "ఇంకే మొగుడితో నీకేమవసరం ? నీ యిష్టం వచ్చినట్టు రాజ్యం చేయి. వాడి మీద మోజు తీరిపోతే మరొకడు...."

"ఆపండి !" అని ఇల్లదిరిపోయేలా అరిచింది కృష్ణవేణి.

విశ్వనాథం గతుక్కుమన్నాడు.

"ఛీ ! మీరేం మాట్లాడుతున్నారో మీకు తెలుస్తోందా ? మిమ్మల్ని వదలి పరాయి మగవాడితో తిరుగుతున్నానంటున్నారా ? అదే నిజమయితే అవమానం ఎవరికి ? నాక్కాదండీ. మీకు ! మిమ్మల్ని మీరే అవమానించుకుంటున్నారు .... పతనమై పోయింది నేను కాదు. మీరు ! మంచీ మర్యాదా ఎప్పుడో పోయాయి. ఆత్మగౌరవం ఎన్నడో హరించి పోయింది. కనీసం మానవత్వమయినా మిగిలి వుందనుకున్నాను. ఇప్పుడదీ పోయింది. అన్నీ చంపుకుని మీరు రాక్షసులుగా మారిపోయారు."

"అవునే ! నేను రాక్షసుడ్ని. నిన్ను.... నిన్ను...." అని ఆవేశంతో కొట్టటానికి మీదకి వచ్చాడు.

అతన్నొక్క త్రోపు తోసింది కృష్ణవేణి. "ఆగండి. మీరు కొట్టే రోజులు నేనుపడే రోజులు పోయాయి. మీకిక నన్ను కొట్టే అధికారం లేదు. పెట్టే బాధ్యత లేనప్పుడు కొట్టే హక్కు కూడా మీకు లేదు."

"నిన్ను కొట్టనే ! చంపేస్తాను. నిన్నిప్పుడే చంపేస్తాను. ఎవడడ్డువస్తాడో చూస్తాను." అంటూ వంటింట్లోకి పరిగెత్తి వెళ్ళి అక్కడ కనిపించిన పచ్చడిబండ తెచ్చాడు విశ్వనాథం. అతను విసిరిన దెబ్బ ఆమె తలకే తగిలివుంటే మరుక్షణంలో ఏమయ్యేదో !

అతన్ని తప్పించుకొని ఒక్క దూకులో వంటింట్లోకి పరిగెత్తింది కృష్ణవేణి. గబుక్కున కిరసనాయిలు సీసా యెత్తి పట్టుకుంది. అతను చూస్తుండగానే గబగబా తన బట్టలమీద సీసాయెత్తి పోసేసుకుంది....అగ్గిపెట్టె చేత్తో పట్టుకుని పుల్ల వెలిగించింది.

వెంట తరుముకు వచ్చిన విశ్వనాథం హడలి చచ్చిపోయేలా "ఆగండి !" అని పిచ్చిగా కేక పెట్టింది. ఆమె చేతిలో కిరసనాయిలు సీసా చూసే సరికే అతని కాళ్ళకి బ్రేక్సుపడ్డాయి. ఆవేశం సగం అణిగిపోయింది. ఆమె ఒంటిమీదనుంచి గుప్పుమని వచ్చే కిరసనాయిలు వాసన....అతన్ని నిలువునా భయంతో వణికించింది.

అంతకుముందే ఆటల నుంచి వచ్చిన పిల్లలు తల్లీతండ్రీ ఎందుకు వాదులాడుకుంటున్నారో అర్థం కాక కొయ్యబొమ్మల్లా నిలబడిపోయారు. తండ్రి చేతిలో పచ్చడిబండ, తల్లి చేతిలో అగ్గిపుల్ల చూసి ఒక్కసారిగా యిద్దరూ ఘొల్లుమన్నారు.

"మీరా బండతో కొట్టనక్కర్లేదు....నా ఒంట్లో ఇక మిగిలి వున్నది ప్రాణం ఒక్కటే ! ఒక్క దెబ్బ చేత్తో కొట్టినా వెంటనే చచ్చిపోతాను....కాని, మీ మీదకి ఖూనీకేసు వస్తుంది....మీరనవసరంగా జైలుకి వెళ్ళిపోతారు. జైల్లో మీకు పేకాడే వాళ్ళు దొరకరు....మీక్కావల్సింది నేను చచ్చిపోవటం. అంతేకదా ! నాకూ బ్రతకాలనిలేదు. ఒక విధంగా ఎప్పుడో చచ్చిపోయాను ... కేవలం శరీరం మిగిలింది. ఈ ఒక్క అగ్గిపుల్ల చాలు !....కిక్కురు మనకుండా తగలబడిపోతాను. మీకు పుల్లల ఖర్చు కూడా లేకుండా మాడి మసయిపోతాను. మీ మీదకి చెడ్డపేరు రాకుండా ఆత్మహత్య చేసుకున్నానని వ్రాసిస్తాను. తీసుకురండి కలం కాగితం తీసుకురండి. మీకీక్షణంతో నాబాధ తీరిపోతుంది !....వెళ్ళండి."

కృష్ణవేణి ఒక్కోమాట ఒక్కోపాలు చొప్పున అతని నెత్తిమీద శివాన్ని క్రిందికి దించాయి. నిజంగా ఆమె అన్నంత పనీ చేస్తుందేమోనని భయంతో వణికిపోయాడు. కదిలే శక్తి కూడా లేక నిలబడిన చోటనే బిగుసుకుపోయాడు.

ఆ మాటలర్థం కాక పిచ్చిదానిలా చూస్తోంది సుభద్ర. అర్థమయి ఏడ్పు మొదలు పెట్టాడు నారాయణ.

"అప్పుడే కన్నీళ్ళన్నీ ఖర్చుపెట్టెయ్యకురా ! అమ్మ చచ్చిపోయాక ఉపయోగిస్తాయి. ఉంచుకో, మీ నాన్న వెళ్ళలేకపోతున్నారు. నువ్వెళ్ళి కాగితం కలం పట్టుకురా !"

## విషాదగీతం

గమ్యం దొరకని అగమ్యంలో
బ్రతుకు బాటలో నడుస్తూ
నడవలేక అలుస్తూ
చీకటి వాకిట నిలిచి
కాటుక కన్నులతో చూస్తున్నా
విటుడెవడైనా విలువకడతాడా ! అని
తెలుసు నాకు చేస్తున్నది తప్పని
తెలుపు లేని నా జీవితానికి ఇది తప్పనిసరి
నిషా కళ్ళు వస్తున్నాయి ఖుషీకోసం
వసారాలో నిలుచున్న వయసు కోసం
నిషాతో ఎరుపెక్కిన కళ్ళు
కసిగా కాటేస్తే
పొంగిన యవ్వనం కృంగిన మనసుతో
వంగి, వంగి సలాము చేసింది—
వచ్చే విటుల కోసం—
చేసిన సేవకు బదులు
పెట్టిన పేరు పతిత
మనసు వయసు
మలిన మయిందని తెలుసు
మమత, మానవత కరువైందని తెలుసు
పాలి పోయిన జీవితంలో
పాల వెన్నెల రాదని తెలుసు
చిరిగి పోయిన జీవితంలో
చిరు వసంతం రాదని తెలుసు
సిగలో విరిసిన మల్లెలు
విటుల మదిలో కురిసిన జల్లులు కాని—
నా మదిలో అవి-కదిలే కన్నీటి సుడులు
కాటుక పూసిన కళ్ళు
కదిలిస్తాయి వాళ్ళ ఒళ్ళు కాని—
కలలుగానే మిగిలిన నా కలలు
కురిపిస్తాయి కన్నీళ్ళు
నా మది పాడుతున్న విషాద గీతం
రసికులందరికి రసాస్వాదం
ఉపోదయం లేని నా జీవితం
రసికులందరికి నిషాద సమయం
మోహానికి ఆహుతి అయిన నా దేహం
మారింది డబ్బుగా మరో రూపం—

—"కవ్వలి"

నారాయణ మళ్ళీ బావురుమన్నాడు.

అప్పటికే కృష్ణవేణిలో సత్తువ సన్నగిల్లి పోయింది. "వెళ్ళి పట్టుకురారా!" అని గోడకి చార్లబడి కళ్ళు మూసుకుంది.

నారాయణ ఏడుస్తూ వెళ్ళి కాగితం కలం తెచ్చి తల్లికిచ్చాడు. కృష్ణవేణి కుప్పగా నేలమీద కూలబడి పోయింది. కాగితం పట్టుకునే శక్తికూడ ఆమెలో లేదు. అలాగే శక్తి కూడదీసుకొని నాల్గు వాక్యాలు వ్రాసింది,

వ్రాసినవి మళ్ళీ పైకి చదివింది...'సరిపోతుందా, యింకా ఏమయినా వ్రాయాలా' అని అతన్ని అడిగింది.

ఆ మాటలు విని ఆమెనాస్థితిలో చూసి హడలి పోయాడు విశ్వనాధం. చేతిలోని బండ దూరంగా విసిరేసి ఒక్కదూకులో భార్య దగ్గరికి వచ్చాడు. గబుక్కున ఆమె చేతుల్లోని అగ్గిపెట్టె లాక్కుని కంగారుగా దూరంగా విసిరేసాడు. ఆమె చేతులు పట్టుకొని "అంతపని చెయ్యకు కృష్ణా!" అని బావురుమన్నాడు.

ఆమె కొన్ని నిమిషాల సేపు అచేతనంగా ఉండిపోయింది.

"నువ్వనటం కాదు. నిజంగానేను రాకసుడ్ని. నిన్ను తిట్టాను కొట్టాను. నా పాపానికి నిష్కృతి లేదు...."

అతనివైపు నిర్లిప్తంగా చూసింది ఆమె.

"ఇంకెప్పుడూ నిన్ను బాధపెట్టను. నా మాట నమ్ము."

ఆమెలో కదలిక పుట్టింది.

"నేనింక పేకాట ఆడను."

ఆమెలో అంతరించిపోయిందనుకున్న ఆశా జ్యోతి చివ్వున వెలిగింది. ఆమె మనస్సు ద్రవించింది. కళ్ళల్లోకి నీళ్ళు చిప్పిల్లాయి.

తానా వేళ యింటికి వచ్చేసరికి కొడుకు ఇంట్లోనే వుండటం చూసి ఆశ్చర్యపోయాడు సత్యనారాయణగారు.

తల్లి మాట జవదాటక ఆ పూట యింట్లో జరిగినదేదీ తాతగారికి చెప్పలేదు నారాయణ.

## 67

మర్నాటి ప్రొద్దుటికి విపరీతంగా జ్వరం వచ్చింది కృష్ణవేణికి. ఇంటిపనంతా విశ్వనాథమే చూసుకున్నాడు. సత్యనారాయణగారు వెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చాడు.

ఆమెను పరీక్ష చేసి "జ్వరం ఎన్నాళ్ళనుంచి?" అని అడిగాడు డాక్టరు.

విశ్వనాథం ముఖం నల్లబడింది. సత్యనారాయణగారు కంగారుగా చూసాడు.

"నిన్నటినుంచేనండి...." అంది కృష్ణవేణి.

"దగ్గేమయినా వస్తోందా?...." అని డాక్టరడగటం పూర్తి కాలేదు-ఆమెకు విపరీతంగా దగ్గు వచ్చింది.

"మీరొకసారి ఆవిడ్ని డాక్టరు జనార్దనరావు గారికి చూపించటం మంచిది."

డాక్టరు మాటలకి ఉలిక్కిపడ్డాడు విశ్వనాధం.

"మామూలు జ్వరం కాదంటారా?"

డాక్టరు విసుక్కున్నాడు. "ఈ మందులు కొని వాడండి. వెంటనే నేను చెప్పిన పని చెయ్యండి!"

డాక్టరు మాటలు విశ్వనాధం చెవుల్లో మ్రోగుతున్నాయి. గుండెల్లో వణుకు పుట్టిస్తున్నాయి. ఆమె వైపు చూసాడు. మగతగా కళ్ళు మూసుకొని వుంది. ముఖం పాలిపోయి వుంది. కళ్ళు లోతుకు పోయున్నాయి. జుట్టు పీచుకట్టిపోయింది. ఒకప్పుడు అందచందాలతో తన కన్నులవిందు చేసిన 'కృష్ణ' దేనా ఈ ఆకారం? తన భాగ్యాన్ని చేజేతులా దూరం చేసుకున్న దౌర్భాగ్యుడాతను!

కొడుకు పశ్చాత్తాపపడుతున్నాడని గుర్తించినా కోడలినాస్థితిలో చూసేసరికి సత్యనారాయణగారికి నిగ్రహించుకోలేనంత కోపం వచ్చింది. "....నీ భార్య ఈ స్థితికి రావటానికి కారణం ఎవరో తెల్సా? నువ్వురా! నువ్వు!"

ఈసారి తండ్రి మాటలకి కోపం రాలేదు విశ్వనాధానికి.

కళ్ళనీళ్ళతో నిలబడిన భర్తని-"అమ్మా! కృష్ణా!" అని పిలుస్తూ దుఃఖభారంతో క్రుంగిపోయిన మామగారిని చూసి చలించిపోయింది కృష్ణవేణి. "బాధపడకండి. రెండు రోజుల్లో అదే తగ్గిపోతుంది!" అంది నవ్వటానికి ప్రయత్నిస్తూ.

ఆమె అన్నట్టే జ్వరం తగ్గిపోయింది. మందులు కన్న ఆమె ఆత్మశక్తి ఎక్కువ పని చేసిందనవచ్చు.... స్పెషలిస్టుకి చూపిస్తానన్నాడు విశ్వనాథం. "ఈ డాక్టర్లు ఏవో భయపెట్టి హడలగొట్టేస్తారు. నాకేం ఫర్వాలేదు...." అని తన అనారోగ్యం విషయం గురించి తేలిగ్గా మాట్లాడిందామె.

కాని, సత్యనారాయణగారు వదిలి పెట్టలేదు. కొడుకుని ఒత్తిడి చేసాడు. "నువ్వు తీసుకు వెళ్ళకపోతే చెప్పరా! నేను తీసుకు వెడతాను!" అని కోప్పడ్డాడు కూడా.

భర్తకి మాట తెప్పించలేక డాక్టరు దగ్గరకి వెళ్ళింది కృష్ణవేణి. డాక్టరు జనార్దనరావు చాలా పరీక్షలు చేసాడు. చాలా చాలా ప్రశ్నలు వేశాడు.

ఆ ప్రశ్నలకి జవాబులు చెప్పలేక అపరాధిలా నిలబడిన భర్తను చూసి కృష్ణవేణి నొచ్చుకుంది. కేవలం అతని తప్పుని తగ్గించాలని తన అనారోగ్యం గురించి డాక్టరుతో అన్నీ అబద్ధాలే చెప్పింది.

కాని, ఆ వారంలో డాక్టరు చేసిన పరీక్షలు నిజాన్ని దాచలేకపోయాయి. టి. బి. అటాక్ అయిన లక్షణాలు బాగా కనిపిస్తున్నాయని డాక్టరు చెప్పాడు.

విశ్వనాథానికి తలమీద పిడుగులు పడినట్లయింది. భార్యవైపు భయంగా చూసాడు. కృష్ణవేణి నిశ్చలంగా నేలచూపులు చూస్తుండిపోయింది!

వెంటనే, ఆమెకు వాడవల్సిన మందుల లిస్టు వ్రాసిచ్చి బలమైన ఆహారం తినాలని, పూర్తిగా విశ్రాంతి కావాలని చెప్పాడు డాక్టరు.

తిరిగి వస్తుండగా "ఏమిటిది కృష్ణా! నువ్వింత బాధ పడుతున్నావని నాతో చెప్పనే లేదు...." అన్నాడు విశ్వనాధం ఉద్వేగస్వరంతో.

ఆమె బలవంతంగా నవ్వు తెచ్చుకుంది. "డాక్టరు చెప్పినదంతా నిజమని నమ్మేస్తున్నారా! ఇంతున్నది అంత చేసి చెప్పటం వాళ్ళకి మామూలే! మందులు వ్రాసి ఇచ్చారుగా ఆయన. అవి వాడదాము. అదే తగ్గిపోతుంది. మీరేం కంగారు పడకండి...."

పది రోజుల నాడు జరిగిన సంఘటనతో అతని ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఆఫీసుకి సెలవు పెట్టి ఇంటిపని చాలావరకు తానే చూసుకుంటున్నాడు. సాయంత్రం వేళ బయిటికి కదలటం లేదు...అతనిలో ఆరోగ్యమైన మార్పు వచ్చింది. ఆ ఆనందంలో తన అనారోగ్య విషయం చాలా చిన్న విషయంగా భావించింది కృష్ణవేణి. పశ్చాత్తాపంతో క్రుంగి వున్న భర్తను ఓదార్చటమే ముఖ్యమైన పనిగా పెట్టుకుంది. "తొందరపడి ఈ విషయం మామగారికి చెప్పకండి. ఆయన అసలే కంగారు మనిషి." అని కూడా చెప్పింది.

నిజం తెలిస్తే తండ్రి తనని మరింత తిడతాడని విశ్వనాధం చెప్పలేదు. కృష్ణవేణి చెప్పమన్నట్టే జనరల్ వీక్‌నెస్ అని డాక్టరు చెప్పినట్టు చెప్పాడు.

చిత్తశుద్ధితో పేకాట మానివేసెయ్యాలనే అనుకున్నాడతను. ఇంటిపనులతో చాలాసేపు భార్య

సమక్షంలోనే గడుపుతున్నాడు.

ఇంతలో మరో సమస్య అతని తల మీదకి వచ్చిపడింది. కొన్నాళ్ళ క్రిందట ఆఫీసు వ్యవహారంలో కంట్రాక్టరు కనకారావుకి అక్రమ సహాయం చేసిపెడతానని చెప్పి మూడు వందలు పుచ్చుకున్నాడు. ఆ డబ్బు పేకాటలో పోగొట్టుకున్నాడు. ఎన్నోసార్లు చిన్న చిన్న లంచాలు పుచ్చుకుని చిన్న చిన్న సహాయాలు చేసి తప్పించుకున్నాడు. కాని, ఈసారి పట్టుబడే అవకాశం వుందనే భయంతో ఆ పని ఇంతవరకూ అతను చేయలేదు. పేకాటలో డబ్బు గెల్చి కావాలంటే తిరిగి ఇచ్చెయ్యవచ్చని ఆశపడి అప్పుడు డబ్బు పుచ్చుకున్నాడు. పనీకాక డబ్బూ తిరిగి రాకపోతే ఇచ్చిన మనిషి వూరుకోడు కదా! అదేదో తేల్చమని పీక మీద కూర్చున్నాడా కనకారావు. "శలవుపెట్టి యింట్లో కూర్చుంటే ఎలాగయ్యా? ముందు నా సంగతి తేల్చు...." అని సరాసరి యింటికి వచ్చి గొడవ చేశాడు.

కృష్ణవేణి ఓపిక తెచ్చుకుని లేచి వచ్చింది. "జరిగిందానికి మమ్మల్ని మన్నించండి. రేపీపాటికి మీ డబ్బు సిద్ధంగా ఉంచుతాము. నా మాట నమ్మండి బాబూ!" అని దీనంగా అడిగింది.

కృష్ణవేణి స్థితి చూసేసరికే సగం మెత్తపడిపోయాడు కనకారావు. "సరేనమ్మా! మీ ముఖం చూసి ఈ పూటకీయన్ని వదిలి పెడుతున్నాను! చేతకాని వాడు చేస్తానని ఎప్పుడూ మాటివ్వ కూడదు...." అని విశ్వనాథం వైపు ఛీత్కారంగా చూసి వెళ్ళిపోయాడు.

భార్య ముందు అలా అవమానం జరిగేసరికి అతనికి తన మీద తనకే అసహ్యమేసింది. "ఇలా అందరిచేతా మాట పడేకన్న చస్తే నయం!" అన్నాడు చేతులతో తల పట్టుకుంటూ.

అతనివైపు జాలిగా చూసింది కృష్ణవేణి. "జరిగిపోయిందేదో జరిగిపోయింది. మీరేం తప్పు చేయలేదు. పుచ్చుకున్న డబ్బు ఇచ్చేస్తే మనకా బాధ తీరిపోతుంది!"

"అంత డబ్బు ఒక్క రోజులో ఎక్కడ్నించి వస్తుంది? నాకెవరిస్తారు? అప్పుకోసం ఎవడి దగ్గరికి వెడదామన్నా....నన్నిప్పుడు నమ్మేవాడు లేడు."

కృష్ణవేణి కోమూల భర్త మారినందుకు సంతోషంగా వుంది. మరోమూల ప్రస్తుత సమస్య ఎలా పరిష్కారమవుతుందా అని దిగులుగా వుంది.



సాధారణంగా పిల్లలు తలిదండ్రుల్ని 'అది కావాలి....యిది కావాలి' అని వేధిస్తూ వుంటారు. కాని యిటీవల ఆస్ట్రేలియాలో ఏడేళ్ళ బాలిక కోరరాని కోరిక కోరిందట. ఆ కోరిక కాస్తా ఆ పాప తల్లి హెల్గా షల్ట్జ్‌ని గాభరా పెట్టేసింది. దాంతో తన కుమార్తెను మనస్తత్వ నిపుణుడి దగ్గరకు తీసుకు వెళ్ళింది.

తన తలిదండ్రులిద్దరూ విడాకులు పుచ్చుకుని విడిపోవాలిట — ఇది ఆ చిన్నారి కోరిక!

ఆ మనస్తత్వ శాస్త్ర నిపుణుడు బాలికను బాగా పరీక్షించాడు.

"మీ పాప చదువుతున్న తరగతిలో అందరు పిల్లలకీ విడాకులు పుచ్చుకున్న తలిదండ్రులే వున్నారులా వుంది. తనకి మాత్రం కలిసి వున్న తలిదండ్రులు వుండేసరికి వారితో కలవలేకపోతోంది. అందుకే మిమ్మల్ని అలా కోరింది. ముందు ఆ స్కూలు మాన్పించండి. అదే మందు!" అని చెప్పి పంపేశాడు ఆయన.

మామగారితో చెప్పి లాయరుగారి దగ్గర అప్పు పుచ్చుకోమంటే? లాయరుగారిస్తారో యివ్వరో! ఇప్పటికే మామగారెంతో శ్రమపడుతున్నారు? ఆయన మీద ఇంతటి బాధ్యత పెట్టటం తనకి భావ్యమేనా?....పైగా, సంగతి తెలిస్తే ఆయన మళ్ళీ భర్తని నిందించటమే జరుగుతుంది, ఇంక తనకు మార్గమేమిటి?

"పోనీ, నీ నగ యేదయినా యిస్తే" ఆ పైన చెప్పలేక భార్య ముఖం చూడలేక తల దించుకున్నాడు విశ్వనాథం. "మళ్ళీ తాకట్టు త్వరలోనే విడిపిస్తాను." అన్నాడు తడబడుతూ.

అతనివైపు జాలిగా చూసి గాఢంగా నిట్టూర్చింది ఆమె.

"నా మీద నీకింకా నమ్మకం లేకపోతే నువ్వే పెట్టి డబ్బు తీసుకురా! రేపు నువ్వే కనకారావుకియ్యి. నేను ముట్టుకోనే ముట్టుకోను." అన్నాడు సిగ్గుతో బిక్కచచ్చిపోతూ.

కృష్ణవేణి అవాక్కయిపోయింది.

"మాట్లాడవేం కృష్ణా! ప్రతిరోజూ ఒక పూట తిండి మానేసయినాసరే నీ నగలు విడిపిస్తాను. నన్ను నమ్ము."

ఆమెకిక కన్నీళ్ళాగలేదు. "ఇంకెక్కడి నగలండీ! అవన్నీ ఎప్పుడో కరిగించి అమ్మేసాను. ఇప్పుడు నా దగ్గర వీసమెత్తు బంగారం కూడా లేదు."

అతను నిర్ఘాంతపోయాడు. "అమ్మేసావా? అన్ని నగలు అమ్మేయాల్సివచ్చిందా? నేనంత డబ్బు తగలబెట్టేసానా? ఇంతకాలం నన్నెలా భరించావు కృష్ణా! ఎలా భరించావు? నన్ను చంపేయాలని నీకెలా అనిపించలేదు." అంటూ చేతులతో ముఖం కప్పుకున్నాడు.

"ఊరుకోండి. పోయిందేదో పోయింది. మీరు మారారు. నాకదే కావల్సింది." అంది బుజ్జగింపుగా అతని జుట్టు సవరిస్తూ.

రేపటి సమస్య గడిచి ఎలా గట్టెక్కాలా అని ఆమె సతమతమవుతుండగా పురుషోత్తం వచ్చాడు. ఇన్నాళ్ళుగా అతని భార్య ద్వారానే ఎవరెవరివో బట్టలు తెప్పించుకొని కుడుతోంది కృష్ణవేణి. పది రోజులుగా ఆరోగ్యం సరిగాలేక ఆమె కుట్టుపని చేయటం లేదు. బట్టలు యిచ్చినవాళ్ళు ఒత్తిడి చేస్తున్నారు. ఆ విషయం చెపుదామని ఒకటి రెండు సార్లు వచ్చింది పురుషోత్తం భార్య. విశ్వనాథం ఇంటిపట్టునే ఉండటం వల్ల కృష్ణవేణితో ఆ ప్రస్తావన తేలేక వెళ్ళిపోయింది. మరో మార్గం లేక భర్తనే వెళ్ళి సమయం చూసి కృష్ణవేణి నడిగి బట్టలు తీసుకురమ్మని చెప్పి పంపిందామె. ఇటీవల కొన్ని రోజులుగా విశ్వనాథం పేకాటకి వెళ్ళటం లేదని పురుషోత్తానికి తెలిసి సంతోషించాడు. పాత స్నేహం పురస్కరించుకొని అతన్ని పలకరించినట్టుగా కూడా ఉంటుందని బయలుదేరి వచ్చాడు.

పురుషోత్తం అప్పుడు రావటం విశ్వనాథానికి

మనస్కరించలేదు. ''రండన్నయ్యా!'' అని భార్య పలకరించి కూర్చోపెట్టటంతో మరింత ముఖం ముడుచుకున్నాడు.

స్నేహితుడు పశ్చాత్తాపంతో ముఖం చూపించ లేక పోతున్నాడని అనుకున్నాడు పురుషోత్తం. కృష్ణవేణి కూడా అలాగనే భావించింది.

''నువ్వు పేకాట మానేసావని తెలిసి చాలా సంతోషించాను విశ్వం!'' అని పురుషోత్తం అంటే ఆ ప్రస్తావన మారుద్దామని ''వదినగారు రెండు సార్లు వచ్చారు. బట్టల విషయం చెప్పటం మర్చి పోయాను. రెండు రోజుల్లో పంపిస్తానని చెప్పండి.'' అంది కృష్ణవేణి.

వాళ్ళ ద్వారానే బట్టలు తెప్పించి భార్య కుడు తోందని తెలిసేసరికి మరింత కోపం వచ్చింది విశ్వ నాధానికి. ''ఇక నుంచి నువ్వు బట్టలు కుట్టకు!'' అన్నాడు తల త్రిప్పుకుంటూ.

''అలాగే!'' అంది ఆమె.

''కంట్రాక్టరు కనకారావు వచ్చి డబ్బు తిరిగి ఇవ్వమన్నాడుటగా!'' అన్నాడు పురుషోత్తం.

ఇంతవరకు అతనికి తెలిసాక యింక దాచి లాభ మేముందని.—''అవునండి. రేపే యిస్తానని చెప్పారు. ఏం చేయాలో తోచటం లేదు.'' అంది ఆమె తల దించుకుంటూ.

''నేనిస్తాను. నాకు నెమ్మది మీద తిరిగిద్దురు గాని....''

అతను గండం గడుపుతున్నందుకు సంతోషం కలిగించటం కన్న — అతనితో భార్య కష్టసుఖాలు చెప్పుకోవటం — అతను వెంటనే సాయం చేస్తా ననటం విశ్వనాధాన్ని ఎక్కువ బాధ పెట్టాయి. తనను చేతకాని వాడని వాళ్ళిద్దరూ భావించి మాట్లాడి నట్టే అనిపించాయి. దానికితోడు ''ఇంకెప్పుడూ ఇలాంటి వాళ్ళ దగ్గర డబ్బు పుచ్చుకోవటం మంచిది కాదు.'' అని సలహా చెప్పి మరీ వెళ్ళిపోయాడు పురుషోత్తం!

పశ్చాత్తాపంతో భర్త క్రుంగి వున్నాడనే అను కుంది కాని...అహం దెబ్బతిని అతను అసహ్యంగా ఆలోచిస్తున్నాడని గుర్తించలేకపోయింది కృష్ణవేణి. మర్నాడు పురుషోత్తం డబ్బు తెచ్చిచ్చినప్పుడు— ఆ డబ్బు కనకారావుకి కృష్ణవేణి యిచ్చినప్పుడు ఆ గండం గడిచినందుకు ఆమె పురుషోత్తాన్ని పొగిడినప్పుడూ అంతుపట్టని జ్వాలలేవో విశ్వనాధం గుండెల్లో మండాయి!



**రేపు ఉదయం తలంటు పోసుకుంటారనగా ముందు రోజు రాత్రి, మెంతులు ఒక చిన్న గరిటెడు నీళ్ళలో నాన బెట్టాలి. తెల్లవారికి ఆ మెంతులు బాగా నాని వుంటాయి. వాటిని రోట్లో వేసి మెత్తగా రుబ్బి తలంతా పట్టించుకుని ఒక గంటసేపు నానిన తర్వాత తల స్నానం చేస్తే జుట్టు వూడడం తగ్గుతుంది.**

—ధూర్జటి విజయలక్ష్మి

అయితే, అతనా వ్యథ వెళ్ళగక్కకోటానికి వీల్లేకుండా ఆమె బట్టలు కుట్టుకోవటంలో మునిగి పోయింది. దగ్గు తెరలో ఉక్కిరిబిక్కిరవుతున్న భార్యని చూశాక అతని మనసులో ఆ బాధ తగ్గి ఆమె అనారోగ్యపు భయం తల ఎత్తింది. తన వ్యసనం తెచ్చిన ఆర్థిక బాధవల్లనే కదా ఆమె అంత శ్రమపడవలసి వస్తోందని అనిపించింది.... ఆమె చేసిందనిపించిన తప్పు కన్న తను చేసిన తప్పు క్రమక్రమంగా అతని మనసులో పెద్ద రూపం ధరించింది.

అప్రయత్నంగా భార్యకి సాయం చేయటానికి వెళ్ళాడు. ఆమె కుట్టిన చొక్కాలకి, లాగులకి బొత్తాములు కుట్టసాగాడు. ''మీ కెందుకండీ!'' అని అంటున్నా అతను చేస్తున్న సహాయానికి ఎంతో మురిసి పోయింది కృష్ణవేణి.

బట్టలు కుట్టటం పూర్తి చేసి పంపేసింది. వాటికి రావలసిన డబ్బు కూడా వచ్చేసింది పెట్టిన శెలవు అయిపోయిందని ఆవేళ విశ్వనాధం ఆఫీసుకి వెళ్ళాడు. సాయంత్రం భార్య యిచ్చిన డబ్బుపెట్టి మందులు కొన్నాడు. ఇంకా ఐదు రూపాయలు మిగిలేసరికి మనసు మళ్ళీ క్లబ్బు వైపు లాగింది. దాదాపు ఇరవై రోజులుగా అతను అటు వెళ్ళలేదు. నిగ్రహించుకోలేకపోయాడు. డబ్బు పోయాక కాని తెలివి తెచ్చుకుని ఇంటి ముఖం పట్టలేదు.

అతను ఆలస్యంగా రావటం గుర్తించి అతని ముఖం చూసి జరిగింది గ్రహించింది కృష్ణవేణి. అయినా, ఏమీ ఎరగనట్టు నవ్వి ఏవో కబుర్లు చెప్పటం మొదలు పెట్టింది. ఆమె ఔదార్యానికి తట్టుకోలేక చేసిన తప్పుని వెంటనే చెప్పుకున్నాడు విశ్వనాధం.

''ఎన్నో సంవత్సరాల అలవాటు ఒక్కరోజులో మానుకోవటం కష్టం! బాధపడకండి....మీకంతగా వెళ్ళాలనిపించినప్పుడు - నాలో చెప్పండి. ఆ డబ్బు నేనే యిస్తాను....''

కొన్నాళ్ళు స్థలం మార్పు వస్తే అతని దృష్టి మారుతుందని ఆమె అనుకుంది. ఆ స్థలం మార్పు వస్తే ఆమె ఆరోగ్యం చక్కబడుతుందని సత్య నారాయణగారను కున్నారు.

వాళ్ళ కోరికలు తీరేలా మాధవికి సుఖప్రసవమై బాబు పుట్టాడని టెలిగ్రాము-బాలసారెనాటికి వాళ్ళని మరీ మరీ రమ్మని ఉత్తరాలమీద ఉత్తరాలు వచ్చాయి!

## 68

అన్నావదినలు తండ్రితో కలిసి గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నారని టెలిగ్రామ్ రావటంతో రిసీవ్ చేసుకుందామని మురళీమోహన్‌తో నిర్మల కూడ స్టేషనుకు వచ్చింది.

కూర్చున్నచోట కూర్చోలేక అటూయిటూ తిరుగుతూ, మాటిమాటికి చేతి వాచీ చూసుకుంటున్న చెల్లెల్ని చూసి మురళీమోహన్ నవ్వాడు. ''కొన్ని నిమిషాలసేపు ఓర్చుకోలేకపోతున్నావు! ఇంత కాలం వదిన్ని చూడకుండ ఎలా ఉండగలిగావు?''

నిర్మల నెర్వస్‌గా నవ్వింది. నుదుట పట్టిన చెమట బిందువుల్ని చేరుమాలుతో ఒత్తుకుంటూ ''ఏమోబాబూ! నన్నిలా ప్రశ్నలేసి చంపకు.... బండిలేటా?'' అంది.

''కాదు. మీ రచయితల భాషలో కాలం స్తంభించిపోయింది.'' అని గలగలనవ్వాడతను.

అన్నా చెల్లెళ్ళలా మాట్లాడుకుంటుండగా ''హలో నిర్మలా!'' అని ఎవరో పిలవటం వినిపించింది. ప్రక్కకి చూస్తే శ్యాంసుందర్!

''హలో శ్యాం! ఇక్కడికెప్పుడు వచ్చావు?'' అని ఆశ్చర్యంగా అడిగింది నిర్మల.

ఆర్నెల్లనుంచి హైదరాబాదులోనే ఉంటున్నానని, అదృష్టవశాత్తు మంచి ఉద్యోగమే దొరికిందని— ఆ వివరాలన్నీ చెప్పాడతను.

''సారీ అన్నయ్యా! కబుర్లలో పడి నీ సంగతి మర్చిపోయా! ఇతను శ్యాంసుందర్. కాలేజీలో నా సీనియరు'' అని ఇద్దరికీ పరిచయాలు చేసింది నిర్మల.

మురళితో కరచాలనంచేసి ''ఇవేళ మీ ముందు

నిలబడి యిలా మాట్లాడుతున్నానంటే - మీ చెల్లెలు పెట్టిన ప్రాణభిక్షే!'' అన్నాడు శ్యాంసుందర్.

మురళీమోహన్ తెల్లబోతూ వింటుండగా — నిర్మల సిగ్గుతో ముడుచుకుపోతుండగా ఒకనాటి వానరాత్రి నిర్మల తమయింటికి కాకతాళీయంగా వచ్చి తలుపు తట్టటం....ఆ పైన జరిగినదంతా వివరంగా చెప్పాడు శ్యాంసుందర్. ''ఆవేళ నిర్మల ధైర్యం చెప్పకపోయుంటే నేను జీవితంలో యింత దూరం వచ్చుండేవాడ్నికాదు! ముఖస్తుతి అనుకోకపోతే....''

అతని మాటల కడ్డు వచ్చింది నిర్మల. "అతిగా పొగడకు శ్యాం! ఈ ప్లాట్‌ఫారం పట్టనంత లావెక్కిపోతాను.''

జరిగింది విన్నాక చెల్లెలి వైపు చూస్తూ ముగ్ధుడై పోయాడు మురళీమోహన్. ఇలాంటి చెల్లెలు తనకు ఉండటం ఎంత అదృష్టం! ఇలాంటి రత్నానికి ఎటువంటి భర్త దొరుకుతాడో!

''అదిసరే, నువ్విలా వచ్చావేమిటి? ఎవరయినా వస్తున్నారా?'' అని అడిగింది నిర్మల.

''నా వైఫ్ వస్తోంది.''

నిర్మల కళ్ళింత చేసి నవ్వింది. ''వ్వాట్? నీకు పెళ్ళయిందా? ఎప్పుడు? నాకు ఇన్విటేషన్ అయినా పంపకుండా అంతా గప్‌చిప్‌గా పెళ్ళి చేసుకున్నావేం?''

''ఏ శుభలేఖలూ లేకుండా నిజంగానే గప్‌చిప్‌గానే జరిగింది నా పెళ్ళి! గుళ్ళోపెళ్ళి!''

''వెరీగుడ్! ఎవరా అదృష్టవంతురాలు?''

''మాలతి.''

ఉలిక్కిపడింది నిర్మల. ''మాలతా? ఏ మాలతి?''

శ్యాంసుందర్ చిన్నగా నవ్వాడు. ''ఇంకే మాలతి! నీ క్లోజ్ ఫ్రెండు మాలతి.''

నిర్మల ముఖం జేవురించింది....మాలతి ఎవరితోనో లేచిపోయిందని-ఇలాంటి పని చేస్తుందని తను కలలో కూడా అనుకోలేదని-మన స్నేహితురాలని చెప్పుకోవటం సిగ్గుచేటని - కొన్నాళ్ళక్రితం విజయ ఉత్తరం వ్రాసింది. అప్పట్నించీ మాలతి మీద విరక్తి పెట్టుకుని ఆమె ఉత్తరాలు వ్రాయటం కూడా మానివేసింది. శ్యాంసుందర్ అలా అనేసరికి ఆమెకు మతిపోయినట్టయింది. ''నువ్వనేదేమిటో నా కర్థం కావటం లేదు!'' అంది ఆవేశంగా.

''మాలతీ నేనూ తిరపతి వెళ్ళి గుళ్ళో పెళ్ళి చేసుకున్నాం. ఆ సంగతి ముందు తెలియక మాలతి ఎవరితోనో లేచిపోయిందని అంతా తలోమాట అనుకున్నారు. ఆ లేచిపోయింది ఎవరితోనో కాదు నాతోనే!'' అని నవ్వాడు శ్యాంసుందర్.

బహుశ ఈ వివరాలే మాలతి తన ఉత్తరంలో వ్రాసుంటుంది. కాని, ఆమె మీద కోపంతో అది చదవకుండానే చింపి అవతలపారవేసింది తను. తానెంత తొందరపడింది!

''మాలతి నీకు వ్రాసిన ఉత్తరం అంద లేదనుకుంటాను....''

నిర్మల ఆ మాట పట్టించుకోలేదు. ''ఏమయినా మీరిలా చేయటం నాకు నచ్చలేదు. పిరికివాళ్ళల్లా పారిపోయి ఎక్కడో పెళ్ళి చేసుకోవల్సిన అవసరమేముంది? ధైర్యంగా పెద్దవాళ్ళతోనే చెప్పి చేసుకోవచ్చుగా!''

''వివరాలు తెలియక నువ్వపార్థం చేసుకుంటున్నావు నిర్మలా! ఇష్టంలేనిది వాళ్ళవాళ్ళకి కాదు-మావాళ్ళకి. ఊళ్ళోరభస ఎందుకని వాళ్ళవాళ్ళతో చెప్పి వెళ్ళి మరీ పెళ్ళి చేసుకున్నాము. ఇప్పుడు పెళ్ళయిపోయింది కనుక ఏం చేయలేక మావాళ్ళు కూడా సమాధానపడ్డారు! ఇవేళ మాలతితోపాటు మా అమ్మ కూడా వస్తోంది. నిన్నెలాగయినా కలిసి యిదంతా చెప్పాలని మాలతి అనుకుంటోంది!''

అప్పటికి నిర్మల ముఖం తేటపడింది. శ్యాంసుందర్ చేసిన సాహసంకన్నా – నిర్మలంటే వాళ్ళ స్నేహితులకున్న గౌరవం, అభిమానం, భయం ఎక్కువ ఆశ్చర్యం కలిగించాయి మురళీమోహన్‌కి.

''అబ్బ, ఇవేళ బండినిండా మన ఫ్రెండ్స్ వచ్చేలా ఉన్నారు!'' అని నవ్వింది నిర్మల.

మరి కాసేపటికి ఆ బండి రానూ వచ్చింది. వదిన్ని చూడాలని ఒకవైపు మాలతిని చూడాలని మరోవైపు మనస్సులాగి ఎటు వెళ్ళాలో తెలియక అక్కడే నిలబడిపోయింది నిర్మల.

''నువ్వు వెళ్ళు నిర్మలా! నేనూ మాలతీ తర్వాత కలుస్తాం! నీ అడ్రసు మా దగ్గరుందిలే!'' అని చెప్పి వెళ్ళిపోయాడు శ్యాంసుందర్.

రారమ్మని చెల్లెలి చేయి పట్టుకొని కృష్ణవేణి కనిపించిన కంపార్టుమెంటువైపు పరిగెత్తాడు మురళీమోహన్!

ప్లాట్‌ఫారం మీద అంతా వింతగా చూస్తున్నారన్న స్పృహయినా లేకుండ కృష్ణవేణిని అమాంతంగా కౌగలించుకొని చిన్న పిల్లలా యేడ్చింది నిర్మల!

[సశేషం]

బ్లాంచి బ్లయర్ అనే అందగత్తె కాలిఫోర్నియా (అమెరికా)లో మోడల్‌గా వుంటోంది. ఆ పిల్లకి వేగంగా కారు నడపడం సరదా. మంచి మాటకారి కూడా.

ఓరోజు అలా అతివేగంగా కారు నడుపుతున్నందుకు సాక్రమెంటో ప్రాంతంలోని పోలీసులు ఆమెను కాస్తా మేజిస్ట్రేటు ముందుంచారు.

''అమ్మా....నువ్వు పది నెలల్లో చేసిన ఇరవైమూడో తప్పు ఇది. కారు అలా వేగంగా నడపొచ్చా....తప్పు కాదూ'' అన్నాడు మాజిస్ట్రేటు.

''మీరు చెప్పింది నిజమే సార్....అలా నడపడం తప్పే. కాని ఏం చెయ్యనూ.... మీరంటే నాకెంతో యిష్టం. మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని చూడకుండా నేనుండలేను. ఇలా అస్తమానం కోర్టుకెక్కితే తప్ప మిమ్మల్ని చూడ్డం పడడం



లేదు నాకు. దయచేసి అటువంటిది మరో దారేదైనా వుంటే చెప్పండి. అలాగే మీ ఫొటో కూడా యిస్తారా?'' అని అడిగింది ఆ మాటకారి బ్లాంచి.

మేజిస్ట్రేటువంటి వాడు ఆమె మాటలకి బోల్తా పడతాడా? పడడు – అందుకే, ఆమెకీ సారి ఎక్కువ జుల్మానా విధించాడు!

# సంస్కృత పాఠమాల [4]

**स्वरयुक्त व्यञ्जनानि**

స్వరయుక్త వ్యఞ్జనాని = గుణితములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ట ट | ఠ ठ | డ ड | ఢ ढ | ణ ण | త त | థ थ | ద द | ధ ध | న न |
| టా टा | ఠా ठा | డా डा | ఢా ढा | ణా णा | తా ता | థా था | దా दा | ధా धा | నా ना |
| టి टि | ఠి ठि | డి डि | ఢి ढि | ణి णि | తి ति | థి थि | ది दि | ధి धि | ని नि |
| టీ टी | ఠీ ठी | డీ डी | ఢీ ढी | ణీ णी | తీ ती | థీ थी | దీ दी | ధీ धी | నీ नी |
| టు टु | ఠు ठु | డు डु | ఢు ढु | ణు णु | తు तु | థు थु | దు दु | ధు धु | ను नु |
| టూ टू | ఠూ ठू | డూ डू | ఢూ ढू | ణూ णू | తూ तू | థూ थू | దూ दू | ధూ धू | నూ नू |
| టృ टृ | ఠృ ठृ | డృ डृ | ఢృ ढृ | ణృ णृ | తృ तृ | థృ थृ | దృ दृ | ధృ धृ | నృ नृ |
| టౄ टॄ | ఠౄ ठॄ | డౄ डॄ | ఢౄ ढॄ | ణౄ णॄ | తౄ तॄ | థౄ थॄ | దౄ दॄ | ధౄ धॄ | నౄ नॄ |
| టౢ टॢ | ఠౢ ठॢ | డౢ डॢ | ఢౢ ढॢ | ణౢ णॢ | తౢ तॢ | థౢ थॢ | దౢ दॢ | ధౢ धॢ | నౢ नॢ |
| టే टे | ఠే ठे | డే डे | ఢే ढे | ణే णे | తే ते | థే थे | దే दे | ధే धे | నే ने |
| టై टै | ఠై ठै | డై डै | ఢై ढै | ణై णै | తై तै | థై थै | దై दै | ధై धै | నై नै |
| టో टो | ఠో ठो | డో डो | ఢో ढो | ణో णो | తో तो | థో थो | దో दो | ధో धो | నో नो |
| టౌ टौ | ఠౌ ठौ | డౌ डौ | ఢౌ ढौ | ణౌ णौ | తౌ तौ | థౌ थौ | దౌ दौ | ధౌ धौ | నౌ नौ |
| టం टं | ఠం ठं | డం डं | ఢం ढं | ణం णं | తం तं | థం थं | దం दं | ధం धं | నం नं |
| టః टः | ఠః ठः | డః डः | ఢః ढः | ణః णः | తః तः | థః थः | దః दः | ధః धः | నః नः |

(మిగిలిన గుణింతములు వచ్చేసారి)

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-46' చందమామ బిల్డింగ్స్, మద్రాసు - 600 026 చిరునామాకు ఏప్రిల్ 25 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 జూన్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. ఇటీవల వనితలో మీరు చదివిన ఒక పుణ్యక్షేత్రం
2. జాతీయపక్షి
3. నీళ్ళు కాగడం
4. చివరి అక్షరంలోని కొమ్ము తొలగించి, గుడి తగిలించి, తక్కిన అక్షరాలను సర్దితే-గాలి.
5. 'ఇదే ప్రపంచం' అని కప్ప దేన్ని అనుకుంటుందట?
6. అడవిలోనూ ఆశ్రమంలోనూ వుంటాడని!
7. చివరికి మరో మాట!
8. కాబట్టి—
9. పంజాబ్‌లో నదులు
10. ఒక కావ్యం. అర్థం చెప్పుకోవాలంటే ఆడుకోయిల
11. అసలే ఒంటికాలిమీద దొంగ జపం చేస్తాయి; దానికి తోడు తలకిందులు కూడా!
12. సరిగ్గా సమయానికి మూడక్షరాల మాట కట్టాలి!
13. దాణం వెనకనుంచి వస్తోందా—
14. ఉగాదిపచ్చడికి కావలసినది-అట్నుంచి వస్తుంది.

### ఆధారములు - నిలువు

1. నుదిటి మీది రాతను దిద్దలేకపోవచ్చు గాని, దీన్ని దిద్దవచ్చు!
2. బాలచంద్రుడు
15. ఇదొక రసం — ఆకు రసం
16. ఇవీ పప్పు దినుసులే
17. జీవితంలోని చివరితనమే తిరగబడితే?—
18. పెద్దదో చిన్నదో - అరణ్యం!
19. బహుమతి సవ్యంగా లేదు
20. అవీ ఇవీ కలవడం
21. మంచివాడు కానే కాదు!
22. ఒక రంగు
23. "ధి"క్కరించిన అధిపతి అటూ ఇటూ వెళ్ళిపోయాడు!
24. ఇలాంటిదైతే, నీరు కింద నుంచి పైకి వస్తుంది.



# ప్రాచీన అలంకరణ

ఈ చిత్రంలో కనిపించే ఆభరణాలు ఐదవ శతాబ్దానికి చెందినవిగా భావింపబడుతున్నాయి. ఈ చిత్రంలో రాణి_అద్దంలో తన సింగారాన్ని చూసుకుంటున్నది. ఆమె ధరించిన వస్త్రాలను, ఆభరణాలను గమనిస్తే ప్రాచీన కాలంలోని అలంకరణ అర్థమవుతుంది. మూడు మడతలతో వున్న నడుం గుడ్డ, దాని లోపల్నుంచి పైకి వెళ్ళిన హారం, చేతులకున్న గాజులు, తలపైన కిరీటం, మెడలోని హారం మొదలైనవన్నీ ఎంతో పనితనంతోనూ, హుందాగానూ కనిపిస్తున్నాయి. అదే విధంగా పక్కన వున్న చెలి అలంకారం కూడా నాటి నాగరికతను చెబుతున్నది. కిరీటాలు బంగారంతో చేయించేవారు; వాటిల్లో రాళ్ళు పొదిగి, నగిషీ చేయించేవారు. (అజంతా గుహల్లో వున్న పురాతన వర్ణచిత్రాల నుంచి సేకరింపబడినది.)

చిత్రం : శ్రీమతి ఉదయగిరి



ఈ రోజుల్లో గుండె జబ్బులతో చనిపోవడమన్నది సర్వసాధారణ విషయం అయిపోయింది. ఈ గుండె జబ్బులకి ముఖ్యకారణాలు రెండు. అతిరోస్క్లెరోసిస్ (Atherosclerosis) అంటే రక్తనాళాల చుట్టూ కొవ్వు పదార్థం పేరుకుపోవడం వలన అవి గట్టి పడడం; రెండవ కారణం – కరోనరీ హార్ట్ డిసీస్ (Coronary heart disease) అంటే గుండె చుట్టూ గల రక్తనాళాలలో కొవ్వు పేరుకుపోవడం. ఈ రెండింటివల్ల కలిగే మరణాలతో పోల్చి చూస్తే అన్నిరకాల కాన్సర్ వ్యాధుల ద్వారా సంప్రాప్తించే మరణాల సంఖ్య చాలా తక్కువనే చెప్పాలి.

అయితే ఇటువంటి పరిస్థితి ఏర్పడడానికి కారణం ఏమిటి ?

రక్త ప్రసారంలో పేరుకుపోయే కొవ్వు పదార్థమే దీనికి కారణం. దీన్నే కలొస్ట్రొరల్ అని అంటారు. కొవ్వు బాగా పేరుకుపోవడంవల్ల, రక్త ప్రసారంలో సంభవించే మార్పువల్లా రక్తనాళాలు క్రమక్రమంగా ఇరుకు అవుతాయి. అందువల్ల ఈ నాళాలలో రక్తప్రసారం బాగా తగ్గిపోవడం జరుగుతుంది. జబ్బు బాగా ముదిరినట్లయితే ఈ ప్రసారం పూర్తిగా ఆగిపోతుంది కూడా.

వెన్న, మార్గరిన్, కొబ్బరి నూనె, వనస్పతి మొదలైనవి. కొవ్వుపదార్థం అధికంగా లేనివి రెండవ కోవకి చెందుతాయి. ఇవి పత్తిగింజల నూనె, మొక్కజొన్ననూనె, నువ్వులనూనె, సూర్య కాంతపువ్వు నుండి తీసిన సన్‌ఫ్లవర్ ఆయిల్, వేరుశనగనూనె. వీటిలో వేరుశనగనూనె, పత్తి గింజల నూనెలలో కొవ్వుపదార్థం మరీ ఎక్కువా కాక మరీ తక్కువగానూ కాక మధ్యస్తంగా వుంటుంది. సూర్యకాంతనూనె, మొక్కజొన్న నూనె, సోయాబీన్‌నూనె — రక్తంలోని కొవ్వు పదార్థాన్ని తగ్గించే విధంగా తమ ప్రభావాన్ని చూపెడతాయి.

కేవలం ఆహారపదార్థాల విషయంలో అజాగ్రత్త వల్లేకాకుండా భౌతికంగా శరీరానికి కలిగే శ్రమ మీద కూడా ఈ 'కలొస్ట్రొరల్' పరిమాణం ఆధార పడి వుంటుంది. కదలకుండా వున్నచోటనే కూర్చుని వుద్యోగాలు చేసేవారిలో అనేకులు ఈ 'బ్లడ్ కలొస్ట్రొరల్' బాధితులని తెలియవస్తోంది. అందువల్ల వారు శరీర వ్యాయామం చేయడం, బ్యాడ్ మింటన్, టెన్నిస్ వంటి ఆటలు ఆడడం మంచిది. ఇవేవీ చేయలేకపోతే కనీసం రోజూ కొంత

సూర్యకాంతనూనె, పత్తిగింజలనూనె, సోయాపాలు, కొవ్వు పదార్థం మితంగా వున్న పెరుగు, జున్ను మొదలైనవి తీసుకోవాలి. రోగి మరీ స్థూలకాయుడైతే అతని ఆహారంలోని కెలోరీల విలువను సమపాళ్ళలో వుంచడం ముఖ్యం. అందువల్ల శరీరపు బరువును తగ్గించడం, ఒక సామాన్య పరిమాణంలో వుంచడం సాధ్యమవుతుంది. వీరు తాము భుజించే వరి అన్నాన్ని కూడా తగ్గించడం మంచిది.

**తీసుకోకూడని ఆహారపదార్థాలు :** రోగం మరీ ముదిరినట్లయితే – వెన్న, వనస్పతి, కేక్‌లు, బిస్కత్తులు, మాంసం, చిక్కటి పాలు, క్రీమ్, చాక్లెట్లు, ఐస్‌క్రీం, జొన్న, కొబ్బరినూనె తీసుకో కూడదు. వారానికి రెండు కోడిగుడ్లుపైన అరగించ కూడదు. సూర్యకాంతనూనె, సోయానూనెలలో వేయించిన ఆహారదినుసులు తప్ప, తక్కిన వేపుడు పదార్థాలు భుజించకూడదు. బంగాళదుంపల చిప్స్, చిక్కటి క్రీమ్‌సూప్ కూడా పైన చెప్పిన నూనెలలో చేస్తేతప్ప అరగించకూడదు. వేరుశనగకాయలు కూడా తినకూడదు.

ఇప్పుడు 'కలొస్ట్రొరల్' తక్కువగా వున్న కొన్ని వంటకాల గురించి వాటిని తయారు చేసే విధానం గురించీ తెలుసుకుందాం.

# గుండెజబ్బుగలవారు ఎలాంటిఆహారంతీసుకోవాలి?

గుండె జబ్బులు రావడానికి గల యితర కారణాలు–
1. వంశపారంపర్యం; అంటే ఒక కుటుంబ చరిత్రలో గుండె దగ్గర గల రక్తనాళాలలో కొవ్వు పేరుకుపోయి అనేకులు చిన్నతనంలోనే మరణించి నట్లయితే ఆ జబ్బు వీరికీ రావడానికి అవకాశం వుందన్నమాట. 2. రక్తపుపోటు. 3. మధుమేహం 4. హార్మోనులు సమపాళ్ళలో లేకపోవడం. 5. అతిగా బరువెక్కడం.

కొవ్వుపదార్థాన్ని ఏ రూపంలోనైనా – ఘన పదార్థంగా గానీ వంటలలో గానీ మరీ అమితంగా ఆరగించినట్లయితే గుండెకి, రక్తనాళాలకి సంబంధించిన జబ్బులకు గురి అయ్యే అవకాశం వుందని పరిశోధనల ద్వారా తేలింది.

మనం ఆరగించే కొవ్వుపదార్థాన్ని రెండు విధాలుగా విభజించవచ్చు – పూర్తిగా కొవ్వు పదార్థాలతో నిండినటువంటివి ఉదాహరణకి నెయ్యి,

దూరం నడవడం మంచిది.

గుండె జబ్బుకి, కలొస్ట్రొరల్‌కి గురైన వారు కొన్ని ఆహార నియమాలు విధిగా పాటించాలి.

**వారు తీసుకొనవలసిన ఆహారపదార్థాలు :** బ్రెడ్, గోధుమ బ్రెడ్, బిస్కత్తులు, అన్ని రకాల కూరలు, పప్పుదినుసులు, పళ్ళు, తాజాగా టిన్నులో అమ్మే చేపలు, ఎండు చేపలు, సూర్యకాంత నూనెలోగానీ, సోయాబిన్‌లోగానీ వేయించిన ఆహారపదార్థాలు, తగిన మోతాదులో మాంసం, (కోడి అయితే శ్రేష్ఠం) జామ్, జెల్లి, తేనె, పంచదార, ఉడకబెట్టిన తీపి పదార్థాలు, పూరీ, చాక్లెట్లు, కోడిగుడ్డులోని తెల్లటి భాగం. (మధుమేహంతో బాధపడేవారు మరీ తీపి పదార్థాలు తినరాదు. హైపర్ టెన్షన్ అధికంగా వున్నవారు ఉప్పు తగ్గించాలి.)

కొవ్వు పదార్థం చాలా తక్కువగా వున్న

జొవార్ రోటీ :

**కావలసిన పదార్థాలు :** $2\frac{1}{2}$ కప్పుల జొన్న పిండి. తగినంత ఉప్పు.

తయారు చేయవలసిన విధానం : $\frac{3}{4}$ కప్పు నీరు తీసుకుని అందులో ఉప్పు వేసి ఆ నీటిని స్టవ్ మీద వుడకపెట్టాలి. నీరు వుడికిన తరువాత పాత్రని స్టవ్ మీద నుంచి తీసి అందులో రెండు కప్పుల పిండి వేసి బాగా కలియదీసి గట్టి వుండలా చేసుకోవాలి. ఆ వుండని నాలుగు సమభాగాలుగా చేసుకోవాలి. మిగిలిన పిండి సహాయంతో వాటిని రొట్టెలు వత్తుకున్నట్లు వత్తుకోవాలి. ఆ తరువాత వాటిని తావా మీద కాల్చాలి. ఒక వైపు కాస్త కాలిన వెంటనే రొట్టెచుట్టూ తావా మీద కొద్దిగా నీరు చల్లాలి. ఆ తరువాత రొట్టె వెనుకభాగం కాల్చాలి. ఇలా చేసిన తరువాత వాటిని బొగ్గుల మీదగానీ, సన్నటి సెగమీదగానీ రొట్టెలు చేసే



వర్ణచిత్రం : సత్యకుమార్

చట్రం సహాయంతో కాల్చాలి. అవి ఉబ్బగానే వాటిని తీసి పళ్ళెంలో వేసుకోవాలి. ఇలా చేసుకున్న జొన్న రొట్టెలు పప్పుతోగానీ, ఉల్లి పచ్చడితోగానీ వేడివేడిగా తింటే ఎంతో రుచిగా వుంటాయి.

లో కొలెస్టరాల్ పాన్‌కేక్ :

**కావలసిన పదార్థాలు : 1 కప్పు మైదా, 1 కోడిగుడ్డు (తెల్లటిభాగం మాత్రం) 1 కప్పు మీగడ తీసిన పాలు, 1 టేబుల్‌స్పూన్ పంచదార, 1 టీస్పూన్ నిమ్మరసం, చిటికెడు ఉప్పు, వేయించడానికి తగినంత సూర్యకాంతనూనె.**

**తయారు చేయవలసిన విధానం:** మైదా, ఉప్పు కలిపి ఒక జల్లెడలో జల్లించి వుంచుకోవాలి. దీనికి కోడిగుడ్డులోని తెల్లటి సొన్న, $\frac{1}{2}$ కప్పు పాలు చేర్చాలి. ఈ మిశ్రమాన్ని బాగా మెత్తగా అయ్యే వరకు చిలకాలి. ఇప్పుడు మిగిలిన $\frac{1}{2}$ కప్పు పాలు కూడా కలిపి బాగా చిలకాలి. ఒక తావా తీసుకుని దాని మీద ఈ పిండిని దోసెకి పోసుకునేటట్లు పొయ్యాలి. సన్నటి సెగ మీద వుంచుతూ తావా మీద చుట్టుతా నూనె వేసి దోసె తయారైన తరువాత దాని మీద కొద్దిగా పంచదార, కాస్త నిమ్మరసం చుక్కలు వేసి మడతబెట్టి ఆరగించాలి.

మరికాస్త రుచి కోరేవారు ఉల్లిపాయ ముక్కలు, క్యారట్ కోరు, జున్ను కూడా ఈ దోసె పిండికి చేర్చి దోసెలు పోసుకోవచ్చు.

ఫిష్ కర్రీ :

**కావలసిన పదార్థాలు :** $\frac{1}{2}$ కిలో చేపలు 1 చిన్న ఉల్లి పాయ (ముక్కలు) తగినంత ఉప్పు, వేయించు కోడానికి తగినంత సూర్యకాంత నూనె, ఇవికాక - చిన్న అల్లం ముక్క, $\frac{1}{4}$ టీస్పూన్ పసుపుపొడి, 1 పెద్ద ఉల్లిపాయ, 3 పచ్చిమిరపకాయలు, కొద్దిగా కొత్తిమెర $\frac{1}{4}$ టీస్పూన్ సోంపు గింజలు, 2 లేక 3 వెల్లుల్లి - వీటన్నిటినీ కలిపి ముద్దగా చేసి వుంచుకోవాలి.

**తయారు చేయవలసిన విధానం:** మొదట చేపను శుభ్ర పరచి వుంచుకోవాలి. నూనె కాగిన తరవాత అందులో ఉల్లిముక్కలు వేసి వాటిని బాగా వేయించుకోవాలి. ముద్దగా చేసి వుంచుకున్న మసాలాని ఈ ముక్కలకి చేర్చి వేయించాలి. ఈ మిశ్రమానికి తగినంత నీరు చేర్చి చిక్కగా అయ్యేవరకు బాగా ఉడకనివ్వాలి. ఇప్పుడు దీనికి చేప చేర్చి పాత్రకి మూత పెట్టి చేప బాగా ఉడికే దాకా ఆ విధంగానే వుంచాలి. ఇలా చేసుకున్న ఫిష్‌కర్రీ బ్రెడ్‌తోగానీ, అన్నంలోగానీ, రొట్టెలతో గాని ఆరగిస్తే రుచిగా వుంటుంది.

ఆనియన్ సూప్ :

కావలసిన పదార్థాలు : 8 పెద్ద ఉల్లి పాయలు (ముక్కలు), 2 టేబుల్ స్పూన్ల మైదా, మాంసంగాని, కూరలుగాని ఉడకబెట్టిన తరువాత మిగిలిన నీరు, ½ టీస్పూన్ పంచదార, వేయించ డానికి తగినంత సూర్యకాంత నూనె, తగినంత ఉప్పు.

**తయారు చేయవలసిన విధానం :** నూనె కాగిన తరువాత అందులో ఉల్లిపాయ ముక్కలు వేసి వేయించాలి. వీటికి పంచదార, ఉప్పు చేర్చాలి. ఆ తరువాత మైదా చేర్చి బాగా కలియబెట్టాలి. కూరలుగానీ, మాంసంగానీ ఉడకబెట్టిన తరువాత మిగిలిన నీటిని (అందులో పోషక పదార్థాలు వుంటాయి) ఈ మిశ్రమానికి చేర్చి ఉడకబెట్టాలి. ఈ సూప్‌ని—కాల్చిన బ్రెడ్‌తోపాటు ఆరగిస్తే బాగుంటుంది.



**తడి ఇసుకపై పెట్టిన కుండలో ఆకు కూరలను భద్రపరిస్తే అవి ఫ్రిజిడైరులో పెట్టిన వాటిలా తాజాగా వుంటాయి. గ్రుడ్లు కూడా ఈ విధంగా వుంచితే చాలాకాలం నిలవ వుంటాయి.**



**కాలి పట్టీలు (గజ్జెలు) నల్లగా అయితే వాటిని బంగాళా దుంపలు వుడికించిన నీళ్ళల్లో కడిగితే అవి తళతళా మెరుస్తాయి తెలుసా !**

—స్వరూపాసాగర్

మొలగా త్వాని సూప్ :

సాధారణంగా శ్రీలంకవాసులు ఈ సూప్ చేసుకుంటూ వుంటారు.

కావలసిన పదార్థాలు : 2 టేబుల్ స్పూన్ల పులావ్ బియ్యం, 2 పెద్ద ఉల్లి పాయలు (ముక్కలు) 2 టేబుల్ స్పూన్ల మైదా, 6 కప్పుల కూరలు ఉడకబెట్టగా మిగిలిననీరు 2 టీస్పూనుల కర్రీ పౌడర్, 1 టీస్పూను నిమ్మరసం, 1 పెద్ద టొమేటో (ముక్కలు) 1 ముక్క మసాలా ఆకు, కారట్ (ముక్కలు) తగినంత ఉప్పు, 2 టేబుల్ స్పూన్ల సూర్యకాంత నూనె.

**తయారు చేయవలసిన విధానం :** నూనెలో ఉల్లి ముక్కలు వేసి ఐదు నిముషాలసేపు వేయించాలి. ఆ తరువాత మైదా కలిపి బాగా కలియబెట్టాలి. ఈ మిశ్రమం కొద్దిగా ఉడుకుతూ వుండగా కూరలు ఉడకబెట్టగా మిగిలిన నీటిని అందులో పోసేయ్యాలి. ఈ మిశ్రమం గట్టిపడే దాకా ఆ విధంగా కలియబెడుతూ వుండాలి. తర్వాత కర్రీ పౌడర్, ఉప్పు, క్యారట్, టొమేటో, ముక్కలు, నిమ్మరసం, మసాలా ఆకు—బాణలికి చేర్చాలి. సన్నని సెగ మీద ఉడకనివ్వాలి. మసాలా ఆకు విడిగా తీసి తక్కిన మిశ్రమాన్ని బ్లెండర్‌లో గానీ కవ్వంతోగానీ రసంవలె చిలకాలి. ఈ రసానికి బియ్యం కలిపి సన్నటి సెగమీద ఉడకబెట్టి క్రిందకి దింపాలి. వేడివేడిగా ఈ సూప్ తీసుకుంటే ఎంతో రుచిగా వుంటుంది.

కాలిఫ్లవర్ కాసారాలి :

కావలసిన పదార్థాలు : 1 మీడియం సైజు కాలిఫ్లవర్, 1 టేబుల్ స్పూన్ ఉల్లి పాయ ముక్కలు, 3 కప్పులు మీగడ తీసిన పాలు, ½ టీస్పూన్ మిరపపొడి ½ టీస్పూన్ టొమాటో సాస్, 1 వెల్లుల్లిముక్క, ½ కప్పు బ్రెడ్డు ముక్కలు, తగినంత ఉప్పు, కొంత సూర్యకాంత నూనె.

**తయారు చేయవలసిన విధానం :** కాలిఫ్లవర్‌ని బాగా కడిగి పువ్వులు ఒక్కొక్కటే విడిగా తీసి వుంచుకోవాలి. వీటిని గోరువెచ్చటి నీటిలో వేసి కాస్త తెల్లబడేదాకా ఉడకబెట్టి ఆ తరువాత ఒక పాత్రలో వేసుకోవాలి. నూనెలో ఉల్లిముక్కలు వేసి అవి వేసిన తరవాత కాస్త మొక్కజొన్న గానీ, మైదాపిండిగానీ అందులో వేసి బాగా కలియ దియ్యాలి. ఆ తరువాత కొంచెం కొంచెంగా పాలు కలుపుతూ ఈ మిశ్రమం గట్టిపడేదాకా కలియ బెట్టాలి. ఇప్పుడిక ఉప్పు, మిరపపొడి, టొమేటో సాస్, వెల్లుల్లి దీనికి చేర్చాలి. ముందుగా ఉడకబెట్టి వుంచుకున్న కాలిఫ్లవర్ మీద ఈ మిశ్రమాన్ని పోసి వాటి మీద వేయించిన బ్రెడ్ ముక్కలను చల్లుకోవాలి. ఘమఘమలాడుతూ రుచిగల కాలిఫ్లవర్ కాసొరోలి తయారైందన్నమాట. □

—శోభారామ్‌జీ

గుండెజబ్బుతో వున్నవారు తీసుకోవలసిన ఆహారపదార్థాలు :

| వేళలు | శాకాహారులకు | మాంసాహారులకు |
|---|---|---|
| ఉదయం అల్పాహారం | 2 ఇడ్లీలు, కొద్దిగా చట్నీతోనూ, ఉల్లిపాయ సాంబారుతోనూ (నెయ్యి వుండకూడదు) కాఫీ, టీ లేదా మీగడలేని పాలు. | 1 పప్పులదోసె (సూర్యకాంతి నూనెతో కాల్చాలి) బటానీల చట్నీతో, కాఫీ, టీ లేక మీగడలేని పాలు. |
| మధ్యాహ్నం | 1 గ్లాసు తీపి లస్సీ | 1 లేత కొబ్బరికాయ నీరు |
| భోజనం | కొద్దిగా వరి అన్నం, అందులో మూడవవంతు పప్పు, 1 కప్పు రసం, కోరిన క్యారట్, పప్పుతో వుడకబెట్టిన ఆకుకూర, 1 కప్పు, మీగడ తీసివేసిన పాలనుంచి తీసిన పెరుగు 1 అరటిపండు గానీ మరేదైనా పండుగాని. | కొద్దిగా వరి అన్నం, కొద్దిగా చేప, కోడి, లేదా మాంసం కూరలలో ఏదో ఒకటి, (మసాలా అధికంగా వుండకూడదు) పచ్చి కూరలు, పప్పు, ఒక అరటిపండు గానీ మరే దైనా పండు గాని. |
| సాయంత్రం | లేత కొబ్బరి నీరు | లస్సీ గానీ పళ్ళరసం గానీ |
| రాత్రి భోజనం | 3 చిన్న పుల్కా రొట్టెలు గానీ, 2 పుల్కా రొట్టెలు, కొద్దిగా అన్నం గానీ, పప్పుతో చేసిన కూర, 1 గ్లాసు లస్సీ | 2 లేక 3 పుల్కా రొట్టెలు పాల కూరతో గానీ కూరలతో గానీ చేసిన మాంసం కూరతో, 1 కప్పు పెరుగు. |
| నిద్రించేముందు | డికాక్షన్ తక్కువగా వున్న కాఫీ, టీ లేక మీగడ తీసిన పాలు. | పాలు, కాఫీ, టీ లేక మీగడ లేని పాలు. |

ఉగాది కథల పోటీలో
మూడవ బహుమతి
రూ. 200 పొందిన
కథ

# పసుపు కుంకుమలు

జి. ఉషావిఠల్



భోజనం చేసి, విస్తరాకుల్ని పారేయడానికి వీధిలోకి వచ్చిన అన్నపూర్ణమ్మ—

"ఏమండోయ్! మీ మాణిక్యం బగారు పోయారట!" అంటూ పక్కింటావిడ పలకరించి చెప్పగానే, తన చెవుల్ని తనే నమ్మలేక ఆశ్చర్యంగా, "ఏమిటీ?" అనడిగింది.

"అవునండీ! ఇందాక మా అబ్బాయిని కొబ్బరి కాయ పత్రమ్మని బజారుకి పంపించాను. వాడు వస్తూ, వాళ్ళింటిముందు జనం నిల్చుని వుండటం చూసి, వెళ్ళి కనుక్కున్నాడట...." ఆవిడ మాట పూర్తి చెయ్యలేదు. అన్నపూర్ణమ్మ సుడిగాలిలా యింట్లోకి ప్రవేశించి—

"ఇదిగో! మిమ్మల్నే! ఇది విన్నారా? మా మాణిక్యంవదిన పోయిందట!" అని భర్తని కేకేసింది. భోజనంచేసి, వాలు కుర్చీలో విశ్రాంతిగా పడుకుని, ప్రొద్దుట వొకసారి చదివిన పేపర్నే మరోసారి తిరగేస్తున్న సూరప్పగారు భార్య కేకలకి తుళ్ళిపడ్డాడు.

"నీకేమన్నా మతిపోయిందేమిటే? పొద్దున్న బజార్నించి వస్తూ మీ సత్యం అన్నయ్యని పలకరించే వచ్చాను. అప్పుడు ఆవిడ కూర తరుక్కుంటూ నడవలో కూర్చుని వుంది. 'శారద దగ్గర్నించి వుత్తరాలు వస్తున్నాయా?' అని కూడా అడిగింది. ఆవిడ పోవడమేమిటి? నువ్వు పొరపాటు విని వుంటావు!" అన్నారు ఖంగారుగా. అన్నపూర్ణమ్మ ఆ మాటకి సమాధానం చెప్పేలోపునే, మాణిక్యాంబ గారి మనవడు పదహారేళ్ళ రామం గుమ్మంలో కొచ్చి.

"మా బామ్మగారు పోయారండీ! ఈ మాట మీతో చెప్పిరమ్మన్నారు నాన్నగారు." అన్నాడు.

"నాయనా రామం! ఐతే నేను విన్నది నిజమేనా? అయ్యో! వదినా!" అంటూ అంటు చెయ్యన్నా కడుక్కోకుండా అన్నపూర్ణమ్మ గోడకి చేరగిలబడి యేడవటం మొదలుపెట్టింది.

"పొద్దున నేను మీ తాతయ్యతో మాట్లాడుతుంటే కూర తరుక్కుంటూ అక్కడే వుంది గదుటోయ్! ఇంతలో ఏం ముంచుకు వచ్చింది?" సూరప్పగారి ప్రశ్నకి సమాధానంగా రామం –

"నేనూ యింట్లో లేనండీ, భోజనం చేసి ఫ్రెండింటికి వెళ్ళాను. నేను వెళ్ళేదాకా బామ్మ

బాగానే వుంది. నిన్న శనివారం ఉపవాసం కదా, అందుకని మాతోనే భోజనం చేసింది. భోజనంచేసి, తమలపాకులు వేసుకుంటూ వుంటే యెక్కిళ్ళు వచ్చాయట! అసలు బామ్మ పోయిన సంగతి ముందు యెవరూ గమనించలేదట! నడవా తలుపుకి జారగిలపడి కళ్ళు మూసుకు కూర్చున్నట్టు వుంటే అమ్మ, "లోపలికివెళ్ళి పడుకోండి అత్తయ్యా!" అంటూ కుదిపేసరికి అలాగే వాలిపోయిందట. వెంటనే డాక్టర్‌కి కబురంపేరట. నేను ఫ్రెండింటి నించి, యింటికి రాగానే నాన్న సైకిల్‌మీద వెళ్ళి, "వూళ్ళోని బంధువులందరికీ యీ మాట చెప్పి రారా!" అంటూ తరిమేరు. ఇంకా మా అమ్మమ్మ గారింటికి వెళ్ళాలి. వస్తానండీ!" అంటూ వెళ్ళి పోయాడు.

"ముందా అంటు చెయ్యి కడుక్కుని బయల్దేరు. వెళ్ళి చూసొద్దాం!"

"లేచినవేళ యెలాంటిదో! ఎంత మాట వినాల్సి వచ్చిందీ!" అనుకుంటూ భార్యాభర్తలు సత్యన్నారాయణగారింటికి బయలుదేరారు. మాణిక్యాంబ, అన్నపూర్ణమ్మకు స్వంత వదిన కాదు. ఆమె వేలువిడిచిన అన్నగారి భార్య. వాళ్ళిద్దరికీ బంధుత్వం కంటే స్నేహమే యెక్కువ! ఇద్దరూ వొకే యీడు వాళ్ళవటం చేత కలిసినప్పుడల్లా తమ, తమ కష్టసుఖాలు కలబోసుకుంటూ వుండే వారు. మాణిక్యాంబది పెద్ద సంసారం! ముగ్గురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూనూ! కొడుకులు ప్రయోజకులయ్యేదాకా కాస్త యిబ్బందులు పడ్డా, ప్రస్తుతం వాళ్ళ పరిస్థితి బాగానే వుంది. కూతుళ్ళకీ, కొడుకులకీ అందరికీ వివాహాలయిపోయాయి. ముగ్గురు కొడుకుల్లోనూ, ఆఖరివాడు మాత్రం వుద్యోగరీత్యా దూరాన వుంటున్నాడు. మిగిలిన యిద్దరూ, స్వంత వూళ్ళోనే చిన్న చిన్న వుద్యోగాలు చేసుకుంటూ, వున్న కొద్దిపాటి ఆస్తినీ సంరక్షించు కుంటూ తల్లిదండ్రులతో వుంటున్నారు. అన్నపూర్ణమ్మకి ఒక్కర్తే కూతురు శారద! అల్లుడు ఉత్తరాదిలో యింజనీరు. సూరప్పగారు కాలంలో కలప వ్యాపారంచేసి బాగా గడించారు. ఉన్న వూళ్ళో లంకంత కొంప, అన్నపూర్ణమ్మ ఒంటి నిండా బంగారం, బేంకులో ఫిక్సెడ్‌లో యాభై వేల దాకా రొఖ్ఖం కాక పదెకరాల పొలం, తోటలూ వగైరాలన్నీ వున్నాయి. వాళ్ళకున్న లోటల్లా యింత ఆస్తికీ వారసుడు లేకపోవడమే! ఏనాటి కైనా కూతురి కొడుకుని తెచ్చుకుని తమ దగ్గర అట్టే పెట్టుకుని ఆస్తి అప్పజెప్పాలని వాళ్ళ ఆలోచన.

*

పచ్చగా పసుపు రాసుకున్న ముఖాన కాణీ కాసంత ఎర్రని కుంకం బొట్టు, తమలపాకులతో పండిన యెర్రని పెదాలు, గుంటూరు నేత చీరలో— మాణిక్యాంబ నిద్రపోతున్నట్టే వుంది.

"ఇంత పసుపు కుంకుమలతో పోవడం కంటే ఆడదానికింకేం కావాలి? ఎంత పుణ్యం చేసుకొని వుండాలి! ఇలాంటి చావు రావడం అంటే మాటలా!"

"ఏమైనా మాణిక్యాంబ మనసు మహా దొడ్డది! కోడళ్ళనీ కూతుళ్ళలాగే చూసుకుంది. ఈనాటిదాకా కోడళ్ళని వంటింటికేసి రానిచ్చే దేవిటి? ఒక్క పొల్లు మాట యెరుగదు కదా! మహా యిల్లాలు!" చుట్టూ చేరిన అమ్మలక్కలు చెప్పుకుంటున్నారు. అన్నపూర్ణమ్మ కళ్ళు వత్తుకుంటూ, సత్యన్నారాయణగారిని సమీపించి——

"రాయిలాంటి మనిషి! ఒక రోగమా? రొష్టా? ఎంతలో యెంత ముంచుకు వచ్చిందన్నయ్యా!" అంటూ పలకరింపుకి దిగింది.

"భోజనం చేసి, తాంబూలం నవుల్తూ గడప దగ్గర కూర్చునుందమ్మా! ఇంతలో యెక్కిళ్ళు మొదలయాయి. ఎవరో కేకేస్తే, "వెళ్ళి మంచి నీళ్ళు తాగు!" అని వీధిలోకి చక్కాపోయాను నేను. ఒక్క క్షణం ఆగి, వెనక్కి తిరిగి చూడ నన్నా చూశాను కాదు. ఎప్పుడు ఆ పక్షి యెగిరి పోయిందో? యెవరికీ తెలీదు. పెద్దకోడలు, తలుపుకి జారగిలబడి, కళ్ళు మూసుకుని కూర్చుని వుండటం చూసి, లోపల పడుకోమని చెబ్దామని చెయ్యి వేసేసరికి యేముంది? అంతా అయిపోయింది! 'ఈ కోపిష్టి మనిషితో వేగలేనమ్మా!' అంటూ వుండేది. వేగలేక వేగం వెళిపోయిందేమో!" అంటూ వుత్తరీయం ముఖానికి అడ్డు పెట్టుకుని రోదించసాగేరు సత్యనారాయణగారు. సూరప్పగారు, ఆయన భుజం తడుతూ —

"ఊరుకో! ఎంత యేడిచినా పోయిన మనిషి తిరిగి రాదు. నిజానికి ఎంతో పుణ్యాత్మురాలావిడ! అనాయాస మరణం అందరికీ వస్తుందా?" అంటూ వోదార్చేరు.

చీకటి పడకుండా జరగాల్సిన కార్యక్రమం జరపాలని ఎవరో హెచ్చరించడంతో, నలుగురూ మాణిక్యాంబ అంత్యక్రియలకి ప్రయత్నం చెయ్య సాగారు. దూరాన వున్న చిన్న కొడుకూ, కూతుళ్లు రాలేదనేగాని, హఠాత్తుగా పోయిన మాణిక్యాంబకి, అయినవాళ్ళూ, బంధువులేగాక, వీధి వీధంతా కన్నీటితో వీడ్కోలిచ్చారు.

*

ఆ రోజు చీకటి పడ్డాక ఇంటికి చేరుకున్న ఆ దంపతులకి, వంట చేసుకుని భోజనం చెయ్యాలన్న ధ్యాస కలగలేదు. ఇద్దరూ స్నానాలు చేసి, రెండు పళ్ళు తిని మజ్జిగ తాగి పడుకున్నారు. అన్నపూర్ణమ్మకి, కన్నుమూసినా, తెరిచినా కళకళలాడి పోతూ ఇన్ని పువ్వులూ, పసుపూ కుంకుమలతో పెళ్ళికూతురిలా వెళ్ళిపోయిన మాణిక్యాంబ రూపమే కళ్ళకు కట్టినట్టుంది.

'ఏమైనా వదిన అన్నివిధాలా అదృష్టవంతురాలు. రామలక్ష్మణుల్లాంటి కొడుకులూ, ఇంటి నిండా కలకల్లాడుతూ గిలిగిచ్చకాయల్లాగ మనమలూ, మనవరాళ్ళూనూ! అంతకంటే ఆడదానికి కావలసిందేముంది?' అనుకుంది అన్నపూర్ణమ్మ. ఆ మాటే అప్పుడప్పుడు తను ఆవిడతో అంటే ఆవిడ ఒప్పుకునేది కాదు.

"ఏమి అదృష్టంలే వదినా! చాకిరీ చెయ్యలేక ఛస్తున్నానంటే నమ్ము! మీ అన్నయ్య కోపం, ఛాదస్తం నీకు తెలీనివా? పొద్దున్న పూజకి, జపానికి అన్నీ అమర్చి వుంచకపోతే ఆయన ఎగరటం మొదలు పెడతారు. పదిన్నరయేసరికి మడిగా భోజనం లేకపోతే చిందులు తొక్కేస్తారు గదా! ఇవన్నీ కోడళ్ళకి గిట్టవు. మనకాలం కాదు, మొగుడి అడుగుకి మడుగులొత్తుతూ గడగడలాడి పోతూ చాకిరీ చెయ్యడానికి. భోజనం చేసి వక్కపొట్లం విప్పుకుని, వేసుకోవడానికి కూడా బద్ధకమే ఆయనకి! వంటింట్లో ఎంత పనిలో వున్నా, వచ్చి ఆయనకి వక్కపొట్లం విప్పి చేతిలో వెయ్యాల్సిందే! ఇవన్నీ ఈ కాలం వాళ్ళకి కిడతాయా? ఆయన కోపానికి తగ్గట్టు నడుచుకుంటూ, ఇటు కొడుకులకి, ఆయనకి మధ్య గొడవలు రాకుండా, కోడళ్ళకి మనసు నొవ్వకుండా వుండాలంటే నేను చక్రంలా తిరిగి చాకిరీ చేస్తే గానీ జరగదు." అంటూ వాపోతూ వుండేది. పైగా,

"నీకేంవిటి లోటు అన్నపూర్ణా! అపురూపంగా చూసుకునే భర్త! ముత్యంలా కూతురూ, మనవలూ! ఇంటి కింకెడు ఆస్తి, వంటికి వంకెడు

బంగారం!" అనేది. అదృష్టానికి నిర్వచనం డబ్బు వుండటమా? ఈ రోజు మాణిక్యాంబ పోయినప్పుడు చుట్టూ చేరిన ఆవిడ కొడుకుల్ని, కోడళ్ళని, మనవల్ని చూస్తూవుంటే, వాళ్ళ దుఃఖం వింటే, డబ్బుతో ఆ ప్రేమని కొనగలమా అని అనిపించ లేదూ తనకి? రేపు తను పోతే? అవును! తను కూడా హఠాత్తుగా మాణిక్యాంబలాగ పోతే తన కెవరున్నారు? భర్త తప్ప! దూరాన వున్న కూతురు యెప్పటికి వచ్చేను?

హఠాత్తుగా అన్నపూర్ణమ్మకి యెప్పుడూ కలగని దిగులు, భయం—మనసునిండా అలము కున్నాయి. కళ్ళల్లో తిరిగిన నీటిని చీర కొంగుతో వత్తుకుని, అప్పుడే నిద్రలోకి జారిన భర్తవైపు తిరిగింది అన్నపూర్ణమ్మ. తనకెందుకింత దిగులు కలుగుతోంది? మాణిక్యాంబ చెప్పినట్టు అపురూపంగా చూసుకునే తన భర్త, తను కన్ను మూస్తే పదిమంది కొడుకులకన్నా, మనవలకన్నా దుఃఖిస్తాడు. తనకే లోటూ జరగకుండా అంతా సక్రమంగా జరిపిస్తాడు. మగపిల్లలు లేనంత మాత్రాన తను దురదృష్టవంతురాల్నని వాపోవడం అనవసరం! 'ఒకవేళ ఆయనే ముందుపోతే? ఛా! ఛా! ఆయన ముందు పోవడమేమిటి! ఏం? ఎందుకు పోకూడదూ? చావుబ్రతుకులు మనుషుల చేతుల్లో వున్నాయా? ఛీ! ఛీ! ఏమిటీవాళ యిలాంటి విపరీతమైన ఆలోచనలు వస్తున్నాయి?' అనుకుంటూ యెటో పరిగెడుతున్న మనసుని మరో వైపుకి మళ్ళించడానికి విశ్వప్రయత్నం చేసి ఓడి పోయింది అన్నపూర్ణమ్మ. ఆవిడకి వరసగా తన బంధుకోటిలోని అనేకమంది పూర్వ సువాసినులు జ్ఞాపకం రాసాగేరు. వాళ్ళ, వాళ్ళ భర్తలు పోయిన ఘట్టాలు, ఆ తర్వాత పదో రోజు తంతు మొదలైన విషయాలన్నీ గుర్తుకి వచ్చి అన్నపూర్ణమ్మకి శరీరంలో ఒక విధమైన వణుకులాంటిది పుట్టుకు వచ్చింది. ఉన్నట్టుండి భర్త గుఱక ఆగిపోయి నట్టనిపించి, విపరీతమైన భయంతో వణుకుతున్న చేతిని భర్త గుండెల మీద వేసింది. సూరప్పగారా స్పర్శకి కదిలి, "ఇంకా పడుకోలేదూ?" అని ప్రశ్నించి, అన్నపూర్ణమ్మ సమాధానానికి యెదురు చూడకుండా, మళ్ళీ నిద్రలోకి జారిపోయారు. అన్నపూర్ణమ్మ గాఢంగా నిట్టూర్చి, నిద్రపోవడానికి చేసే ప్రయత్నంగా మరోవైపుకి వత్తిగిల్లింది. ఏనాడూ లేని వంటరితనం ఆవిడని చుట్టుముట్టింది. చావు యెవరికైనా చెప్పి వస్తుందా? నిన్న యీపాటికి నలుగురి మధ్యా, హాయిగా నిద్రపోయిన మాణిక్యం వదిన, యీ రోజు యీ వేళకి లేదు. విచిత్రంగాదూ? ఏమిటీ ఆలోచనలు? భర్త పోతే అనే ఆలోచనెందుకు తనకి కలుగుతోంది? తను పోతేనో అని తనకెందుకు అనిపించడంలేదూ? మనసు యిలా పరిగెట్టడం. ముందు జరగబోయే సంఘటనలకి సంకేతం కాదుకదా? "భగవాన్! నన్ను వంటరిదాన్ని చెయ్యకు! మాణిక్యం వదిన లాగే, ఆయన వుండగా పసుపు కుంకుమలతో పోయే అదృష్టాన్ని నాకు కలిగించు. నిన్నింకేమీ కోరను. ఆయన లేకుండా నేను బ్రతకలేను. ఆ జీవితాన్ని నేనసలు వూహించుకోలేను కూడా!" అన్నపూర్ణమ్మ చీకట్లో రెండు చేతులూ జోడించి, భగవంతుడ్ని వేడుకుంది. తెల్లారిగట్ల చిన్న కునుకు పట్టిన ఆవిడకి, బ్రతికున్న భర్తృహీనలూ, చనిపోయిన పుణ్యస్త్రీలూ కలగాపులగంగా కలల్లో కనిపించి మరింత మనసుని బాధించారు.



**ఈ కథ రాసిన శ్రీమతి జి. ఉషావిఠల్ భర్తతో పాటే, బెంగుళూర్లోని నేషనల్ ఏరో నాటికల్ లేబరేటరీలో కంప్యూటర్ ఆపరేటర్‌గా పనిచేస్తున్నారు. ఆమె స్వస్థలం-శ్రీకాకుళం జిల్లాలోని పాత్రుని వలస గ్రామం. చలనచిత్ర రచయితగా ప్రసిద్ధులైన కీ. శే. వెంపటి సదాశివబ్రహ్మంగారి అమ్మాయి - ఉష. ఆమె చదువు మద్రాసులోనే సాగింది. ఎతిరాజ్ కళాశాలలో బి. ఏ. చదివారు. శ్రీమతి ఉషావిఠల్ 1962 లో తొలి కథ రాశారు - అది 'ఆంధ్రప్రభ' వార పత్రికలో అచ్చయింది. అప్పట్నుంచి, ఎక్కువగా కాకపోయినా అప్పుడూ అప్పుడూ వివిధ పత్రికల్లో కథలు రాశారు. సహజత్వానికి దగ్గరగా వుండే కథలన్నా, పుస్తకాలన్నా, లలిత సంగీతం అన్నా - ఆమెకు ఇష్టం. ఉషా - విఠల్ దంపతులకు ఒక అబ్బాయి, ఒక అమ్మాయి-సంతానం.**

*

పనిమనిషి, "అమ్మగారూ!" అని పిలుస్తూ తలుపు తడుతూవుంటే చటుక్కున మెలకువ వచ్చింది అన్నపూర్ణమ్మకి. లేచి, మంగళ సూత్రాలు కళ్ళ కద్దుకుని, మంచం దిగి పనిమనిషికి తలుపు తీయడానికి వీధి గుమ్మంవైపు వెళ్ళబోయి, భర్త మూలుగు విని గాభరాగా భర్త మంచం దగ్గరకి వెళ్ళి "ఏమండీ!" అని పిలుస్తూ వంటి మీద చెయ్యి వేసింది. సూరప్పగారి వళ్ళు సలసల కాగి పోతోంది.

"ఒళ్ళంతా నొప్పులుగా వుంది. కాస్త జ్వరం కూడా తగిలినట్టుంది. నిన్న—వేళగాని వేళ చేసిన స్నానం వల్ల వచ్చి వుండొచ్చు. కాఫీతో ఏదైనా మాత్ర వేసుకుంటే అదే తగ్గిపోతుంది." అన్నారు సూరప్పగారు మూలుగుతూ. అన్నపూర్ణమ్మకి కాళ్ళూ చేతులూ ఆడలేదు. నిన్నటి షాక్ నించి ఆవిడింకా తేరుకోలేదు.

"మాత్ర కాదు. డాక్టర్‌గారికి కబురు పంపిస్తాను." అంటూ భర్త వారిస్తున్నా వినకుండా పని మనిషికి తమకి వాడుకగా వైద్యం చేసే డాక్టర్ గారింటికి పంపించి, తను మొహం కడుక్కుని కాఫీ తయారు చెయ్యసాగింది. యాంత్రికంగా పనులు చేస్తున్నా ఆవిడ మనసు, మనసులో లేక పోవటం వల్ల పాలు పొంగిపోయాయి. ఫిల్టర్ చెయ్యి తగిలి పడిపోయి డికాషనంతా నేలపాలై పోయింది. "దేముడా! రాత్రి నా వెర్రి మొర్రి ఆలోచన లేమిటి? తెల్లారేసరికి ఈయనకీ జ్వరం ముంచుకు రావడం ఏమిటి? అమ్మా! పార్వతీదేవీ! నీకు శుక్రవారం ఆయన పేరున కుంకుమార్చన చేయిస్తాను. ఆయన ఆరోగ్యవంతులు అయేటట్టు ఆశీర్వదించు తల్లీ! నీ అంతటి పసుపుకుంకుమల్ని నాకు ఇయ్యవేదేవీ!" కన్నీళ్ళతో పార్వతీ దేవికి మొక్కుకుంది అన్నపూర్ణమ్మ. డాక్టర్‌గారు వచ్చేసరికి సూరప్పగారు నెమ్మదిగా లేచి, మొహం కడుక్కుని కాఫీ తాగారు. డాక్టర్‌గారు పరీక్ష చేసి, ఆదుర్దాగా తనవైపే చూస్తున్న అన్నపూర్ణమ్మతో, "మరేం ఖంగారు లేదమ్మా! మామూలు ఫ్లూ జ్వరం లాంటిది. ఈ మాత్రలు మూడు పూటలు వాడండి. సాయంత్రానికి తగ్గిపోతుంది. మళ్ళీ రేపొద్దున్న వచ్చి చూస్తాను." అన్నారు.

# వనితలకి ఉగాది కానుక

ఉగాది శుభసమయంలో నేషనల్ బుక్ ట్రస్ట్ పాఠకులకి యిచ్చే కానుక — తెలుగు ప్రచురణలన్నీ 10% తగ్గింపు ధరకి లభిస్తాయి. మార్చి 30 మొదలు ఏప్రిలు 13 వరకు, పదిహేనురోజుల పాటు లభించే ఈ సదవకాశాన్ని వినియోగించుకోండి. ట్రస్టు ప్రచురించిన కథలు, నవలలు, యాత్రా వర్ణనలు, జీవిత చరిత్రలు, విజ్ఞాన గ్రంథాలు, బాలసాహిత్యం ఈ క్రింది చోట్ల దొరుకుతాయి. త్వరపడండి.

**ఎన్. బి. టి. బుక్ సెంటర్**
**సిటీ సెంట్రలు లైబ్రరీ**
అశోకనగరం, హైదరాబాదు—500020

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు**
సికింద్రాబాదు

**విశాలాంధ్ర బుక్ హౌసు**
హైదరాబాదు, వరంగల్లు, విజయవాడ, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, అనంతపురం

**నవోదయ పబ్లిషర్సు**
విజయవాడ, గుంటూరు

**నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా**

"ఈ మాత్రం జ్వరానికి డాక్టర్‌గార్ని ఇబ్బంది పెట్టడం ఎందుకే—అంటే వినకుండా మీకు కబురెట్టింది. పట్టి ఖంగారు మనిషి! వేళగాని వేళ స్నానం చెయ్యడం చేత కాస్త నజ్జించినట్టుంది" అన్నారు సూరప్పగారు.

"ఇబ్బందేముంది లెండి. ఈ పూట జావ కాచి ఇవ్వండమ్మా!" అంటూ డాక్టర్‌గారు వెళ్ళిపోయారు. డాక్టర్ ధైర్యం చెప్పినా, భర్త బాగానే మాట్లాడుతున్నా, ఏదో తెలీని భయం, దిగులు అన్నపూర్ణమ్మని చుట్టు ముట్టాయి. భర్తకి జావ కాచియిచ్చి, తనూ అదే తాగి వూరుకుంది. డాక్టర్‌గారు చెప్పినట్టు ఆ రోజు సాయంత్రానికి కాకపోయినా, మర్నాటి సాయంత్రానికి సూరప్పగారి జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. ఆ శుక్రవారంనాడు అనుకున్నట్టు అమ్మవారికి శ్రద్ధగా కుంకుమార్చన చేయించి మొక్కు తీర్చుకుంది అన్నపూర్ణమ్మ.

*

సంధ్యవేళ బజారు వీధి దాకా వాకింగ్‌కి వెళ్ళి వచ్చిన సూరప్పగారు, తమ వీధరుగు మీద శాస్త్రిలుగారు కూర్చునుండటం, అన్నపూర్ణమ్మగారు చేతిలో "స్త్రీల వ్రత కథలు" పుస్తకాన్ని పట్టుకుని ఆయనతో మాట్లాడుతూ నిల్చునుండటం చూసి—

"ఏవిటి విశేషం శాస్త్రులుగారూ? ఇలా వచ్చారు?" అనడిగారు.

"అమ్మగారు యేదో వ్రతం చేసుకోవాల్నుందని కబురుపెడితే యిలా వచ్చాను" ఆయన మాట మధ్యలోనే అన్నపూర్ణమ్మ అందుకుని—

"కైలాసగౌరి నోము నోచుకుందామని, వివరాలు తెలుసుకోవడానికి వారికి కబురు చేశాను." అంది.

"అమ్మా! మరి నేను శలవు తీసుకుంటాను. నేను చెప్పినవన్నీ గుర్తువుంటాయిగా! నేను మంచి రోజు చూసి చెప్తాను. ఆ రోజు నోము పట్టవచ్చు" అంటూ శాస్త్రిలుగారు శలవు తీసుకుని వెళ్ళిపోయారు.

"ఉన్నట్టుండి నోముల మీదికి పోయిందేం మనసు?" అనడిగారు సూరప్పగారు భార్యని.

"ఏదో ఒక వ్యాపకం వుండాలిగా! లేకపోతే తోచదు. అన్నట్టు వో రెండు వీశల పసుపు కొమ్ములు తెప్పించి పెట్టండి. వీశడు పసుపు, వీశడు కుంకం తయారుచేయించి అట్టే పెట్టాలి నోముకి! ఆ పసుపు కుంకాల్ని పళ్ళు, తాంబూలంతో, గుడిలోకి వచ్చే ముత్తైదువులకి, మౌనంగా పంచిపెట్టాలిట" అంటూ భర్త మాటని దాట

# మల్లె మొగ్గల ముగ్గు

15 చుక్కలు ఒకదాని కొకటి సమాన దూరంలో వుండేలా పెట్టుకోవాలి. తరువాత పైన, కింద ఒక్కొక్క చుక్క చొప్పున విడిచిపెట్టి, ఒక చుక్క వచ్చేవరకూ రెండువైపులా పెట్టుకోవాలి. ముందు తొడిమ, తరువాత రక్షక పత్రాలు ఆ తరువాత మొగ్గ -వేస్తూపోతే చక్కని మల్లెమొగ్గల ముగ్గు తయారవుతుంది. ఇంటి మధ్యలో లక్కరంగులతో వేసుకోవడానికి కూడా ఈ ముగ్గు బాగుంటుంది. తొడిమ, రక్షక పత్రాలకు ఆకుపచ్చ, మొగ్గలకు తెలుపు రంగులు వేసుకోవచ్చును.

—వి. అనసూయ





వేసింది అన్నపూర్ణమ్మ. తన మనసులోని భయాల్ని, సందేహాల్ని భర్త పసికడితే తనని హేళన చేసి, ఆట పట్టించవచ్చనే భయం వుందా విడకి. చావు బ్రతుకులు మానవుల చేతుల్లో లేవని తెలిసినా ఆవిడ తన కోరిక తీరడానికి పూర్తిగా భగవంతుడి మీద ఆధారపడదల్చుకుంది.

*

కైలాస గౌరి నోము విజయవంతంగా ముగించి, "తల్లీ! జగదంబా! నేను పట్టెడు పసుపు కుంకుమలతో అనాయాసంగా చనిపోయేటట్టు ఆశీర్వదించు" అంటూ మనఃస్ఫూర్తిగా వేడుకుంది అన్నపూర్ణమ్మ. తర్వాత వరసగా పండు తాంబూలం నోము, గ్రామ కుంకుమ నోము, పదహారు ఫలాల నోము, ఒకటనేమిటి? 'స్త్రీల వ్రత కథ'ల్లో రాసిన పుణ్యస్త్రీలు తమ అయిదవతనంకోసం చెయ్యతగిన నోములన్నీ పట్టేసింది. అదిగాక ప్రతి శుక్రవారం లలితా సహస్రనామం, కుంకుమార్చన చేస్తున్న భార్య ధోరణి సూరప్పగారికి వింతగా కనిపించింది. ఇంతకు ముందూ పూజాపునస్కారం చేసుకుంటూవుండేదిగానీ, మాణిక్యాంబ పోయిన దగ్గర్నించీ నోములూ, వ్రతాలూ, పూజలూ మరీ యెక్కువ కావడం, భార్య మనసులో వున్న యేదో ఆందోళనని అణుచుకోవటానికేనని, అనిపించిందాయనకి. భార్య మనసులోని ఆరాటమేమిటో ఆయన అట్టే వూహించలేకపోయారు. మాణిక్యాంబ, అన్నపూర్ణమ్మ యించుమించు వొకే వయసువాళ్ళు! మాణిక్యాంబ హఠాత్తుగా పోవడంవల్ల భార్యకి మృత్యుభీతి పట్టుకుని పరలోక చింతనవల్ల యీ పూజలూ, వ్రతాలు మొదలెట్టిందేమోనని అనుకున్నారాయన. ఏదిఏమైనా భార్యకి ప్రస్తుతం స్థలం మార్పు, గాలి మార్పు చాలా అవసరం అనిపించసాగింది సూరప్పగారికి. భార్యని యీ వాతావరణంనించి తప్పించి యెక్కడికి తీసుకువెళ్ళడమా అని ఆలోచించారు. ఆయనకి తను కొద్ది కాలం క్రితం పేపర్లో చూసిన యాత్రా స్పెషల్‌ని గురించి వచ్చిన ప్రకటన గుర్తు వచ్చింది.

*

మూడు నెలల పాటు భార్యాభర్తలు ఉత్తర దేశంలో చూడవలసిన యాత్రా స్థలాలన్నిటినీ చూశారు. కాశీలోని అన్నపూర్ణని, విశాలాక్షిని, విశ్వనాథుడిని, కలకత్తాలోని కాళిని, జగన్నాధంలోని జగన్నాధుడిని అన్నపూర్ణమ్మ చేతులెత్తి వేడుకున్నది వొక్కటే— 'పసుపు కుంకుమలతో ముత్తయిదువగా పోయే అదృష్టం నాకు కలిగించు' అని.

యాత్రలు ముగించి స్వస్థలం చేరుకున్న ఆ భార్యాభర్తలు—సత్యన్నారాయణగారు పక్షవాతానికి గురై మంచం పట్టిన సంగతి విని నిర్విణ్ణులై పోయారు. రెండు రోజులు విశ్రాంతి తీసుకుని, మూడో రోజు సాయంత్రం—

"పద! అన్నయ్యని చూసివద్దాం!" అంటూ సూరప్పగారు భార్యని బయలుదేర తీశారు. మాణిక్యాంబ పోయిన తర్వాత చాలా కాలానికి మళ్ళీ అన్నపూర్ణమ్మ ఆ గడపలో కాలు పెట్టింది.

"రండి పిన్నిగారూ! చాలా రోజులకి యిటు వచ్చారు" అంటూ మాణిక్యాంబ పెద్ద కోడలు సరోజ. ఆహ్వానించింది.

"ఈ మధ్య యాత్రలకి వెళ్ళేమమ్మా! తిరిగి వచ్చేసరికి మీ మావఁగారి అనారోగ్యం సంగతి తెల్సింది. మీ అత్తగారు పోవటమే ఆయన్ని మానసికంగా కృంగదీసి వుంటుంది. ఏరీ? హాస్పిటల్లో చేర్పించారా?" అన్న అన్నపూర్ణమ్మ ప్రశ్నకి సరోజ ఆవిడవైపు అదోలాగ చూసి—

"ఆస్పత్రిలో చేర్పిస్తే యిదేమైనా తగ్గే రోగమా? కాలూ చెయ్యీ వున్న నాడే ఆయనకి అన్నీ అందించాల్సి వచ్చేది. ఇంక యిప్పుడు చెప్పేదేముందీ? ఈ ముసలాయనకి చాకిరీ చెయ్యలేక యింటిల్లిపాదిమీ ఛస్తున్నామనుకోండి పిన్నిగారూ! ఆయన కంటే ముందు ఆయన చాకిరీ చెయ్యలేక మేము చచ్చేటట్టు వున్నాము." అంటూ వాళ్ళని మావగారి గదిలోకి తీసుకెళ్ళింది. సత్యన్నారాయణగారి పరిస్థితి చూసి అన్నపూర్ణమ్మ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. మాణిక్యాంబ బ్రతికున్న రోజుల్లో సత్యన్నారాయణగారు పులిలా వుండేవారు. ఆయనకి సహజంగా కోపం కాస్త యెక్కువ అవటంచేత, మాణిక్యాంబ హడలుతూ ఆయన అవసరాలన్నీ చూసేది. కొడుకులు తండ్రి ముందు నోరెత్తేవారు కాదు. కోడళ్ళు గట్టిగా మాట్లాడటానికి జంకేవారు. అలాంటి మనిషి ప్రస్తుతం వొక కాలు, చెయ్యి, నోరు పడిపోయి, సరిగ్గా గాలి వెలుతురూ రాని చీకటి కొట్లో దయనీయమైన స్థితిలో పడి వున్నాడు. సూరప్పగార్ని, అన్నపూర్ణమ్మని చూడగానే సత్యన్నారాయణగారి కళ్ళు ఆనందంతో మెరిసి, అంతలోనే నీళ్ళతో నిండిపోయాయి. కుడిచేతితో ఆప్యాయంగా సూరప్పగారి చేతులు తడుముతూ రోదిస్తున్న ఆయన్ని చూసి సరోజ తిరస్కారంగా—

"మనిషి దగ్గరకి వస్తే చాలు జలగలాగ పట్టుకోవడం! ఇంటి కెవరొచ్చినా యీ యేడుపు వొకటి! అక్కడికి మేమేదో ఆయన్ని నానా బాధలూ పెట్టేస్తున్నట్టు...." అంది. సరోజ మాటలకి అన్నపూర్ణమ్మ మనసు చివుక్కుమంది. అక్కడున్న బల్ల మావగారి మంచానికి దగ్గరగా జరిపి, "కూర్చోండి బాబాయిగారూ! కాఫీకి నీళ్లు పడేసి యిప్పుడే వస్తాను." అంటూ సరోజ గది వదలి వెళ్ళిపోయింది. విసవిస నడిచిపోతున్న సరోజవేపు వింతగా చూసింది అన్నపూర్ణమ్మ. సత్యన్నారాయణగారు నోరు తెరిచి చెప్పలేకపోయినా, ఆయనకి ఆ యింట్లో యెలాంటి ఆదరణ లభిస్తోందో, ఆ గది వాతావరణం చూస్తే తెలుస్తోంది. హఠాత్తుగా అన్నపూర్ణమ్మకి, మాణిక్యాంబ బ్రతికి వున్న రోజుల్లో వొకసారి సత్యన్నారాయణగారికి జబ్బు చేసిన సంగతి గుర్తుకి వచ్చింది. సత్యన్నారాయణగారి వీపు మీద నారకురుపు వేసి చాలారోజులు నానా బాధపడ్డాడాయన, అప్పుడు మాణిక్యాంబ ఆయన్ని కంటికి రెప్పలా, కన్నతల్లి లాగ కాపాడి సేవ చేసింది. ఆ బాధలో అసలే కోపిష్టి మనిషైన ఆయన, ఆవిడని నానా తిట్లూ తిట్టేవాడు. దగ్గరకి వస్తే కొట్టేవాడు గూడా! అయినా ఆవిడ నోరెత్తేది కాదు. ఆవిడే బ్రతికి వుంటే ఆయన స్థితి యిలా వుండనిచ్చేదా? ఇలా కోడలు నోరు మెదిపే అవకాశం యిచ్చి వుండేదా? ఈ రొచ్చులో నోరూ, కాలూ, చెయ్యి లేని యీ మనిషిని యిలా ఆయన ఖర్మానికి పడి వుండమని, ఆ పుణ్యాత్మురాలు తన దారి తను చూసుకుంది. అన్నపూర్ణమ్మ స్నేహితురాల్ని తలుచుకుని గాఢంగా నిట్టూర్చింది. జీవన సంధ్యలో భార్యాభర్తలకి వొకరి అండదండలు మరొకరికి యెంత అవసరమో అని అనిపించిందావిడకి. సరోజ కాఫీ తీసుకువస్తూ గదిలో లైటు వెయ్యడంతో అన్నపూర్ణమ్మ అలవాటు ప్రకారం చటుక్కున మంగళసూత్రాలు తీసి కళ్ళకద్దుకుంటూ—

"భగవాన్! పచ్చెరు పసుపు కుంకుమలతో పుణ్య స్త్రీగా పోయే అదృష్టాన్ని నాకు అనుగ్రహించు." అనుకోబోయి—గతుక్కుమని ఆగిపోయింది! ఛీ! తనెంత స్వార్థపరురాలు? భర్తని వంటరి పక్షిని చేసి నిర్దాక్షిణ్యంగా యీ లోకంలో వదిలేసి పోవాలనుకుంటోంది. తన స్వార్థం కోసం పూజలు చేసేస్తోంది, కనిపించిన దేవుళ్ళందరికీ మొక్కుకుంటోంది. తనకిది తగునా? తను లేకపోతే తన భర్తకి కాలూ చెయ్యి నొస్తే యెవరు చేస్తారు? ఎవరు చూస్తారు? రోగిష్టి మనిషి, కన్నబిడ్డలకి బరువైనా భార్యకి బరువు కాదు! ఇప్పుడు అన్నయ్య వున్న పరిస్థితిలో తన భర్త వుంటే కనీసం యిన్ని నీళ్ళు నోట్లో పోసే దిక్కైనా లేక అల్లాడి పోరా? తనదెంత కఠిన హృదయమై వుండాలి?

"వద్దు! వద్దు! భగవాన్ నా భర్తకి అలాంటి స్థితి రాకూడదు. ఎలాంటి బాధలైనా, యెన్నైనా నేను పడతాను. అంతేగాని ముత్తైదువగా పోవాలనే కోరికతో నా భర్తని వంటరిగా యీ లోకంలో బాధలు పడమని వదలలేను. ఓ పరాత్పరా! చివరంటా ఆయన సేవ చెయ్యగలిగే మనోధైర్యాన్ని, బలాన్ని నాకు ప్రసాదించు తండ్రీ!" అంటూ మనఃస్ఫూర్తిగా ఆ సంధ్యా వేళలో దైవాన్ని ప్రార్థించింది అన్నపూర్ణమ్మ! □



## వైద్య విశేషాలు

కుష్ఠు వ్యాధి నివారణకు దోహదం చేసే వైద్య పరిశోధనలలో భారతీయ వైద్యులు ఇటీవల చెప్పుకోదగ్గ విజయాన్ని సాధించారు. కుష్ఠువ్యాధికి కారణమని భావించే క్రిములపై ప్రయోగాలు జరుపుతున్న భారతీయ వైద్య పరిశోధనామండలి—పరిశోధనా విభాగానికి చెందిన డాక్టర్ ఎన్. వీరరాఘవన్, శ్రీమతి సావిత్రీ సుకుమార్ తాము జరిపిన ప్రయోగాల గురించి ఈ మధ్య కొన్ని వివరాలు వెల్లడి చేశారు. ఈ వ్యాధి వ్యాప్తి చెందడానికి కారణభూతమని భావించే ఎమ్. లెప్రాయ్ అనే క్రిములపై పరిశోధనలు జరిపి, ఆ క్రిములను పెంపు చేయడం జరిగిందని, వీటివల్లే రోగవ్యాప్తి జరుగుతుందన్న విషయం పూర్తిగా నిర్ధారణ అయిన తర్వాత, వ్యాధి నివారణకు ఒక వాక్సిన్‌ను ఉత్పత్తి చేయడానికి అవకాశం వుంటుందనీ వారు చెప్పారు. కుష్ఠు నివారణకు ప్రపంచమంతటా చాలా కాలంగా జరుగుతున్న పరిశోధనలలో ఈ పరిశోధన ఒక విశేషమైన మలుపుగా వైద్య శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

*

మధుమేహ వ్యాధిగ్రస్తులు - తమ దేహంలోని 'బ్లడ్ షుగర్' పరిమాణం తెలుసుకోడానికి, తమకు ఎంత 'ఇన్సులిన్' అవసరమో నిర్ణయించుకోడానికి అనువుగా 'పాకెట్ కాలిక్యులేటర్' సైజులో ఒక సాధనాన్ని బ్రిటిష్ వైద్యశాస్త్రజ్ఞులు రూపొందించారు. లండన్‌లోని సెయింట్ థామస్ హాస్పిటల్ అండ్ మెడికల్ స్కూల్‌కు చెందిన డా॥ పి. హెచ్. సోంక్సెన్, ఆయన సహాయకులు రూపొందించిన ఈ సాధనాన్ని ఒక బ్రిటిష్ సంస్థ ఇప్పుడు విక్రయిస్తున్నది. వెల కూడా అంత ఎక్కువ కాదట!

*

చైనాకు చెందిన వైద్య పరిశోధకులు సంతానోత్పత్తిని నివారించడానికి మగవారు ఉపయోగించే 'గాసిపోల్' అనే గుళికను ఇటీవల కనుగొన్నారు. ఈ గుళిక తయారీకి అవసరమైన పదార్థాలను ప్రత్తి విత్తనాల నుంచి సేకరించి తయారు చేయడం జరిగిందని, ఎన్నో ప్రయోగాల అనంతరం దీనివల్ల ఆరోగ్యానికి ఎలాంటి హాని కలగదని రుజువైందనీ నవచైనా వార్తాసంస్థ వెల్లడి చేసింది. ఈ వైద్య విశేషం పట్ల రాక్ ఫెల్లర్ ఫౌండేషన్, పాపులేషన్ కౌన్సిల్‌వారు విశేషమైన ఆసక్తి చూపి, చైనా వైద్యపరిశోధకులతో కలిసి, 'గాసిపోల్'కు సంబంధించిన అన్ని వివరాలు సేకరిస్తున్నారు.

*




అర్. ఇందిరా శేఖర్, కోరగుంటపల్లి

పాచ్‌వర్క్ - అప్లిక్‌వర్క్ అంటే ఒక్కటేనా? తేడా ఏమైనా వున్నదా? తెలిపేది.

**ఒక్కటే కాదు. పాచ్‌వర్క్ అంటే ఒకదానికి ఇంకొకటి (ప్రక్కన) అతికేది. అప్లిక్ లేక అప్లై (apply) అంటే – ఒకదాని పైన ఇంకొకటి వేయట మన్నమాట.**

క్రాస్ స్టిచ్ నేర్చుకోవాలని వుంది. మ్యాటీ మీద కాక మామూలు క్లాత్ మీద క్రాస్ స్టిచ్ ఎలా కుట్టాలో తెలియజేస్తారా?

**రెండు రకాలుగా చేయవచ్చును. డిజైన్ లోపల పెన్సిల్‌తో లైట్‌గా గళ్ళు వేసుకొని కుట్టుకోవచ్చు. ఇది కష్టమైన పద్ధతి. ఇది కాదనుకొంటే అసలైన పద్ధతి ఏమిటంటే క్రాస్‌స్టిచ్ కని గళ్ళగుడ్డ అమ్ముతారు బజారులో (మ్యాటీ కాదు). దానిని మనం కుట్టే గుడ్డలపైన పెట్టి పోగువేసి, లోపల కావలసిన డిజైన్ కుట్టుకోవాలి. కుట్టడం అంతా అయిపోయిన తర్వాత ఒక్కొక్క పోగు (గళ్ళగుడ్డవి) లాగేస్తే నీట్‌గా వుంటుంది డిజైన్.**

గత నెల 'వనిత'లో అవి-ఇవి శీర్షిక లేనందుకు మాకు కొరతగా వున్నది.

**ఈ శీర్షిక మీకు ఉపయోగకరంగా వున్నందుకు సంతోషం.**

వి. ప్రతిమ, మద్రాసు

కచ్‌వర్క్ అంత వివరించి చెప్పారే. మరి అద్దాలు కుట్టడం నేర్పించకూడదా?

**అద్దాలు, వాటి చుట్టూ పూవలు కుట్టడం కూడా వివరంగా వ్రాసి పంపాను. రాబోయే సంచికలలో చూస్తారు మీరు.**

వహీదారెహ్మాన్, మెహబూబ్‌నగర్

కుట్టటానికిగాని, పెయింట్ చేయటానికిగాని ఏదైనా మంచి సీనరీ పంపుతారా? నా స్వంత చిరునామాతో మీకు కవర్ పంపుతాను. ఏ అడ్రసుకు పంపమంటారు?

**గ్రీటింగ్ కార్డ్స్ వెతకండి. కావలసినన్ని సీనరీలు కనిపిస్తాయి. కావాలంటే పంపుతాను. అడ్రస్ అంటారా–కేరాఫ్ 'వనిత'.**

లక్ష్మి-వాణి, మురారి గ్రామము

ఉండల బ్యాగ్ నచ్చింది మాకు. కాని, కొంచెం అర్థం కాలేదు. వివరంగా చెబుతారా?

**మీకు వయర్‌తో ముళ్ళు అల్లటం వచ్చునా్నరుకదా. అలా అయితే ఈ బ్యాగ్ చాలా సులభం. ప్రయత్నించండి ఇంకోమారు. 5, 6 మార్లు జడలు (ముళ్ళు) వేసి, పైవైపు వంచితే వుండ ఆకారం వస్తుంది. చిన్న పిల్లలకు జడ వేసి క్రింది నుండి మడచి పైన రిబ్బన్ కడ్తామే అలానే వంపాలి. కాని వుండలకు పైకి మడచి రెండు వయర్ కొసలను ఎడమ లూపులోనికి, రెండు కొసలను కుడి లూపులోనికి తీసుకోవాలి. (ముందు వరుసలో వేసిన నాట్ లోగుండా అన్నమాట). తర్వాత మామూలుగా ముడి వేయాలి.**

కె. శ్రీలక్ష్మి, చందూర్తి

సెప్టెంబర్ సంచికలో చామంతి పూలు చేయుట మెలాగో తెలుపలేదు.

**ఔను ఆ సంచికలో ఆ బొమ్మ లేదు. అక్టోబర్ సంచికలో వుంది. మీరు ఈపాటికి చూసి, అల్లే వుంటారు కదా!**

రావుల కనకలక్ష్మి, గోదావరిఖని

సమోసా బ్యాగ్ అర్థం కాలేదు. 42 ముక్కలు అడ్డంగా రన్నింగ్ వయర్‌తో 42 పువ్వులు వస్తాయి. కాని మీరు బేస్‌కు 29 లైనులన్నారు.




**మీ వుత్తరం పూర్తిగా చదివాను. రన్నింగ్ వయర్ పెద్ద కట్ట తీసుకొని ఈ 42 ముక్కలు అతకాలి. తర్వాత ఆ రన్నింగ్ వయర్‌తో చుట్టూ అల్లుకొంటూ పోవాలి 29 లైనులు వచ్చేవరకు. ఇదన్నమాట బేస్. అంటే 42 పువ్వుల వెడల్పు, 29 పువ్వుల పొడవు అన్నమాట బేస్. ఇకపోతే 13 పువ్వుల మాట. ప్రతి లైనుకూ రెండు వైపులా మధ్యన పువ్వులు అల్లాలని చెప్పానుకదా. ఇలాంటి పువ్వులు ఒకదాని పైన ఒకటి అంటే 13 వరుసలు అల్లితే (బొమ్మలో 1 నుండి 2 వరకు) బ్యాగ్ పొడవు (ఎత్తు) మనకు సరిపోతుంది.**

వసుధ, మార్కాపూర్

సమోసా బ్యాగ్ బేస్ అయిన తర్వాత చివరలో అటు ఇటు కొసలు అల్లుకోకూడదని చెప్పారు కదా! మరి హాండిల్ ఎలా వేయాలో సరిగా అర్థం కాలేదు.

**అవును! బేస్ అయిన తర్వాత ప్రక్కల అల్లుకోకూడదు. కాని రెండు వయర్లతో పువ్వు అల్లుకొంటే ఆటోమాటిక్‌గా సైడ్స్ వస్తాయి. ఇక హాండిల్ అల్లే విధానం కావాలంటే అక్టోబర్-'78 సంచిక చూడండి. అటాచ్ చేసే విధానం కావాలంటే– పెద్ద బ్యాగ్‌కు అయితే ప్రక్కల అడుగు నుండి అటాచ్ చేయాలి. చిన్న బ్యాగ్‌కు అయితే పైన పూల మధ్యలో దోపాలి వయర్ ముక్కలను.**

జయప్రద. జి, తెనాలి

**ఫ్రెంచ్‌నాట్** వేయడం చాలాసార్లు చాలామంది వ్రాశారు. కాని వేస్తే రావటం లేదు. అర్థమయ్యేట్టు వ్రాయండి.

**ఫ్రెంచ్ నాట్ ముఖ్యంగా పువ్వు మధ్యలో గల పుప్పొడి చుక్కలకు వాడ్తారు. బటన్‌రోజ్ పూవులు కూడా ఈ కుట్టుతో వేసుకోవచ్చు. ప్లెయిన్ కాశ్మీర్ సిల్కు చీర నిండా ఈ బటన్ రోజ్ పువ్వులు అక్కడక్కడ వేసి నింపితే చక్కగా వుంటాయి. నాట్ ఎలా వేయాలంటే – సూదికి రెండు పోరల దారం ఎక్కించి అడుగు నుండి పైకి తీయాలి. అవి కొద్ది దూరంలో సూదిని గుచ్చి, పైకివేసి సూది పైన మనం కుట్టే చుక్క సైజునుబట్టి 4, 5 మార్లు దారం త్రిప్పి, బొటన వేలితో వీటిని దగ్గరగా నొక్కిపట్టి, సూదినిలాగి, క్రిందికి గుచ్చితే చక్కగా పుప్పొడిలాగ వుంటుంది కుట్టు.**



# బామ్మగారిపేజీ

అసలూ —

పెళ్ళి అనేది ఏమిటి? అది ఎందుకొచ్చింది?— అన్న ప్రశ్నలు ఎవరికైనా కలుగుతూ వుంటాయి. పెద్దవాళ్ళను వాళ్ళు అడుగుతూ వుంటారు. అలాగే నన్నూ కొందరు అడుగుతూ వుంటారు. మరి, నాకు తెలిసిన విషయాలేవో నేను చెప్పాలి గదా....

ప్రపంచం పెరగడానికి మూల కారణం స్త్రీ పురుష సంబంధం. 'ప్రేమ' అన్న పదానికి నిర్వచనం - స్త్రీ పురుష సంబంధం. భార్యాభర్తల మధ్య వుండే అనురాగానికి — పవిత్రత, మహత్తూ వున్నాయి. మన పూర్వీకులు ఎంత గొప్ప ఆలోచన చేశారోగాని, ఒక పురుషుడికి, ఒక స్త్రీతో బంధుత్వం కలిపారు. అదో కుటుంబం అన్నారు. ఆ కుటుంబం అలా అలా పెరుగుతూ వుంటుంది అన్నారు. దానివల్ల నీతి, పవిత్రత, బాధ్యత ఎన్నో ఏర్పడతాయి. 'వివాహం' అన్న వ్యవస్థ లేకపోతే - స్త్రీ పురుషులిద్దరూ ఎవరిష్టం వచ్చినట్లుగా వాళ్ళు ప్రవర్తిస్తూ వుండి వుంటే — ఈ ప్రపంచం ఎలా వుండేదో వూహించగల మఃరా మనం! అందుకనే—ఒక క్రమ విధానాన్ని ఏర్పాటుచెయ్యాలన్న ఉద్దేశంతోనే వివాహాన్ని నిర్దేశించారు. ఈ విధానం ప్రపంచంలో వున్న అన్ని జాతుల్లోనూ, అందర్లోనూ వుంది-ఏవో చిన్న చిన్న మార్పులుంటే వుండొచ్చునేమో గాని!

వివాహంతో జీవితంలో కొన్ని కట్టుబాట్లు, క్రమశిక్షణా ఏర్పడతాయి. ఆయా దేశస్థుల సుఖ శాంతుల కోసం అని, ఆయా దేశాలు వివాహాలకు కొన్ని కొన్ని విధానాలంటూ ఏర్పరచాయి అవే వివాహ విధులు అన్న మాట.

జీవితంలో వివాహానికి ఎంతో ప్రాముఖ్యత వుంది; ఘనత వుంది. మన ఇళ్ళలో చేసుకునే వేడుకల్లో పెళ్ళికి ఇచ్చినంత ప్రాధాన్యం ఇంక దేనికిస్తాం చెప్పండి! మన హిందువుల వివాహ విధుల్లో మన పెద్దలు ఎన్నో ప్రవేశపెట్టారు. అవన్నీ మంత్రాల రూపాల్లోనూ, సూత్రాల రూపాల్లోనూ వున్నాయి.

మనకి తెలిసి - ఏదో 'పెళ్ళి' అంటే 'పెళ్ళి' అని ఉత్సాహంగా అటూ యిటూ తిరిగేస్తాం గాని, వివాహ విధానాల్లో ఎలాంటి కట్టుబాట్లు, ప్రమాణాలూ వున్నాయో ఎంతమందికి తెలుసు గనుక?- పురోహితులు మంత్రాలు చదువుతారు; వివాహం విధులు పూర్తయిపోతాయి. అయితే ఆ విధానాలు ఏమిటి? వాటిని ఎందుకలా రూపొందించారు? ఆ తంతు, ఆ మంత్రాలూ ఏమిటి?—

ఇవి - తెలుసుకోవలసిన బాధ్యత ప్రతి వారికీ వున్నా - తెలుసుకునే ఓపికా, తెలియజెప్పే మనిషీ ఉండక - చాలామందికి తెలియవు. కదా! అయితే, నాకేదో తెలుసునని కాదర్రా- అయినా నాకు తెలిసిన విషయాలు చెబుతాను.

వివాహాన్ని పాణిగ్రహణం అన్నారు. ఎందుకన్నారు? — 'పాణిగ్రహణం' అంటే చెయ్యి పట్టుకోడం! వివాహంలో పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు చెయ్యి పట్టుకుని, అగ్నిహోత్రం దగ్గరకు తీసుకెళ్ళి, సప్త పదాలూ నడిపించి, వాళ్ళిద్దరి మధ్యా సఖ్యతను స్థిరపరుస్తాడు. పెళ్ళిలోని తంతుల్లో ముఖ్యమైనది — సప్తపది. దానికి సాధనం — పాణిగ్రహణం. అందుకనే-వివాహాన్ని పాణిగ్రహణం అన్నారన్నమాట.

ఐందా—

విహానికి ముందు, వధూవరుల జాతకాలు, కుల గోత్రాలూ, స్థాయీ పరిశీలిస్తారు. ఉభయులూ బాగుంటారన్న నమ్మకంతో వివాహం నిశ్చయిస్తారు. వరుడికి వుండవలసిన లక్షణాల గురించి చెబుతూ — బంధువులు గలవాడు, మంచి గుణాలు గలవాడు, సాముద్రిక శాస్త్రంలో చెప్పబడే శుభ లక్షణాలు గలవాడూ, వేద వేదాంగాలు చదువుకున్నవాడూ, ఏ రోగాలూ లేనివాడూ అయి వుండాలి- అన్నారు. అదే విధంగా వధువు గురించీ చెప్పారు. అలాంటి వాడిని, కన్య పెళ్ళాడాలి; ఇలాంటి కన్యను పురుషుడు వివాహం చేసుకోవాలి-అన్నారు. అలాగే తన మనసుకీ, కంటికీ నచ్చినవారినే చేసుకోవాలి-అని కూడా అన్నారు సుమండీ — మన పెద్దవాళ్ళు!

వివాహ విధుల్లోని — స్నాతకవ్రతంలో వరుడు వేదాలు పఠిస్తాడు. బ్రహ్మచర్యవ్రతలోప ప్రాయశ్చిత్తం చేసుకుంటాడు. క్షురకర్మ చేసుకుంటాడు. దండం ధరిస్తాడు; గొడుగు వేసుకుంటాడు. తర్వాత- కాశీకి బయల్దేరతాడు. మన వివాహాల్లో కాశీ యాత్రకి వెళ్ళడం అనేది — మనం చూస్తూనే వుంటాము. ఆ సందర్భంలో దారిలో ఎదురైన ఒకరితో అన్నట్టుగా పురోహితులు — "చరిత బ్రహ్మచర్యోహం కృతవ్రత చతుష్టయః — కాశీయాత్రాం గమిష్యామి, అనుజ్ఞాం దేహిమ్ శుభమ్" అన్న మంత్రం చదువుతారు. అంటే ఏమిటి?—"నేను బ్రహ్మచర్యవ్రతం ఆచరించి వేదవ్రతాలు చేశాను. కాశీయాత్రకు వెళ్తున్నాను గనక, నాకు అనుమతి ఇవ్వు" అని — అడగడం అన్నమాట. అంటే—అతను, "అన్ని లక్షణాలూ గల నా కూతుర్ని నీకిచ్చి పెళ్ళి చేస్తాను. దీన్ని పెళ్ళి చేసుకుని, అగ్నిహోత్ర సహితంగా వెళ్ళు. నా ఇంటికిరా" అని పిలుస్తాడు. పెళ్ళికొడుకు వెళతాడు. ఇదే మన వివాహాల్లో 'పెళ్ళికొడుకు కాశీయాత్ర వెళ్ళడం'గా మారింది. అయితే ఇది ఎలా—ఎందుకు అమల్లోకి వచ్చిందో తెలీదు. పెళ్ళి చేసుకోబోతూ, మళ్ళీ కాశీ వెళ్ళిపోవడం ఏమిటి- అన్న అనుమానం వచ్చినా, ఒక క్రమ విధానంలో వివాహం జరపడం కోసం — ఈ తంతును ప్రవేశపెట్టి వుంటారని మనం భావించుకోవచ్చు.

ఆ తర్వాత, వరుడు తన వివాహం నిర్విఘ్నంగా జరగాలని వినాయకపూజ చేస్తాడు. తర్వాత, తన హితుల్ని నలుగురిని పంపిస్తాడు. ఎక్కడికి? కన్యకోసం. "మదర్థం కన్యాం వృణీధ్వమ్"— 'నా కోసం కన్యను వరించండి' అంటాడు. "ప్రసుగ్మంతా ధియసానస్య...." అన్న మంత్రంలోని అర్థం ఏమిటంటే — "మిత్రులారా, శ్రేష్ఠమైన మార్గంలో వడిగా ప్రయాణం చేసి, కన్యను వెదకండి. నాకు, కన్యకి సంయోగం కలగడం- ఇంద్రుడికి సమ్మతమే. వధూవరులిద్దరూ కలిస్తే యాగంలో సోమరసాత్మకమైన అన్నాన్ని తనకి ఇస్తారని అతనికి తెలుసు. అందువల్ల ఇంద్రుడు మీకు సహాయంగా వుంటాడు. దేవతలారా! నా మిత్రులు కన్యకోసం వెళ్ళేదారి, ముళ్ళు రాళ్ళు లేకుండా వుండేలా చెయ్యండి. మాభావి దాంపత్యం సుసంబద్ధంగా వుండేలా అనుగ్రహించండి" అని. చూశారర్రా....ఇలాగే ఎన్నో గూఢార్థాలున్నాయన్న మాట — ఆ మంత్రాల్లో. తక్కినవి వచ్చే నెలలో చెబుతాను....

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

—'బ్రాహ్మీదేవి'

నన్నయభట్టు కంటె ముందుగానే తెలుగులో పద్యరచన ఉన్నది. అయితే ఆయన్ను తెలుగులో ఆదికవి అంటున్నాం – ఆయన రచించిందే తొలి తెలుగు పద్యగ్రంథం కాబట్టి. అట్లాగే ఎంత కాలం నుంచో తెలుగులో స్త్రీలు పాటలు రచిస్తూనే ఉన్నారు. అవి ప్రచారంలో ఉండి ప్రసిద్ధంగానే ఉన్నాయి. అయితే తెలుగు ఆడపడుచు రచించిన తొలి పద్యగ్రంథం మాత్రం "సుభద్రా కల్యాణం" దాన్ని రచించినది తాళ్లపాక తిమ్మక్క. అందుకే ఆమెకు తొలి తెలుగు కవయిత్రి అనే ప్రఖ్యాతి వచ్చింది.

కడప మండలంలో నందవరీక నియోగి కుటుంబంలో జన్మించి వేంకటేశ్వరస్వామి భక్తుడై పదకవితాపితామహుడై, వాగ్గేయకారరత్నమై, తిరుమల కొండను నాదమయం చేసిన మహానుభావుడు శ్రీ తాళ్ళపాక అన్నమయ్య. ఆయన పెద్ద భార్యయే తిమ్మక్క. అన్నమాచార్యులగారికి తిమ్మక్క కాకుండా మరొక భార్య ఉన్నది. ఆమె అక్కలమ్మ. వీరి కుమారులు, మనుమళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు అందరు మహా విద్వాంసులు, మహా రచయితలు. సంగీతవేత్తలు. వాగ్గేయకారులు. తిమ్మక్క కుమారుడు నృసింహకవి శ్రీ కృష్ణదేవరాయలకు సమకాలికుడు. 'కవి కర్ణరసాయన'మ'న్న మహా ప్రబంధమును రచించినవాడు. ఇట్టి విద్వద్వంశానికి చెందినదై - ఆనాటి సంఘంలో ఉత్తమస్థానాన్ని అధివసించిన తిమ్మక్క సుభద్రా కల్యాణమనే ద్విపద కావ్యాన్ని రచించింది. ఆ కావ్యకథలో ఆమె ఆత్మకథ రమణీయంగా తొంగిచూస్తున్నది.

సుభద్రా కల్యాణంలో ద్రౌపది సుభద్రను అలంకరించి గదిలోకి పంపించే ఘట్టంలో తిమ్మక్కగారి రచన – స్త్రీ సహజంగా – అనితర సాధ్యంగా ఉన్నది. ద్రౌపది అనుకున్నదట—

"తలపోసె మనసులో తాళంగలేక
యేమి వస్తువులైన నీవచ్చుగాని
ప్రాణేశునిచ్చిన బ్రతుకంగరాదు." ఈ మాటలు సవతి ఉన్న స్త్రీ మాత్రమే వ్రాయగలవి.

అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ చాంద్రాయణ వ్రతం చేశాడు. అర్జునుణ్ణి ఆంధ్ర మహాభారతంలో గోదావరి తీరానికి, ద్రాక్షారామానికి, శ్రీపర్వతానికి, వేంగీమండలానికి తీసుకువచ్చినట్లు నన్నయ భట్టు వ్రాశారు. కడప మండలంలో పుట్టి తిరుపతిలో నివాసమున్న తిమ్మక్క అర్జునుణ్ణి తిరుపతికి, కర్నూలు మండలంలోని అహోబిలానికి, కంచికి తీసుకువచ్చింది.

అమరనహోబళం బావెంకటాద్రి
వరుసనాపై కంచి వరదుల గొలిచె

అహోబళం వైష్ణవాచార్యుల దగ్గర అన్నమాచార్యులవారు ఉభయ వేదాంత అధ్యయనం చేశారు.

అర్జునుడు తీర్థయాత్రలు చేసి కపటయతిగా ద్వారకాప్రాంతాన్ని చేరి శ్రీకృష్ణుని తలచుకోగా ఆయన అర్జునుని ముందు ప్రత్యక్షమైనాడు. అర్జునుడు నమస్కరించగా శ్రీకృష్ణుడు నవ్వుతూ ఆలింగనం చేసుకొని ద్వారకకు తీసుకువెళ్ళాడని నన్నయగారి రచన. ఆ నవ్వులోని హాస్యమే విధంగా వున్నదో తిమ్మక్కగారు వ్రాసినది.

అత్తరి శౌరి సర్వాత్మకుడగుట
అంతనానరుని తలంపంత దెలిసి
యొక్కరుండే తెంచె నొనరనచ్చటికి
నరుడు నచ్చెరువంది నారాయణునకు
సరగున ప్రణమిల్లి సద్భక్తి మ్రొక్కి
వనమాలి కెదురుగా వచ్చి యర్జునుడు
దండప్రణామమ్ము తగనాచరించె
నారాయణాయని నవ్వుచు నరుడు
కరముబట్టుకవాని కడులేవనెత్తి
హరియునవ్వుచు బల్కెనర్జును జూచి
నిన్ననే సుతుగని నెఱతనమ్మునను
యింతలో సన్న్యాసి వెళ్లైతివయ్య
యెఱుగుదుమీ విద్య లెల్లను నేను
గరిమ వేసాలెల్ల గ్రాసాల కొఱకె
అని గేలిసేయుచునతని దోకొనుచు
చనుదెంచె రైవత శైలమ్ముకడకు
అచటనర్జునునుంచి హరియునంతటను
నడనడ ద్వారకా నగరికేతెంచె....

ఇందులో బావమరదుల హాస్యం సొగసుగా నిండిన తెనుగుదనంతో ఉన్నది.

సుభద్రాదేవి బొమ్మల పెళ్ళిళ్ళు చేయడం ఆ సమయంలో కపట సన్న్యాసిగా ఉన్న అర్జునుడు ఆమెతో శ్రుతిమించి మాటాడటం - సుభద్ర వెరగు పొందటం —

అనుచుకందువమాట యతితను బలుక
నివ్వెరపడియుండె నెలత సుభద్ర
మరియెన్నొరీతుల మాయల తపసి
నెరవక తనుజూడ వెరగందెనబల—

సుభద్ర వెళ్ళి అన్న శ్రీకృష్ణునితో యతిని గురించి—

"ఎక్కడి యతివరుండితడు వోయన్న
చూడ సంయమిగాడు చూరకాడితడు" —
అని ఫిర్యాదు చేసింది.

శ్రీకృష్ణుడామెను ఓదార్చాడు. కపటమునిని ప్రస్తుతిచేశాడు. మరికొన్నాళ్ళు ఓపికపట్టమన్నాడు.

సుదతి యాతని చూడ సురపతిసుతుడె,
మనసులో నీకనుమానమ్మవద్దు—

అని రహస్యము చెప్పి వేశాడు. ఆమె మనస్సు కుదుట పడింది. ఈ సంఘటన అంతా తిమ్మక్క కల్పనమే.

ఒకనాడు సుభద్రాదేవి చక్కగా అలంకరించు

కొని తన పెంపుడు రామచిలుకను భుజమున పెట్టుకొని కపట ముని ఉన్న తోటలోనికి వెళ్ళి - ఆయన కెదురుగా ఉండి మాటలు కలిపింది.

అయ్య మీరే దేశ మరసి చూచితిరొ
యెయ్యది మీనామ మెచట నుండెదరొ
వరగనింద్ర ప్రస్థ పట్టణమునను
బహుళ సంపదలతో బరగుచున్నారు
ధీరమానసులు కుంతీసుతుల్ వారు
అరయంగ కడుసుఖులై యున్నవార
కోరి మా మేనత్త కొడుకులైదుగురు
వారికి కుశలమా వరముని చంద్ర
ఆ రాజవరులలో నర్జునుండెలమి
ధారుణి తీర్థముల్ దర్శింపనేగె
తీర్థముల్ క్షేత్రముల్ తిరుగుచో మీరు
ఇంద్రనందను నెందునేజూడ లేద ?
జగతినంతట మీరు చరియింతురనగ
అరసి మిమ్మిప్పుడు అడుగంగ వలసె ॥

ఆమె మాటలకు అర్జునునకు సంతోషమైంది. ప్రణయం వెల్లడించాడు.

పద్మాక్షి నీతోను పలుకగావెరతు
పలకిన పలుకులు భావమేర్పరచి
దూరు లెక్కించెదో తోయజాక్షునకు
వలపు గల్గక యుండ పలుకగల్గుదునె
పడుచుదనముననే పలుకు పల్కులను
మనసులో నుంతువా ననురాజ ఋషిని.

ఆ మాటలు సుభద్రాదేవికి బాగా అర్థం అయినవి. ఆమె పులకరించినది. ఆ చిరునవ్వులో కామతంత్ర రహస్యములు పుష్పించినట్టే అన్నది తిమ్మక్క.

తిమ్మక్క తరువాత వంద సంవత్సరాలకు తంజావూరు ఆంధ్ర నాయకుల ఆస్థానంలో ఉండి 'విజయ విలాసం' అనే కావ్యాన్ని రచించిన చేమకూర వేంకటకవి ఒక సందర్భంలో తిమ్మక్క రాసిన రామచిలుక రాయబారాన్ని యథాతథంగా ఉపయోగించుకున్నాడు. చేమకూర వేంకటకవి మరి కొన్ని పట్టులను కూడా తిమ్మక్కను అనుసరించాడు. ఒక సుకవి చేత అనుసరింపబడతగినంత కావ్యశిల్పం తిమ్మక్క రచనలో ఉన్న మాట వాస్తవం.

ఈ ద్విపద కావ్యం - స్త్రీ రచించిన తొలి తెలుగు కావ్యం – ఇది 15వ శతాబ్దంలోనే వచ్చింది. ఇది మహా కావ్యమని కవయిత్రి చెప్పుకోలేదు గాని - ఆమె చెప్పినట్లది-'కడుమంచి తేట పలుకుల'లో మాత్రం ఉన్నదని నిస్సంశయంగా చెప్పవచ్చు. □





## పూసలతో జిరాఫీ

ఈ చిత్రంలో కనిపిస్తున్నవారు కుమారి డి. మహేశ్వరి. ఆమెతోపాటే ఈ చిత్రంలో పూసలతో చేసిన పలు వస్తువులు వున్నాయి. అవన్నీ కూడా ఆమె చేసినవే. రంగులరాట్నం, సైకిలు, జారుడు బండ, జిరాఫీ, ఫ్లవర్ వాజ్‌లు వంటి వస్తువులు ముప్పైకి పైగా ఆమె చేశారు. స్పాంజితో చక్కటి బొమ్మలు చేయడంలోనూ, అల్లికలు, కుట్లు వంటి చేతి పనులలోనూ ఆమెకు ప్రవేశముంది. ఎస్. ఎస్. ఎల్. సి. వరకు చదువుకున్న మహేశ్వరి తండ్రిగారైన ప్రముఖ నృత్యదర్శకుడు శ్రీ డి. వేణుగోపాల్ వద్ద భరత నాట్యం కూడా అభ్యసిస్తున్నారు.

మహేశ్వరి 'పూసలతో జిరాఫీ' చేయడం ఎలాగో ఇక్కడ తెలియజేస్తున్నారు :

''ఈ జిరాఫీని తయారు చేసుకోవడానికి కాస్త పెద్ద సైజులో వుండే పూసలు తీసుకోవాలి. ముందుగా జిరాఫీ పొట్టభాగం అల్లాలి. ఈ పొట్టభాగం పొడవుకి 7 వరసలు, వెడల్పుకి 9 వరసలు అల్లి, దాని రెండు చివరలు ఒక్కొక్క పూసతో కలిపి చివర్లను రెండు వైపులా పూసలతో మూసివేయాలి. ఇలా మూసేందుకు ముందుగా అందులో దూది కూరి మూస్తే కాస్త ఉబ్బినట్లుగా కనిపించి పొట్ట ఆకారం ఏర్పడుతుంది.

తరువాత పొట్ట కింద భాగంలో నాలుగు కాళ్ళకి 7 వరసలు పొడుగ్గా స్తంభాకారంలో అల్లాలి. ఈ కాళ్ళలో కూడా దూది కూర్చితే గట్టిగా వుంటాయి. ఇక జిరాఫీ వెనక భాగంలో 6 వరుసలు పొడుగుతో తోకను అల్లాలి.

జిరాఫీ మెడ పొడుగ్గా వుంటుంది కాబట్టి మెడకి 13 వరసలు పొడవు, 2 వరసలు వెడల్పు పెట్టి అల్లుతూ మధ్యలో దూది కూరాలి. తల పై భాగంలో రెండువైపులా 8 పూసల చొప్పున చెవులు అల్లాలి. దీని నోరు అల్లే భాగంలో 3 వరసలు పొడుగు పెట్టి అల్లి దూదిని కూరాలి. నల్ల పూసలు రెండు తీసుకుని యిలా చేసుకున్న జిరాఫీకి కళ్ళ భాగంలో అమర్చితే మనం పూసలతో అల్లుకున్న జిరాఫీ నిండుగా నిజం జిరాఫీలా వుంటుంది.'' □



మచిలీపట్నం లయన్ లేడీస్‌క్లబ్ సభ్యులు యిటీవల తమ ప్రథమ వార్షికోత్సవం జరుపుకున్నారు. ఆనాటి సభకు కృష్ణాజిల్లా కలెక్టరుగారి సతీమణి శ్రీమతి ఇందిరారెడ్డి ప్రధాన అతిథిగా విచ్చేసి అనాథ బాలబాలికలకు బిస్కెత్తులు, తువ్వాళ్ళు, విటమిన్‌లు పంచిపెట్టారు.

# వార్తా వని(త)



విశాఖ రోటరీ(నార్తు)క్లబ్బు యిటీవల స్థానిక రైల్వే ఇన్‌స్టిట్యూట్ మైదానంలో నిర్వహించిన సేవా సంస్థల క్రీడల పోటీలలో షటిల్ బాడ్మింటన్, కేరమ్సు (డబుల్స్) ఆటలలో విజేతలుగా బహుమతులు పొందిన ఇన్నర్‌వీలు విశాఖ నార్తు క్లబ్బు సభ్యురాండ్రు (ఎడమ నుండి కుడికి) శ్రీమతులు కమలాసిన్హా, శచీదేవి,

—విలేకరి



విజయవాడ తాలూకా పోరవరం గ్రామంలోని 'సిద్దార్థ మహిళా మండలి'కి యువజనాభ్యుదయ శాఖామంత్రి శ్రీ కోనేరు రంగారావు ప్రారంభోత్సవం చేశారు. ఆనాటి సభకు యువజనశాఖ డిప్యూటీ డైరక్టరు, ప్రసిద్ధ రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షత వహించారు. మండలి కార్యదర్శి కుమారి ఎం. లక్ష్మి వందన సమర్పణ చేశారు.

—మల్లిడి కనకరత్నం

తిరుపతి 'మమతా మహిళా సూపర్‌బజార్'కు ఆంధ్రప్రదేశ్ సహకార శాఖామాత్యులు శ్రీ ఎస్. అమరనాధరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో - శ్రీమతులు సులోచన (డైరక్టరు), మీనాక్షి (మేనేజింగ్ డైరక్టరు) నిర్మలా ప్రసాద్ (డైరక్టరు) వి. రమా రెడ్డి (డైరక్టరు) వి. సువర్ణలత (అధ్యక్షురాలు), శ్రీ అమరనాధరెడ్డి, శ్రీ ఈశ్వరరెడ్డి (ఎం.ఎల్.ఏ), శ్రీ సుబ్బరామయ్య, శ్రీమతులు నారాయణమ్మ (డైరక్టరు), కె. ప్రమీలమ్మ (ఉపాధ్యక్షురాలు) వున్నారు.



యం. శేషాచలం అండ్ కో వారు నిర్వహించిన ప్రముఖ రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనా రాణి పుస్తకోత్సవాల బహుమతి డ్రా కార్యక్రమం ఫిబ్రవరి 18 వ తేదీన హైద్రాబాద్ సరోవర్ హోటల్‌లో జరిగింది. ఆనాటి సభకు న్యాయమూర్తి శ్రీమతి అమరేశ్వరి అధ్యక్షత వహించారు. ప్రముఖ రచయిత్రులు డా॥ సి. ఆనందరామం, శ్రీమతి మాదిరెడ్డి సులోచన ప్రసంగించారు. బహుమతి కూపన్ల డ్రాని శ్రీమతి సులోచనారాణి నిర్వహించగా ఫలితాన్ని న్యాయమూర్తి శ్రీమతి అమరేశ్వరి ప్రకటించారు. శ్రీ ఎమ్. ఎస్. కుమార్ వందన సమర్పణ చేశారు.






విశాఖపట్నం నార్తు ఇన్నర్‌వీల్ క్లబ్బు ఫిబ్రవరి నాలుగవ తేదీన మహారాష్ట్ర నివాస్‌లో జపాన్ దేశీయుల "ఇకబానా" పద్ధతిలో నిర్వహించిన పుష్పాలంకరణ ప్రదర్శన పోటీలో మహిళలు పాల్గొన్న దృశ్యం. చిత్రంలో కనబడుతున్న వారిలో కుడి నుండి రెండవ స్థానంలో క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి భగవంతి రామ్‌చంద్, నాల్గవస్థానంలో పోటీలను నిర్వహించిన సమన్వయ కర్త శ్రీమతి ఇందిరా రాధాకృష్ణన్ ఉన్నారు. ఈ పోటీలతోపాటు, దేశీయ పద్ధతిలో పుష్పాలతో రంగవల్లుల ప్రదర్శన పోటీలను కూడా నిర్వహించారు.

—విలేకరి

తెనాలి లలితకళా సమాఖ్యవారు ఇటీవల 'వనితా విభావరి' కార్యక్రమాన్ని నిర్వహించారు. స్కిప్పింగు, రంగవల్లి, వక్తృత్వపు పోటీ, వ్యాస రచన, అల్లికలు, మొదలైన పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు అందజేయబడ్డాయి. ఆనాటి కార్యక్రమంలో ప్రముఖ రచయిత్రి పోలాప్రగడ రాజ్యలక్ష్మి, ప్రముఖ నర్తకి సుమతీకౌశల్, మాధవపెద్ది సుశీల, సుమిత్రా రాంబాబు, ధనలక్ష్మి, సీతాలక్ష్మిరాజ్ ప్రభృతులు పాల్గొన్నారు.



రాజమండ్రి ఇన్నర్‌వీల్‌క్లబ్ దశాబ్దోత్సవ సందర్భంగా ప్రభుత్వ ఆసుపత్రిలో పేద రోగులకు పరిచర్యలు చేసేవారి సౌకర్యార్థం వంటశాల నిర్మించి యిచ్చారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో- అధ్యక్షురాలు వేలూరి కామేశ్వరి, ఛైర్ - విమెన్ ప్రమీలారావు, వైస్ ఛైర్‌విమెన్ బోడా అన్నపూర్ణ (ముఖ్యదాత) కార్యదర్శి గీతామహేశ్వరి. శ్రీమతి జయలక్ష్మి వున్నారు.



పెద్దాపురం వాసవీ మహిళాసంఘం అధ్యక్షురాలిగా కందుల నవరత్నం, ఉపాధ్యక్షురాలిగా మట్టె రత్నమాల, కార్యదర్శిగా తాళ్ళూరి గంగాభవాని, సహకార్యదర్శిగా డి. మంగతాయారు ఎన్నికైనారు.



పట్టాభిపురం (గుంటూరు) లయన్ లేడీస్‌క్లబ్ లయనెస్ క్లబ్‌గా రూపాంతరం చెందింది. అధ్యక్షురాలిగా సి. అన్నపూర్ణమ్మ, కార్యదర్శిగా పి. స్వతంత్రభారతి. కోశాధికారిణిగా పి. నిర్మలామూర్తి ఎన్నికయ్యారు.



ఎస్. లక్ష్మీమాధురి (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 12-4-76 తల్లి పేరు: శీతేవల్లి గిరిజ.



ఎమ్. రాధిక (విశాఖపట్నం) పుట్టిన తేదీ: 22-4-78 తల్లి పేరు: సుశీల జనార్దన్.



ఎస్. శ్రీకాంత్ (బొంబాయి) పుట్టిన తేదీ: 8-4-77 తల్లి పేరు: ఎస్. ప్రసూన.




అపర్ణ (హైద్రాబాదు)
పుట్టిన తేదీ: 9-4-78
తల్లి పేరు: కౌసల్య.



కె. ప్రసాద్ (పెద్దపట్నం లంక) పుట్టిన తేదీ: 9-4-78 తల్లి పేరు: కె. పద్మావతి.



ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో ఏడాది పిల్లల గ్రూపులో ఎమ్. రాధిక; రెండేళ్ళ గ్రూపులో ఎస్. శ్రీకాంత్; మూడేళ్ళ గ్రూపులో ఎస్. లక్ష్మి మాధురి 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితో పాటు, మొత్తం మీద మూడు గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. మే సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు — వివరాలతో సహా (ఫోటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫోటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫోటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు). ఏప్రిల్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.

[ వంచిత—కథ: 17 వ పేజీ నుంచి ]

నువ్వు కావాలి. నేను-పాపని ప్రేమించలేను సరికదా దెయ్యం పిల్లలాటి పాపంటే పట్టలేనంత అసహ్యం నాకు. పాపకి నా యింట్లోనూ జీవితంలోనూ కూడా స్థానం ఉండదు. అంటే - నీకు నేను కావాలో పాపే కావాలో తేల్చుకోవలసి ఉంటుంది. ఏట్టి పరిస్థితులలోనూ మీరిద్దరూ నా దగ్గరుండడం జరగదు. ఒకవేళ–నువ్వు నన్ను కాదని పాపవేపే మొగ్గితే- ఈ నర్సింగ్‌హోమ్ నుంచి సరాసరి మరో చోటుకి వెళ్ళిపో. డబ్బుకోసం నువ్వు చింతపడ నక్కరలేదు. మీ పోషణకి చాలినంతకంటె ఎక్కువ గానే ముట్టజెపుతాను. నీ నిర్ణయం అదే అయితే- త్వరలో కోర్టు ద్వారా విడాకులు తీసుకుని విడిపోదాం.''

ఒక్కొక్క మాటా ఒక్కొక్క పిడుగులా వినిపించింది యామినికి.

సౌందర్యాన్ని ప్రేమించి. అందాన్నారాధించే ప్రభులో యింత కఠినత్వం దాగుని ఉందా! అందంగా లేని పాప మీద అతనికెంత నిర్దయ! ఎంతకసి! ఎంత కోపం! అతని హృదయం యింత పాషాణ సదృశమా! పసిపాప మీద పగబట్టినట్లు ఎంత దారుణంగా మాట్లాడాడు!

'' నేను వెళ్తున్నాను. డిశ్చార్జయ్యేలోగా ఏదో ఒక నిర్ణయానికి రా.''

కళ్ళనిండా నీళ్ళతో - ఏమీ అనలేకపోయింది. శిలలా, శిల్పంలా మిగిలిపోయింది. అప్పుడే తెచ్చి పడుకోబెట్టింది కాబోలు-పాప ఏడుస్తూంది-గుక్క పట్టి. మెల్లగా తొట్టెలోకి చూసింది యామిని. తనని రక్షించమంటున్నట్లే ఏడుస్తూంది బేబీ.

'' బేబీ! జరుగుతున్నది నీకు తెలిసిపోయిందా? నువ్వెటువంటి వలయంలో చిక్కుకున్నావో అర్థమై పోతూందా?''

మెల్లగా పాపను గుండెలమీదకు తీసుకుంది.

యామిని కనులు మూతలుపడిపోయాయ్ - అనిర్వచనీయమైన ఆనందంతో. పాప - ఏడుపు ఆపింది వెచ్చని రక్షణ దొరికినట్లు.

'' నేను నిన్ను వదలను. అనాథను చెయ్యను. అమ్మానాన్నా లేక నేననాథనయ్యాను. ఎవరూ ఉండని ఆ జీవితం ఎటువంటిదో నాకు తెలుసు. చూస్తూ-నిన్నా దురదృష్టానికి ఎర చెయ్యను. నీకు నేనుంటాను పాపా, ఉంటాను. కలకాలం నీకు నేనుంటాను.''

*

భయపడిన గడియలు రానేవచ్చాయి.

డాక్టర్ నీలిమ విజిట్‌కివొచ్చి - '' యామినీ! ఇక మీరు యిక్కడుండాల్సిన అవసరమేమీ లేదు. మందులు వ్రాసిస్తాను. వాడుతూండండి చాలు. ఒకటి రెండు వారాలలో మీరు మామూలు మనిషైపోతారు'' అని-నవ్వుతూ దగ్గరకు వొచ్చి- చెవిలో రహస్యం చెబుతున్నట్లు—''మీవారిని రెండు నెలలపాటు మరీ దగ్గరకి రానివ్వకండి.'' అంది.

గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నా - బయటకు చిరునవ్వునవ్వి - సిగ్గునటించింది,

'' గుడ్‌లక్!'' అని వెళ్ళిపోయింది డాక్టర్ అక్కడి నుంచి.

'' సిస్టర్! నాకోసారి పెన్నూ కాగితమూ యివ్వవూ?''

తెచ్చింది సిస్టర్.

కళ్ళవెంట ధారలుకట్టి కురుస్తోంది కన్నీరు. కళ్ళు మసకలు వేస్తున్నాయి.

హద్దుమీరిన విచారంతో హృదయం తొణికి పోతూంది. చేతులు వణుకుతున్నాయి. అయినా ఆమె పట్టుదలగా వ్రాయసాగింది.

'' ప్రభూ!''

ఈ ఉత్తరం వ్రాయవలసివస్తుందని కలలో కూడా అనుకోలేదు. ఆదేమిటో, మొదటి నుంచీ నా జీవితం అనూహ్యమైన మలుపులే తిరుగుతూ వచ్చింది. ఇది - యిక చివరి మలుపే కావొచ్చు. అమ్మానాన్నలు ఆత్మహత్య చేసుకోగా అనాథనయి శరణాలయంలో పెరిగిన నన్ను అర్థాంగిని చేసుకుని అత్యద్భుతమైన దాంపత్య జీవితం అందించారు. ప్రేమంటే ఏమిటో చవిచూపారు.

నేను స్త్రీని. సెంటిమెంటనుకోండి, మరేమయినా అనుకోండి. స్త్రీ హృదయంలో ప్రేమించే అరలు రెండుంటాయి. ఆమె తన ప్రేమని భర్తకీ సంతానానికీ కూడా పంచి యివ్వాలనుకుంటుంది. భర్తనీ సంతానాన్నీ సమంగా ప్రేమిస్తుంది. సృష్టి నిర్దేశించింది స్త్రీని భార్యపాత్రే కాకుండా తల్లిపాత్ర కూడా ధరించమని. అమ్మ ననిపించుకోవాలని ఆరాటపడిపోయాను. చివరకా అదృష్టమూ వరించింది. కాని-నాకు అగ్నిపరీక్ష ఎదురయింది. నాలాగ ఎవరికథా ఉండదేమో! ఎంత దౌర్భాగ్యం!.... ప్రేమించిన భర్తో, ప్రసవించిన పాపో, ఎవరో ఒకరే దక్కుతారు నాకు. అతి క్లిష్టమైన పరిస్థితేమిటంటే — ఆ ఎన్నిక నేనే చేసుకోవలసి రావడం.

చాలా ఆలోచించాను, మానసిక సంఘర్షణకి లోనయ్యాను. ఎంతో ఆవేదన అనుభవించాను. విపరీతమైన దుఃఖంతో విలవిలలాడిపోయాను. చివరకి — నాకు సమంజసమూ సహేతుకమూ అనిపించిన నిశ్చయానికి రాగలిగాను.

ప్రభూ! ఈ వ్యవస్థలో మగవాడికి మరో భార్య దొరకడం కష్టమేమీ కాదు. స్త్రీ అందంతోటే తప్ప ఆమె అంతర్యంతో నిమిత్తం లేనప్పుడు అందగత్తెలు లభించడం మరీ సులభం. కాని—

అమ్మ మాత్రం దొరకదు. భార్య లెందరయినా దొరకవచ్చు కాని, అమ్మ ఒక్కతే. ఎవరి ప్రేమకీ నోచుకోక - అనాథగా బ్రతకడం ఎటువంటి శిక్షో నాకు అనుభవమే. నా దౌర్భాగ్యాన్ని పాపకి కూడా సంక్రమింపజేయడానికి నాకు మనస్కరించడంలేదు. ఈ వారసత్వం నాతో అంతరించిపోవాలి.

అందుకే - నేను పాపని వదలలేకపోతున్నాను. మీరంటే ప్రేమ, అనురాగం.... భక్తి, గౌరవం ఎలా ఉన్నాయో, పాపంటేనూ వాత్సల్యం:...జాలి.... శ్రద్ధ మమకారం ఉన్నాయి. పాపకి నేను తప్ప ఎవరున్నారని? గుడ్డు తెరవని పసిపాపని దిక్కు లేని దానిలా వదిలెయ్యడానికి మనస్సు అంగీకరించడం లేదు.

నేను అందంగా ఉన్నా.... నాకు పాప రూపం వెగటు కలిగించడం లేదు. పాప — నా కంటికి ముద్దుగానూ అందంగానే కనిపిస్తూంది - నిజంగా! నేను తల్లిని కావడంవల్లనేమో. కాకిపిల్ల కాకికి ముద్దే కదా?

క్షమించండి ప్రభూ! నన్ను క్షమించండి. మీరు నన్ను చాలా ప్రేమించినా ఆ ప్రేమను దక్కించుకోలేకపోతున్న దురదృష్టవంతురాలిని.

' భార్య ' పాత్ర ముగిసిపోయి - ' తల్లి ' పాత్ర ప్రారంభించడానికే నా మనసు మొగ్గుతూంది. స్త్రీ అంటేనే యింతే ఏమో.

నా అంతర్యం.... స్త్రీ హృదయం అర్థం చేసుకుని.... నన్ను క్షమించండి. శలవివ్వండి.

యామిని ''

ఉత్తరం సిస్టర్‌కిచ్చి.... '' వారొస్తే యివ్వు. బిల్లు వారు చెల్లిస్తా ''రని పాపను భుజాన వేసుకుని నర్సింగ్ హోమ్ మెట్లు దిగసాగింది యామిని. నీరు నిండిన కళ్ళు....తడబడుతున్న కాళ్ళు.... తొణుకుతున్న హృదయం....భుజం మీది పాపను మరింత దగ్గరగా పొదువుకుని నడవసాగిందామె విధి వంచితలా. □



**Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.**

# ఇది స్వస్తిక్ వారి చిహ్నం




అంటే ఉత్తమ నాణ్యతకు గుర్తు, ఉత్తమ ఉతుకుకు గుర్తు, ఉత్తమ తెలుపుకు గుర్తు

క్రొత్త! **నీలిరంగు స్వస్తిక్ డెటెర్జెంట్ ఉతికే బార్**

ధర తక్కువలో తక్కువ...
ఉతుకుతుంది ఎంతో చక్కగ

వెల: కేవలం రూ. 1.22
(స్థానిక పన్నులు అదనం)

Shilpi DM 5 79 Tel

